# చతుర

సంపుటి : 8    సెప్టెంబరు 1985    సంచిక : 8

## ఈ నెల సమగ్ర నవల

"వాడిప్పుడు పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు. ఊరిని సగం దోచుకున్న కామందు. వాడి చెప్పుచేతల్లో బోలెడు మంది ఉన్నారు. కనక ముఖాముఖీ ఎప్పుడూ తలపడకూడదు. వాడి పతనం నా కళ్ళారా చూడాలని వుంది. కాని, మనం కయ్యానికి కాలు దువ్వకూడదు. వాడి వేలుతో వాడి కన్నే పొడుచుకునేలాగా చెయ్యాలి. వాడి గొయ్యి వాడిచేతే తవ్వించి దానిలోనే పాతెయ్యాలి. అదే తెలివైనవాడు చేసేపని. అలాగ చెయ్యగలిగితేనే నువ్వు నా కొడుకువి'' అందామె.

ఏ అన్యాయాలకు గురై, సున్నితత్వానికి మరో రూపమైన స్త్రీలో ఆ విధమైన ప్రతీకారవాంఛ రగిలింది? ఆ తల్లి కడుపున పుట్టి, ఆమె పెంపకంలో సమర్థుడిగా ఎదిగిన ఆ...




తమ శత్రువుపై ఏవిధంగా బదులు తీర్చుకున్నాడు? ఉత్కంఠతో చదివించేలా...

## రావేటి రామకృష్ణారావు

రచించిన తాజా నవల 'కొడుకు' ఈ నెల చతుర సమగ్ర నవల!

---

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

ఫొటో ఫీచర్ : కె. వి. శ్రీహరి, బ్రహ్మదేవ్, యల్. ఆర్. గ్రోవర్, కె.కె. అగర్వాల్, సూరజ్ యన్. శర్మ

వ్యాఖ్యలు : నాగేంద్రదేవ్

1. మెదడు
2. మెదడు నరము
3. పీనస
4. పైనీల్
5. తల నరము
6. గొంతు
7. మెడ
8. థైరాడ్
9. వెన్ను
10. మూలవ్యాధి
11. ప్రోస్టేట్
12. గర్భాశయము
13. పెనిస్
14. అండాశయము
15. టెస్టిస్
16. లోయర్ లంబర్ అండ్ లింబ్ గ్లాండ్స్
17. హిప్స్
18. బ్లాడర్
19. ఇంటెస్టైన్స్




20. కోలన్
21. అపెండిక్స్
22. గాల్ బ్లాడర్
23. కాలేయము
24. [illegible]
25. వృక్కకము
26. మూత్రపిండము
27. కడుపు
28. ఎడ్రినల్
29. సోలార్ ప్లెక్సస్
30. ఊపిరి తిత్తులు
31. చెవి
32. కళ్ళు
33. నరములు, చెవులు
34. కోర్డ్ అండ్ నర్వ్స్
35. కన్నులు
36. గుండెకాయ
37. స్ప్లీన్
38. థైమస్



VIJAY DIWAN

# చతుర

## వింత పోటీ

కేరళలోని కొచ్చిన్‌లో కొన్ని సంఘ సేవా సంస్థలు కలిసి 60 పైబడ్డ వృద్ధులకు అక్కడి భారతీయ విద్యాభవన్‌లో అందాల పోటీ నిర్వహించాయి.

పోటీలో చాలా తక్కువమంది పాల్గొంటారని భావించిన నిర్వాహకుల్ని ఆశ్చర్యపరుస్తూ, కొచ్చిన్ నుంచే గాక ఇతర ప్రాంతాలనుంచి కూడా వందలాది వృద్ధులు హాజరయ్యారు. వారిలో కొందరు 90 సంవత్సరాలవాళ్లు కూడా ఉన్నారు.

ఆ వృద్ధులకు ముందుగా ఫ్యాన్సీడ్రెస్, అనర్గళంగా ప్రసంగించే, వేగంగా నడిచే పోటీలను నిర్వహించారు. మూడు పోటీలలోనూ అత్యధిక మార్కులు సంపాదించిన వృద్ధుడు, వృద్ధురాళ్ళను 'వృద్ధరాజు', 'వృద్ధరాణి'గా ప్రకటిస్తారు.

'ఫ్యాన్సీడ్రెస్' పోటీలో కొందరు వృద్ధులు వయసుకు తగ్గ బట్టలు ధరిస్తే మరికొందరు వయసు సంగతి విస్మరించి కుర్రకారు ధరించే బట్టలతో దర్శనమిచ్చారు. కొందరు గాంధీజీ వస్త్రధారణలో వుంటే, చాలామంది రోదసి యాత్రికుడు రాకేశ్‌శర్మలా వేదికమీదికి వచ్చారు. ఇక ఆడవారైతే మదర్‌థెరిస్సా, కస్తూరిబాలకు మల్లే అలంకరించుకున్నారు.

తర్వాత 'నా జీవితానుభవాలు' అనే అంశంపై ప్రసంగించే పోటీ జరిగింది. వక్తలు మలయాళం లేదా ఆంగ్లభాషలో ప్రసంగించాలి. కాని, చాలామంది ఆ రెండు భాషల్నీ కలిగలిపి మాట్లాడారు. కొందరు హాస్య సంఘటనల గురించి చెబితే, ఎక్కువమంది తామెలా తమ బిడ్డల నిర్లక్ష్యానికి గురవుతున్నదీ ఆవేదనతో వెల్లడించారు. వేగంగా నడిచే పోటీలో వృద్ధులు ఉత్సాహంతో తమ చేతి కర్రలను వదిలేసి మరీ పాల్గొన్నారు.

మూడు పోటీలూ ముగిసేసరికి న్యాయనిర్ణేతలు సందిగ్ధంలో పడ్డారు. చాలా మందికి మార్కులు సరిసమానంగా వచ్చాయి.



# ప్రపంచం

దాంతో మార్కులు సమానంగావచ్చిన వారిని తమలో ఏదైనా ప్రత్యేక ప్రతిభ వుందే ప్రదర్శించమని కోరారు.చాలామంది భక్తిసంగీతం నుంచి 'ఒసిబిసా' పాటల వరకూ పాడి విన్పించారు. కొందరు పాటమేకాక నృత్యం కూడా చేశారు. కుర్రాళ్ళలా హుషారుగా సాంబా, రాకెన్‌రోల్, ట్విస్ట్ డేన్సులు చేశారు. ఓ వృద్ధజంట నృత్య గానాలతోపాటు పక్షులు, రాజకీయ నాయకుల్ని మిమిక్రీ చేయడంతో పోటీలో వారే గెలుపొందారు.

వృద్ధరాజుగా ఎన్నికైన 74 ఏళ్ల కురియన్ భారత నావికాదళం నుంచి రిటైరైన ఉద్యోగి. వృద్ధరాణి బ్రిజెట్ కొచ్చిన్ నౌకాశ్రయం దగ్గిరలో నివసిస్తోంది. వారిద్దరికీ ప్రేక్షకుల హర్ష ధ్వానాలమధ్య కిరీటధారణ జరిగింది.

## ఆత్మహత్యా మార్గం

ఫ్రాన్సులో మాదకద్రవ్యాలకి బాగా అలవాటుపడ్డ పేట్రిక్‌బాండీ అనే 27 ఏళ్ల యువకుడు ఓ మత్తుమందును అధిక మోతాదులో తీసుకుని జీవితాన్ని అంతం చేసుకున్నాడు. మైకేల్ ఫాబిలియో అనే మరో ఫ్రెంచి యువకుడు ట్రాంక్విలైజర్లు అధికంగా వాడి జీవితాన్ని చాలించాడు. డెన్నిస్ అదర్‌మాన్ అనే ఫ్రెంచి కుర్రాడు కూడా ఆత్మహత్యచేసుకున్నాడు. ఆ విధంగా ఆత్మహత్యలు చేసుకున్న ముగ్గురి మృతదేహాల పక్కనా 'విజయవంతంగా ఆత్మహత్యచేసుకోవడం ఎలా?' అనే పుస్తకాన్ని కనుగొన్నారు. అది ఆత్మహత్యకు ఎలాంటి అవరోధాలూ కలగకుండా తీసుకోవలసిన ముందు జాగ్రత్తల గురించి వివరించే పుస్తకం!

యూరోపియన్ దేశాలలో 'స్నేహితుల్ని సంపాదించుకోవడం ఎలా?', 'వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవడం ఎలా?', 'మీకు నచ్చిన యువతికి మీరు నచ్చేటట్టు చేసుకోవడం ఎలా?' లాంటి తరహా పుస్తకాలు విరివిగా వెలువడుతుంటాయి. ఆ జాబితాలో ఇటీవల 'విజయవంతంగా ఆత్మహత్య చేసుకోవడమెలా?' అనే పుస్తకం కూడా చేరి, ఫ్రాన్సులోనే కాక ఇతర పాశ్చాత్యదేశాలలోకూడా వివాదా



స్పదమైన పుస్తకంగా వార్తల్లోకెక్కింది. 276 పేజీల ఆ పుస్తకం వెలువడటం ఆలస్యం విపరీతంగా అమ్ముడుపోయి 'బెస్ట్ సెల్లర్' అన్పించుకుంది.

ఆ పుస్తకంలో ఆత్మహత్య చేసుకునేందుకు వివరంగా సూచనలివ్వబడ్డాయి. ప్రశాంతంగా చనిపోయేందుకు ఏయే మాత్రలు, వివిధరకాల విషపదార్థాలను ఏమోతాదులో మింగాలో వర్ణించబడివుంది.

ఆ పుస్తక ప్రచురణకు అనుకూలంగా, వ్యతిరేకంగా ఫ్రాన్సులోని ప్రజలు, నేతలలో భిన్నాభిప్రాయాలువ్యక్తమయ్యాయి. ఫ్రాన్సు ఆరోగ్యమంత్రి జాక్ బేలైద్ ఆ పుస్తకంపై నిషేధం విధించేందుకు చట్టపరంగా గల కారణాలకోసం శోధిస్తున్నాడు. పుస్తకంలోని సూచనలననుసరించి ఆత్మహత్య చేసుకున్న పేట్రిక్ బాండీకి తండ్రి అయిన మార్సెల్ బాండీ 'దాన్ని తక్షణమే బేన్ చేయాలి' అంటూ ఉద్యమం లేవదీసాడు.

అయితే ఆ పుస్తకపు ప్రచురణ కర్తయిన ఎలాన్ మేరియో 'ప్రతిమానవుని లోనూ ఆత్మహత్య చేసుకోవడంపై అంతర్గతంగావుండే కోరికను రూపుమాపడమే ఈ పుస్తక ప్రచురణలోని వుద్దేశం. దీన్ని వెలువరించడంలో నేను చేసిన తప్పేమీలేదు" అంటున్నాడు అతితెలివిగా.

## 'బాండో' ఆదివాసులు

ఒరిస్సా రాష్ట్రంలో 62 జాతుల ఆదివాసులున్నారు. వారిలో చాలా పురాతన కాలం నుంచీ వున్న 'బాండక్' అనే ఆదివాసులు ఒరిస్సా దక్షిణ భాగమైన కోరాపుట్ ప్రాంతంలో 'బాండో' పర్వతాలపై సముద్ర మట్టానికి 3,800 అడుగుల ఎత్తున నివసిస్తున్నారు.

వారిలో డబ్బుకు బదులు వస్తు మార్పిడి పద్ధతే ఇంకా కొనసాగుతోంది. పనసపళ్లు, తేనె, అరటిపళ్లను, నాగరికులకి ఇచ్చి బదులుగా బియ్యం, ఉప్పు, రంగురంగుల పూసలను స్వీకరిస్తారు. వాళ్లు మాట్లాడే అడవి భాషలో కొద్దిగా ఒరియా పదాలుంటాయి.

'బాండో' ఆదివాసీ స్త్రీల వస్త్రధారణ తమాషాగా వుంటుంది. వాళ్లు ఓ రకమైన చెట్టు బెరడునుంచి నారను తీసి వస్త్రంగా నేసి మొలకి చుట్టుకుంటారు. వయసుతో సంబంధం లేకుండా ఆడవాళ్లందరూ జుట్టు తీసేసి, నున్నటి గుండ్లపై రంగురంగుల పూసలను అలంకరించుకుంటారు. చెవులకి, కంఠానికి వెండి ఆభరణాలు, మెడనుంచి నడుము వరకూ రంగు రంగుల పూసలను ధరిస్తారు. ఆత్మ రక్షణ కోసం వారివద్ద ఎప్పుడూ ఓ చురకత్తి వుంటుంది.

'బాండో' పురుషులు పొడవుగా జుట్లు పెంచుకొని జడలల్లుకొంటారు. వారివద్ద ఎప్పుడూ ధనుర్బాణాలు వుంటాయి. మొలకి ఆచ్ఛాదనగా మందపాటి వస్త్రం చుట్టుకుంటారు.

'బాండో' ఆదివాసుల వివాహాచారం చాలా వింతగా వుంటుంది. వారు తమ గ్రామంలోని యువతీ యువకుల కోసం ఓ చిన్న గుడిసెను ప్రత్యేకంగా కేటాయిస్తారు. సాయంత్రపు వేళల్లో అవివాహిత యువతీ యువకులు ఆ గుడిసెవద్ద సమావేశమై నృత్య గానాలతో కాలక్షేపం చేస్తారు. కాలక్రమంలో ఒకరిపై ఒకరికి ఆసక్తి కలిగి పెళ్లిళ్ల జరుగుతాయి.







ఓ యువకుడు ఓ యువతిని ప్రేమిస్తున్నట్టు తెలియగానే అతని స్నేహితులు ఆ యువతిని ఎత్తుకుపోయి ఒకచోట రహస్యంగా దాచేస్తారు. అతని ప్రేమ స్థిరమైనదైతే ఎంత గాలించయినా ఆమె ఆచూకీ తెలుసుకుంటాడని వారి వుద్దేశం. దానిలో అతను సఫలీకృతుడైతే, ఆమెను భార్యగా స్వీకరించి జీవితమంతా విడిపోకుండా కాపురం చేయాలి.

ఓ చెట్టునుంచి సేకరించే 'సలాబ్' అనే పానీయం బాండో ఆదివాసులకి ప్రీతిపాత్రమైనది. ఆడ మగ, వయో తారతమ్యాలు లేకుండా వారంతా 'సలాబ్' పానీయాన్ని తాగుతారు. దాని ప్రభావంతోనే వారి మధ్య అనేక పోట్లాటలు కూడా జరుగుతాయి.

'బాండో'లకి ఇష్టమైన కాలక్షేప సాధనం వేట. వాళ్లు వరి, జొన్నలతో చేసిన ఆహారం, పంది, మేక మాంసాలు ఎక్కువగా తింటారు.

సాధారణంగా ఆదివాసులు ఐకమత్యంగా జీవిస్తారు. ప్రతి ఆదివాసీ జాతికి తమదంటూ ఓ పూజనీయమైన జంతువు, వృక్షమూ వుంటాయి. ఆ జాతిలోని వారెవరూ ఆ జంతువుకిగాని, చెట్టుకిగాని ఎలాంటి హానీ తలపెట్టరు. ఒకే జాతికి చెందిన ఇద్దరు ఆదివాసులు ఒకరినొకరు చంపుకోవడం కూడా వుండదు.

రోమన్ చక్రవర్తి జూలియస్ సీజర్ ప్రాచీన రోమను ఆదివాసుల గురించి ఓ ఆసక్తిదాయకమైన పుస్తకం రాశాడు. అందులో "కోయలనే ఆదివాసుల నాయకుడు పండుగ దినాల్లోనే మద్యం, వస్త్రాలను బహుమతిగా స్వీకరిస్తాడు. ఆరోజుల్లో అతనికి ప్రత్యేకంగా రెండు ధోవతులు, కోడిపుంజులను బహూకరించే ఆచారముంది. ప్రతివారూ తాము వేటాడి సంపాదించినదానిలో కూడా తప్పనిసరిగా అతనికి కొంత భాగమివ్వాలి. నాయకుడు ఎవరినైనా సరే పిలిచి సేవలు చేయించుకోవచ్చు. అయితే ఇన్ని నియంతృత్వాధికారాలున్నా కోయల నాయకుడు ప్రజా సంక్షేమాన్ని, వారి సెంటిమెంట్లను దృష్టిలో పెట్టుకుని వ్యవహరించాల్సి వుంటుంది" అని వర్ణించాడు.

'నాగర్' అనే ఆదివాసుల్లో ఎక్కువ జంతువుల్ని వేటాడినవారికి పెళ్ళి

ప్రఖ్యాతులొస్తాయి. 'మయోరి' ఆదివాసుల్లో ఎవరికైనా నాట్యంలో వున్న నేర్పును బట్టి పేరొస్తుంది. బాంగో ఆదివాసులు ఇతరులకు బాగా తాగించడం హోదాగా భావిస్తారు.

ఆదివాసులందరికీ ఆచార సాంప్రదాయాలపై మంచి గురి, మూఢనమ్మకాలు గాఢంగా వుంటాయి. వాళ్లు 'దేవుడికి తమపై కోపం వస్తేనే రోగాలొస్తాయి' అని నమ్ముతారు.

## పేరుకోసం పాట్లు

తమ పేరు గిన్నెస్ బుక్‌లోకి ఎక్కాలనే



ప్రయత్నంలో పొరపాటుచేసి ఆ విధంగా పేరుపడ్డవారు కూడా వున్నారు. గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ సంపాదకుడు నోరిస్ మక్‌వీల్‌టర్ అలాంటి ఉదంతాల గురించి ఇటీవల ఓ వ్యాసంలో రాశాడు.

ఓ జపానీయుడు అతి నెమ్మదిగా 5 గంటలపాటు సైకిలు తొక్కి గిన్నెస్‌బుక్‌లో చోటుచేసుకున్నాడు. అది చూసిన ఓ అమెరికన్ మహిళ తాను 8 గంటలపాటు అతినెమ్మదిగా సైకిలు తొక్కి పైరికార్డును అధిగమించినట్టు గిన్నెస్ బుక్ సంపాదకుడికి రాసింది. దానికి రుజువుగా ఫొటోలు కూడా పంపింది. ఆ ఫొటోలలో ఆమె స్టేండువేసిన సైకిలుపై కూర్చుని వుంది. అది రికార్డుగా పరిగణింపబడదని గిన్నెస్ బుక్ సంపాదకుడు ఆమెకు జవాబు రాశాడు.

దానికా అమెరికన్ మహిళ, "ఈ వ్యవహారాన్ని కోర్టులో తేలుస్తాను. స్టేండు వేయని సైకిలుపై కూర్చోవాలని మీరు ఎక్కడా పేర్కొనలేదుగదా" అని వాదించింది. "మీరు కోర్టుకి వెళితే మాకు కూడా మంచి ప్రచారం లభిస్తుంది... కానివ్వండి" అంటూ సిద్ధపడ్డాడా సంపాదకుడు. దాంతో ఆ మహిళ కిమ్మనకుండా వూరుకుంది.

గిన్నెస్‌బుక్ ప్రకారం ప్రస్తుతం ప్రపంచంలోకెల్లా వృద్ధుడు జపాన్‌కి చెందిన షికిచియో ఎషుమి. 117 ఏళ్ళ ఆ వృద్ధుడు అస్వస్థత అనేది ఎరగడు. అతను తలగడ వుపయోగించకుండా చెక్కబల్లపై నిద్రిస్తాడు. 105 ఏళ్లు వచ్చే దాకా అతనో చక్కెర ఫ్యాక్టరీలో పని చేశాడు. అతని పళ్ళు చాలావరకూ ఇంకా దృఢంగానే వున్నాయి. ఒక కంటి దృష్టి బాగావున్న అతను రెండేళ్ళ క్రితంవరకూ చేతికర్ర కూడా వుపయోగించేవాడు కాదు.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



## మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా, ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే, వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటు దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

మురళి పరుపుమీద అటూఇటూ పొర్లు తున్నాడు. కళ్లు మూసుకుని ఎంత ప్రయత్నించినా నిద్ర రావడంలేదు.

ఊరు విడిచిపెట్టి పాతిక సంవత్సరాలు కావస్తూంది. ఉన్నవూరు కన్నతల్లి అన్నారు. కన్నతల్లి తన కన్నులముందే వున్నా ఉన్న ఊరుకి మాత్రం చిన్నతనం లోనే దూరమయ్యాడు.

తనకేలోటూ లేదిప్పుడు. తల్లి ఆజ్ఞ జవదాటకుండా క్రమశిక్షణతో పాలి టెక్నిక్‌లో చదివి ఫస్టుక్లాసులో పాసయ్యాడు. ఉద్యోగాలకి ఎగబడకుండా మామయ్య ప్రోత్సాహంతో ఎలక్ట్రానిక్స్ దుకాణం తెరిచి రేడియోలు, టెలివిజన్ సెట్లూ సేల్సూ సర్వీసింగు మొదలు పెట్టాడు. అప్పుడే టి.వి. స్టేషన్లు జోరుగా పెట్టడంవల్ల వ్యాపారం లాభసాటిగానే నడిచింది. ఏసియాడ్ టైమ్‌లో ఎక్కువ సెట్లు అమ్మి బెస్టు బిజినెస్‌మన్ అనిపించు కుని డబ్బు సంపాదించాడు. చిన్నప్పటి నుంచీ అండదండలుగావుండి చదివించిన మామయ్య కూతుర్నే పెళ్ళిచేసుకున్నాడు. తన అభిరుచులకు అనుగుణంగా ఓ మంచి ఇల్లు కట్టుకున్నాడు. తన కోసం ఒక స్కూటరు, దుకాణంలో వాడటానికో స్కూటరు కొన్నాడు. అవసరమను కున్నప్పుడు కారు కొనడానికి తగినంత బేంకు బాలన్సు వుంది.

అయినా ఏదో లోపం!

ఈ సంపాదించింది. అంతా ఎవరి కోసం? తన ప్రయోజకత్వాన్ని ఎవరో తెలుసుకోవాలి. ఎవరికో ప్రదర్శించాలి...

చిన్ననాటి జ్ఞాపకాలు ముసురు కున్నాయి. పుట్టినవూరు మదిలో మెది లింది. తన పాతికేళ్ళూ ఊరు చూడకుండా ఎలాగ వుండగలిగాడు. బాల్యమిత్రుల్ని చూద్దామని ఎంత ఆవేదనపడ్డాడు. ముఖ్యంగా ప్రసాద్ తన ఆలోచనల్లోనే వుండేవాడు. కాని అమ్మ అనుమతించేది కాదు.

"వద్దుబాబూ... ఆ వూరింక వెళ్ళొద్దు. మనకా వూరితో ఇంక సంబంధంలేదు. మనకింక అక్కడెవ్వరూలేరు. నువ్వు బాగా చదువుకుని ప్రయోజకుడివవ్వాలి. మీనాన్న పేరు నిలబెట్టాలి..అంతే" అనేది.

"నేను చదువుకుంటున్నాను కదమ్మా! ఒకమారు వెళ్ళి చూసొస్తే ఏమౌతుంది?" అనేవాడు.

తల్లి కళ్ళనీళ్ళు పెట్టుకునేది. ఒకోసారి ఏడ్చేది. తనకీ ఏడుపొచ్చేది.

"ఆరోజు వస్తుంది మురళీ...నువ్వు పెద్దయ్యాక వెళుదువుగాని. నిన్ను చూసి ఆ వేణుగోపాలరావు కొడుకు పులికడుపున పుట్టినపులిపిల్ల అనుకునేలాగ తయారుచేసి అప్పుడు పంపిస్తాను" అని ఊరడించేది.

చదువుతోబాటు ఆటల్లో కూడా ప్రోత్సహించేది.

కాని, మామయ్య అడ్డంవచ్చి, "అక్కా! వీణ్ని నువ్వు చెడగొడుతున్నావు. ఆటల మీదున్నంతశ్రద్ధ వీడికి చదువుమీదలేదు" అని కోప్పడేవాడు.

"చదువొక్కటే ముఖ్యంకాదు...ఆరో గ్యానికి ఆటలు కూడా అవసరం. శరీరం గట్టిపడుతుంది. గెలుపు ఓటములను సమానంగా ఎదుర్కొగల నైజం ఏర్పడు తుంది. వాడే చదువుకుంటాడులే" అని మామయ్యను సమాధానపరిచేది.

హెచ్.యస్.సి.లో స్కూలుకే ఫస్టు వచ్చాడు తను. అమ్మ ఎంత పొంగి పోయిందో. మామయ్యఆశ్చర్యపోయాడు. కూతురు సురేఖనీ, తననీ సినిమాకి తీసు కెళ్ళాడు ఆరోజు.

 

ఆ వేసవి సెలవుల్లోనే ప్రకృతి ఆశ్రమంలో చేర్పించి ఆసనాలు నేర్చుకొమ్మని వేకువజామునే లేపి పంపించేది అమ్మ. కరాటే స్కూలులో చేర్పించి అవీ నేర్చుకొమ్మంది. తనకి ఇష్టం లేకపోయినా అమ్మకోసం నేర్చుకోవాలనుకున్నాడు... నేర్చుకున్నాడు.

మామయ్య "ఏమిటే..నీవరసచూస్తుంటే వీడినొక గూండాలాగ తయారుచేసేలా వున్నావు. ఇలాటి విద్యలునేర్చుకున్న వాళ్లు అందరిమీదా తిరగబడతారు. లేనిపోని తగువులు ఇంటిమీదకి తేగలడు" అని మందలించాడు.

"నీ మొహం...ఏ వయస్సులో నేర్చుకునేది ఆ వయస్సులో నేర్చుకోవాలి. మొక్కప్పుడు వంగనివాడు మానై వంగడు. శరీరం రాటుతేలుతుంది. బలం వున్నవాడు ఎదుటివాణ్ని ఎప్పుడూ కొట్టడు. ఆత్మరక్షణకోసమే దానిని వాడుకుంటాడు. మనమురళికూడా అంతే" అని సమాధానం చెప్పింది అమ్మ.

"నీకివన్నీ ఎలా తెలుసునే అక్కా! పల్లెటూర్లోనే ఎక్కువకాలంగడిపావుగదా" అని ఆశ్చర్యపోయాడు మామయ్య.

"తెలుసుకోవాలనుకున్నవారికి పట్టణాలూ కాలేజీలూ అవసరం లేదు. పుస్తకాలు నేర్పుతాయి. జీవితం నేర్పుతుంది. అనుభవాలూ, అవసరాలూ నేర్పుతాయిరా!"

అమ్మ మాటల్లో ఏదో ఆవేదన, ఎవ్వరూ చదవలేని ఓ లోతైన బాధ తనకి కనిపించేవి. ఎపుడూ ఉదాసీనంగా వుండేది. అలా అని తన విషయంలో ఏ అశ్రద్ధా, నిర్లక్ష్యం కనిపించేది కాదు.

జరగకూడనిదేదో జరిగివుంటుంది. ఇంక అమ్మని మాటిమాటికి బాధపెట్టకూడదుఅని వూరుకున్నాడు. ఇంకెప్పుడూ పూరుమాట ఎత్తలేదు.

ఇంటర్ పాసయ్యేదాకా కరాటే, కుంగ్‌ఫూ వంటివన్నీ నేర్చుకున్నాడు. ఆయుధాల అవసరంలేకుండానే నలుగుర్ని నేలకరిపించగల చాకచక్యం అబ్బింది. ప్రత్యర్థి దెబ్బనివంటోవంతు సెకండులోనే పసికట్టి తప్పించుకోగలఒడుపుశరీరంలోని అన్ని అంగాలకి అబ్బింది. ఉదయమే లేచి డాబామీద ఓ గంటసేపు ఆసనాలూ, కరాటే ఎక్సర్‌సైజులూ చేయకపోతే కండరాలు శరీరంమీద ఎదురుతిరిగే స్థితికి వచ్చాయి. చచ్చేదాకా ఇక వీటిలో మార్పు వుండకూడదనుకున్నాడు.

ఇప్పుడో...విజయవంతంగా షాపుని నడుపుతున్నాడు. పెళ్ళి చేసుకున్నాడు. మరి ఎందుకు సొంతవూరు వెళ్ళి రాకూడదు. ఈరోజు అమ్మని ఎలాగైనా ఒప్పించాల్సిందే! ఊరువెళ్ళి అందరినీ కలుసుకోవాలి. ఓ ప్రయోజకుడిలాగ వారి ముందు నిలబడాలి అనుకున్నాడు.

ఆలోచనల్లోనుంచి బయటపడేవేళకు వంటింట్లోనుంచి శబ్దాలు వినిపించడం మొదలుపెట్టాయి.

వంటింట్లో అన్నపూర్ణమ్మా, సురేఖా సామాన్లు సర్దుతున్నారు.

పడకగదిలోనుంచే "అమ్మా..."- అని పిలిచాడు మురళి.

కాస్సేపట్లో బెడ్‌రూమ్ తెర ఒత్తిగించి "ఏం బాబూ?" అని పలికింది అన్నపూర్ణమ్మ.

"ఇలా వచ్చి ఆ కుర్చీలో కూర్చో. ఈ వేళ నీతో చాలా సంగతులు మాట్లాడాలి" అని కుర్చీ చూపించాడు.

కూర్చుంది తల్లి.

"అమ్మా! సాయంత్రం మన వూరి

నుంచి ప్రసాద్ వచ్చాడు" అని చెప్పాడు.

"ఏదీ...ఇంటికి తీసుకురాలేక పోయావా" అంది.

"ఏవో పనులున్నాయని చెప్పి వెళ్ళి పోయాడమ్మా! నన్ను ఊరు ఎలాగైనా రమ్మన్నాడు. వారంరోజుల్లో తప్పకుండా వస్తానని మాటిచ్చానమ్మా" అన్నాడు.

అన్నపూర్ణమ్మకి ఊరు మదిలో మెదిలింది. పదిహేనేళ్ళ వైవాహిక జీవితం. భర్త వేణుగోపాలరావు అనురాగం, ఆయన పోవడం, తన కష్టాలు, మిగిలిన ఒక్క పసికందును తీసుకుని హైదరాబాదు వచ్చి తమ్ముడు ఆనందరావు పంచన చేరడం...అన్నీ వరసగా జ్ఞాపకం వచ్చాయి.

కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి. చెంగుతో కళ్ళు తుడుచుకుని-

"నువ్వు ఆ వూరెళ్ళొద్దు బాబూ! అక్కడ నిన్ను కాటేసే కాలనాగుంది" అంది భయాన్ని వ్యక్తంచేస్తూ.

"అమ్మా ఎప్పుడూ ఇలాగే అంటావు. నీకేం భయం లేదమ్మా. కాలనాగుని నీ కొడుకు కాలరాస్తాడమ్మా. ఎప్పుడు ఊరు మాటొచ్చినా ఏడుస్తావు. అసలు జరిగిందేమిటో చెప్పు" అని నిలదీశాడు.

"చెపితే నువ్వు తట్టుకోలేవు బాబూ! పీడ కలలాంటి ఆ అనుభవాలని నాతోనే సమాధి అయిపోనియ్యి. నువ్వు ఆ వూరి సంగతి మరిచిపో"

"ఎందుకమ్మా...ఎందుకని మరిచి పోవాలమ్మా! మన పొలాలూ ఆస్తులూ పోయినా.. ఇల్లుంది, చుట్టాలున్నారుగదా"

మాటని మధ్యలోనే తుంచి, "వున్నారు చుట్టాలు. ఎవరు...మీ చిన్నాయన రాఘవయ్యేనా చుట్టం. పాలివాని పగ నీకు తెలియదురా మురళీ" అని మళ్ళీ ఏడవసాగింది.

"జరిగిందెప్పుడూ పూర్తిగా చెప్పవు. నీతో వచ్చిన చిక్కే అది. ఈవేళ చెప్పకపోతే నా మీద ఒట్టే" అన్నాడు.

"అంత మాటనకురా! నిన్ను ఇంత ప్రయోజకుడిగా తయారు చేసింది నా పగ తీర్చుకోడానికే. కానీ ఇప్పుడు ఆ ప్రతీకారం తీర్చుకోవాలి అనే కోరిక చచ్చిపోయింది. నీవూ ఓ ఇంటివాడివయ్యావు. ఎంతో సంపాదిస్తున్నావు. ఎందుకు చెప్పు పట్టుదలలకి పోవడం" అంది.

"అదేం కుదరదు. జరిగింది జరిగినట్లు చెప్పు. మనం పొలాలు అమ్ముకునే పరిస్థితి ఎందుకు వచ్చింది. కట్టుబట్టలతో ఊరు ఎందుకు విడిచిపెట్టామో చెప్పి తీరవలసిందే. లేకపోతే నన్ను చంపుకు తిన్నట్టే" అనేశాడు.

"నువ్వు మరీ అంత పట్టుబడితే చెప్పకేం చేస్తాను. కాని నువ్వు ఉద్రేకపడకూడదు. బుద్ధిమంతుడిలాగా ప్రవర్తించాలి" అని ఒప్పించింది.

"నీ మాట ఎప్పుడు కాదన్నానమ్మా" అనగానే-

"అయితే విను...భర్తపోయినతరవాత ఒక పల్లెటూరి స్త్రీజీవితం ఎలావుంటుందో తెలుసుకో. ఇది ఓ కన్నీటి కథ" అని చెప్పడానికి ఉపక్రమించింది.

వంటగదిలో పనిపూర్తిచేసుకునివచ్చిన సురేఖ కూడా మరో కుర్చీలో కూర్చుంది. అత్త చెప్పే కథలంటే చెవికోసుకునే శ్రీధర్ కూడా పుస్తకాలు ఓమూలనపడేసి వచ్చాడు.

* * *

"పెళ్ళిచేసుకుని, పుట్టిన అనకాపల్లి నుంచి మెట్టిన ఆ పల్లెటూరికి మీ నాన్నగారితో కాపురానికి వెళ్ళాను. అప్పుడు

మనకున్నది మూడు నాలుగెకరాల పల్లపు భూమి మాత్రమే. ఆరోజుల్లోనే మీ నాన్నగారు ఇంటర్ పాసయ్యారు. కావాలనుకుంటే మంచి ఉద్యోగమే దొరికేది. కాని ఆయన పల్లెటూళ్ళోనే వ్యవసాయం చేస్తూ వూరిని అభివృద్ధి చెయ్యాలని సంకల్పించుకున్నారు. నాకూ అలాంటి ఆదర్శాలంటే ఇష్టమే. చదువుకున్నవాళ్లు పల్లెటూళ్ళలో స్థిరపడితే విద్యావంతుల శాతం పెరుగుతుంది. వాళ్ళని చూసి ఇతరులు చదువుకుంటారు, నాగరీకులౌతారు అనే అభిప్రాయం నేను స్కూల్లో చదువుకునేరోజుల్లోనే వుండేది. అదృష్టవశాత్తూ అలాటి భావాలే ఉన్న మీ నాన్న దొరికారు. జీవితం నందనవనంలోలాగ హాయిగా గడిచింది.

ఆయన వ్యవసాయంతోబాటు టోకున వేరుశనగ, ధాన్యం లాంటివి కొని తక్కువ లాభాలు వేసుకుని అమ్మినా ఎంతో సంపాదించారు. నాలుగెకరాలనీ ఇరవై ఎకరాలు చేశారు.

నేను కాపురానికి వెళ్ళేనాటికి మీ బాబాయి రఘుకి ఇంకా హైస్కూలు చదువు పూర్తికాలేదు. తమ్ముణ్ని పెద్ద చదువులుచదివించి ఆఫీసర్ని చేద్దాం అని కలలుకనేవారాయన. కానిరఘుఒట్టిపోకిరీగా తయారయ్యాడు. ఎస్.ఎస్.ఎల్.సి. తప్పి ఇంక చదవననీ, వ్యవసాయం చేస్తాననీ కూర్చున్నాడు. గత్యంతరం లేక వ్యవసాయం పనులు అతనికే ఒప్పగించారు. ఊళ్ళో పనులూ, వ్యాపారం తను చూసుకునేవారు మీ నాన్న.

తమ్ముడి అండ ఎలాగూ వుందిగదా అనిరెండెకరాల గరువు భూమికొని అంటు మామిడితోట వేశారు ఆ సంవత్సరమే. పెళ్ళయినమూడోఏట మీఅక్క పుట్టింది" అని వూపిరి తీసుకుంది.

అక్క మాటరాగానే మురళీకృష్ణకు లీలగా పాతికేళ్ళ కిందటి దుస్సంఘటన మదిలో మెదిలింది.కాని అమ్మ చెబుతున్న దాంట్లో మధ్యన కలగజేసుకోదలచలేదు. ఏకాగ్రతతో వినసాగాడు.

"ఆ మరుసటి సంవత్సరమే తమ్ముడు రఘుకి పెళ్ళిచేశారు. అప్పటినుంచే అన్నదమ్ముల మధ్య స్పర్థలు బయలుదేరాయి. రాఘవయ్యలో స్వార్థబుద్ధి ప్రవేశించింది. పొరపొచ్చాలొచ్చేక ప్రతిదానికీ రాద్ధాంతం జరిగేది. మనసు విరిగిన తరవాత కలిసి వుండటం కష్టమయింది రాఘవయ్యకి.

ఒకరోజు రాత్రి, "అన్నయ్యా...నేను వేరే వుంటాను. నా దారి నేను చూసుకుంటాను. నా వాటా నాకు పంచెయ్యి" అని అడిగాడు.

"రఘూ! ఆపని మాత్రం చెయ్యకురా. నీకొచ్చిన కష్టం ఏమిటి? నలుగురూ ఏమనుకుంటారు? పెళ్ళిళ్ళు కాగానే కలిసి వుండలేకపోయారు- అని నలుగురూ చెప్పుకుంటారు. విడిపోతే ఈ ఆప్యాయతలుండవు. కుండ వేరవగానే గుణం వేరవుతుంది...నా మాట విను" అని ఎంతో నచ్చజెప్పారు.

"నీకేం....ఊరిమీద తిరిగి ఎన్నైనా చెబుతావు. పొలంలో కష్టపడేవాడికి తెలుస్తుంది" అన్నాడు కర్ర విరక్కొట్టినట్లు.

ఊరిమీద తిరగడం తేలిక అనుకున్నాడు మూర్ఖుడు. ఊరిమీద తిరిగే ఎన్నో వ్యవహారాలు చేసి ఆ భూములు కొన్నారని, ఆస్తిని అంత పెంచారని వాడికేం తెలుసు. అయినా ఆయన కోపం తెచ్చుకోలేదు.

"అదే కదా నీ బాధ. రేపటినుంచి




రోజూ నీతోటే పొలంలో పనిచేస్తాను. సరేనా ...ఇంక పంపకాలమాట ఎత్తకు'' అని సర్దిచెప్పారు.

ఆ గొడవ జరిగిన రాత్రి నేను మీ నాన్నగారితో, "పోనీ ...ఆ పంపకాలేవో చేసి మీ తమ్ముడి వాటా ఇచ్చెయ్య గూడదా. మనసులో అలాంటి వేర్పాటు భావం పుట్టినప్పుడు మీరెంత ఉదారంగా ప్రవర్తించినా, స్వార్థబుద్ధితోనే మీరు వాడిని విడిపోనివ్వడం లేదని ఊరంతా చాటుతాడు" అని చెప్పాను.

"వాడింకా చిన్నవాడు. రేపో,ఎల్లుండో వాడే అర్థంచేసుకుంటాడు. వాడు అర్థం చేసుకుంటే చాలు...లోకం ఏమనుకున్నా ఫరవాలేదు" అనేవారుగాని పంపకాలకు ససేమిరా ఒప్పుకోలేదు. అదే వారి నాశనానికి వచ్చింది.

ఆ తరువాత ఎప్పుడూ నడుం వంచి పని చెయ్యనివారు పొలం పనులు బాగా చేయించడంమొదలుపెట్టారు. రాఘవయ్య ఊరిలోకి వచ్చేసి ఊరి పెత్తనాలు మొదలుపెట్టాడు. ఊరిని మొత్తం రాజకీయాలలోకి దించాడు.

ఆరోజుల్లోనే అక్కకి అయిదో ఏడు నడుస్తుండగా నువ్వు కడుపున పడ్డావు. ఆయన ఎంత సంతోషించారో. కొడుకు కోసం చాలాకాలం తపించారు. రోజూ భాగవతం దశమస్కంధం చదివేవారు. కొడుకు పుడితే కృష్ణుడి పేరు పెట్టుకోవాలనుకున్నారు. అందుకే నువ్వు పుట్టగానే ఆయనకిష్టమైన మురళీకృష్ణ పేరుపెట్టారు.

ఆ సంవత్సరమే అక్కని బడిలో వేశారు. పొలంనుంచి రాగానే "కృష్ణా... మురళీ! ఎక్కడేవాడు'' అని వెతికి వెతికి నువ్వు కనిపించేదాకా ముద్దుముట్టేవారు కాదు" అని నిట్టూర్చింది.

మురళీకృష్ణకి లీలగా తండ్రి జ్ఞాపకం వున్నాడు. ఆ జ్ఞాపకాల పొరలలోగాలిలోకి ఎగరేసి అందుకోవడంలాంటి సంఘటనలు అప్పుడప్పుడు జ్ఞాపకం వస్తూ ఉంటాయి. తండ్రి తలంపుతో అతనికళ్ళుచెమర్చాయి. బతికివుంటే ఈనాడు తన అభివృద్ధి చూసి ఎంత సంతోషించేవారు. అంత అదృష్టమా? బతికివుంటే కాలు నేలని పెట్టనిచ్చేవాడా తను అనుకున్నాడు.

"అమ్మా....నువ్వు అసలు సంగతులు చెప్పు. మనం ఊరెందుకు విడిచిపెట్టాము అది చెప్పు" అని తొందరచేశాడు.

"చెబుతానురా! ఒక దానికీ మరో దానికీ లంకె. అన్నీ చెబితేనేగాని నీకు పూర్తిగా అర్థంకాదు" అని మళ్ళీ చెప్ప డానికి ఉపక్రమించింది.

సురేఖకి సాధారణంగా పెందరాళే నిద్ర ముంచుకొచ్చేస్తుంది. కాని అత్తమ్మ చెబుతున్న విషయాలు ఆమెకి గతంలో తెలియవు. ఎప్పుడూ ఎవరూ చెప్పలేదు. వాళ్ళ నాన్న ఆనందరావుగారు ఆ రాఘవయ్యమీద కారాలూ మిరియాల్నూ నూరడమేగాని వివరాలు ఎన్నడూ చెప్పలేదు. ఏదో శత్రుత్వం అనేగాని వివరాలేవీ తెలియవు. అందుకే నిద్ర ఎగిరిపోగా శ్రద్ధగా వినసాగింది.

శ్రీధర్ బి.కాం. ఫైనలియర్ చదువుతున్నాడు.మురళీకృష్ణేతనకి వ్యాపారంలో సాయంచేస్తాడని, ఎకౌంటైనా చూస్తాడని చెప్పి కామర్స్ చదివించమన్నాడు. చదువు పూర్తవగానే వ్యాపారంలోకి తీసుకోవాలనుకుంటున్నాడు. రోజూ కాలేజీనుంచి రాగానే సాయంత్రాలు షాపుకి వెళ్ళి సాయంచేస్తున్నాడు. అత్త చెప్పేదేదైనా అతనికిష్టమే. చిన్నప్పుడు కాశీ మజిలీ కథలూ అవీ ఎంతో బాగా

చెప్పేది. అలాంటి అత్త జీవితంలో ఇన్ని కష్టాలనుభవించిందా– అనుకున్నాడు.

అన్నపూర్ణమ్మ చెప్పడం మొదలు పెట్టింది....

"ఇప్పుడు చెప్పిందంతా ఉపోద్ఘాతం మాత్రమే. నువ్వు పుట్టిన మూడు నెలలకే వాడికీ కొడుకు పుట్టాడు. దానితో డబ్బు తాపత్రయం మరింత పెరిగింది. ఊరినే మింగెయ్యాలనేసేటంత ఆశ, ఆకలి పెరిగాయి.

నీకు అయిదేళ్ళ ఐదునెలల వయసులో మంచి ముహూర్తం చూసి అక్షరాభ్యాసం చేయించారు మీ నాన్నగారు. మాస్టర్లకి పండూ కాయా బియ్యం లాంటివి తరచూ ఇస్తూవుండేవారు. నువ్వు చదువుకుని పెద్ద ఉద్యోగస్తుడివి కావాలని కలలు కనేవారు. ఇప్పట్లో నీ స్థితికి ఆయనే వుంటే ఎంత పొంగిపోయేవారో" అంటూ వుంటే కళ్ళు చెరువులయ్యాయి. నోరు మూగపోయింది.

మురళీకృష్ణ హృదయం తండ్రికోసం ఆ క్షణం తల్లడిల్లింది. నాన్న బతికి వుంటే పువ్వులలో పూజించుకోడా. ఎంత దురదృష్టవంతుడు తను అనుకున్నాడు.

"నిన్ను బడిలో వేసి ఏడాది తిర క్కుండానే మీ నాన్నని కాటేసిన ఆ కాళ రాత్రి వచ్చింది.

ఆరోజు...

రామక్రోవెల ఎంతో సందడిగావుంది. పొలాలలో పనీపాటూ లేనిరోజుల్లో గుడిలో అందరూచేరి కబుర్లు చెప్పు కోవడం పరిపాటి. మీ నాన్నగారు, ఇంకా చాలామంది యువకులు గుడిలో మూగారు. వారిలో రఘు కూడా వున్నాడు. లోకాభి రామాయణంలోకి దిగారు. సంభాషణ దయ్యాలమీదకి వెళ్ళింది. అర్ధరాత్రి స్మశానానికి పందెం వేసి వెళ్ళి మళ్ళీ బతికిరావటం కల్ల అన్నారట ఎవరో.

మీ నాన్నగారికి దేవుడంటే నమ్మకమే గాని దయ్యాలు, భూతాలమీద నమ్మకం వుండేదికాదు. పొలం పనులు ముమ్మరంగా వుండేటప్పుడు అర్ధరాత్రి దాటేక కూడా లెక్కలేనన్నిసార్లు ఆ స్మశానం పక్క నుంచే వెళ్ళేవారు, వచ్చేవారు.

"నేను వెళ్ళిరాగలను...ఎంత పందెం?" అన్నారు మీ నాన్న.

"వందరూపాయల పందెం" అన్నారు వారిలో ఒకరు.

"వెయ్యి రూపాయలు కాయండి. నేను వెళ్ళి దయ్యాల మర్రిచెట్టుకింద కూర్చుని ఓ చుట్ట పూర్తిగా కాల్చి మరీ వస్తాను" అన్నారట మీ నాన్న.

పదిమంది పోగై వెయ్యి రూపాయలు అప్పటికప్పుడే పోగుచేసి ఆదివారం అమా వాస్యనాడు వెళ్ళాలని పందెం ఖాయం చేశారు.

నాకు ఇది తెలిసి, "వద్దండీ! మీరు స్మశానానికి వెళ్ళడానికి వీల్లేదు. మామూలుగా వెళ్ళిరావడం వేరు. పందెం వేసి వెళ్ళడం వేరు. నా మాట వినండి" అని బతిమాలాను.

"నీ మొహం. దయ్యాలూ గియ్యాలూ ఏవీలేవు అన్నపూర్ణా! నీకెందుకు...నువ్వే చూస్తావుగా – పరుగులమీదవెళ్ళి గంటలో వెనక్కివచ్చేస్తాను చూడు" అని కొండంత నమ్మకంతో చెప్పారు మీ నాన్న.

"సరే...మీరన్నట్లు దయ్యాలు లేవే అనుకుందాం. ప్రమాదవశాత్తూ ఏ పామో మరేదో మీదపడి కరిస్తే ఏంచేస్తారు? అందుకే నా మాట వినండి" అని ఎంత మొత్తుకున్నా వినలేదు.

 

ఆదివారం అమావాస్యరోజు వచ్చింది.. ఉదయంనుంచీ సాయంత్రందాకా రఘు జాడలేదు. రఘుని మధ్యతోవలో కాపు వుంచి మర్రిచెట్టుదాకా తోడుపంపి మళ్ళీ రహస్యంగా వెనక్కి రప్పిద్దాం అనుకున్నాను. కాని ఊళ్ళోనే లేడని తోడికోడలు సుభద్రనడిగితే తెలిసింది. ఒకే ఇంట్లో వుండేవాళ్ళమన్న మాటేగాని, ఆవిడ ఎప్పుడూ సరదాగా వుండేదికాదు. ఎదుటపడ్డా తప్పించుకు తిరిగేది.

ఆరోజు రాత్రి పదిగంటలకి రామకోవెలలో అందరూ సమావేశమయ్యారు. వెయ్యికి మరో నూటపదహార్లుకలిపి గ్రామ మునసబు నాయుడికిచ్చారు.

అంతకుముందే ఓ ఉట్టిలో తపేళాలో పాలు వుంచి పది ఇరవైమందిదాకా దయ్యాలమర్రినిచేరుకున్నారు. ఒక మేకు కొట్టి ఉట్టిని దానికి తగిలించారు. రఘు కూడా వాళ్ళతో వెళ్ళాడని నాకు తరవాత తెలిసింది.

రాత్రి పన్నెండు గంటలకి ఆయన వంటరిగా బయలుదేరారు. కోవెలలో అందరూ ఎదురుచూడసాగారు. నేను ఇంట్లోకూర్చుని 'శ్రీరామచంద్రా!ఆయన్ని చల్లగా చూడు. క్షేమంగా వచ్చేలాగా చూడు' అని మనసులోనే ప్రార్థించుకోసాగాను.

అసలీ పందెం ఆయన కాసినా వద్దని వారించక అందరూ సై అంటే సై అని ప్రోత్సహించారు. నాకదే అర్థంకాలేదు. కోడిపందాలు,గొర్రెపొట్టేళ్ళపందాలుచూసి ఆనందించేవాళ్ళకి ప్రమాదం అర్థం కాలేదనుకున్నాను. ఏదో వినోదమేగాని దాని పర్యవసానంఏమిటి అని వాళ్ళు ఆలోచించలేదు.

అర్థరాత్రి రెండుగంటలు దాటిపోగానే అందరిలోనూ సంచలనం బయలుదేరింది. ఇంకా రాలేదేమని భయపడసాగారు.

నేను వుండబట్టలేక కోవెల దగ్గరకు వెళ్ళాను.

మునసబుగారు, "మీరెందుకొచ్చారమ్మా! ఆయనొచ్చేస్తాడు...భయంలేదు. మీరు ఇంటికి వెళ్ళండి" అన్నాడు.

"లేదు అన్నయ్యగారూ!మాకు పందెం ఓడిపోయినాఫర్వాలేదు. నాకేదో భయంగా వుంది. మీరందరూ వెంటనే వెళ్ళి తీసుకురండి" అన్నాను.

కొంతమంది లాంతర్లు పట్టుకుని స్మశానానికి బయలుదేరారు. మీ నాన్నగారు దయ్యాలమర్రి చెట్టుకింద పడివున్నారు. తలకాయ పగిలివుంది. చేతిలోని ఉట్టి అలాగే వుంది. పాలు ఒలికిపోయి రక్తంలో కలిసిపోయాయి. పక్కనే ఇద్దరు కూడా లేపలేనంత పెద్దరాయి పడివుంది. ఆ రాయిని అక్కడ చూసిన జ్ఞాపకం ఎవ్వరికీ లేదు. ఒకవేళ కాలుజారి పడినా అంతలాగ తల చితికేదికాదే-అనుకున్నారు అందరూ"

మురళీకృష్ణ మనస్సు వికలమయింది. అలాంటి విచిత్రమైన చావుకి గురయాడా నాన్న. ఎంత దురదృష్టం!

సురేఖ, శ్రీధర్ స్మశానం, అక్కడ తల చితికిపోయి చనిపోయిన మామయ్యని ఊహించుకుని భయపడ్డారు.

కొంగుతో కన్నీళ్ళు ఒత్తుకుని అన్నపూర్ణమ్మ మళ్ళీ చెప్పసాగింది...

ఊరంతా అట్టుడికిపోయినట్లయింది. గ్రామపెద్దలు గుట్టుగా అంత్యక్రియలుచేసి ఏక్సిడెంటు మరణంకింద రాసి మరణ రిజిస్టరుకెక్కించారు.

నేనూ, అక్కా, నువ్వూ అనాథలమైపోయాం. ఊరంతా ఎంతో సానుభూతి

చూపించింది. మామయ్య హైదరాబాదు నుంచివచ్చాడు. అక్కనీ,నిన్నూ, నన్నూ హైదరాబాదు తీసుకుపోతానన్నాడు.

కాని నేను ఒప్పుకోలేదు.

రాఘవయ్య అందరిలో, "వదినా... మీకేం భయంలేదు. మీ కష్టసుఖాలన్నీ నావి. అన్నయ్యను తెచ్చి ఇవ్వలేనుగాని మీకు ఏలోటూరాకుండా చూసుకుంటాను" అని కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

అందుకే నేను అక్కడే ఉండి పోయాను.



నువ్వూ, అక్క ఎప్పటిలాగానే బడికి పోయేవారు. నిన్ను చూసినప్పుడల్లా పుట్టెడు దుఃఖం వచ్చేది. నిన్ను ఒక పెద్ద విద్యావంతునిగాచేసి ఆయన కోర్కె తీర్చ గలనోలేనో అని భయంగా వుండేది. ఎన్ని కష్టాలు ఎదురైనా అక్కనీ, నిన్నూ చదివించి పైకితేవాలని నిశ్చయించుకున్నాను.



ఒకరోజు అక్క, నువ్వు నిద్రపోతున్నారు. అర్ధరాత్రి దాటిపోయింది. ఎవరో తలుపుతట్టడం వలన మెలకువ వచ్చింది. ఏమైవుంటుందబ్బా! అర్ధరాత్రి లేపవలసిన అవసరం ఎవరికుంటుంది అనుకున్నాను.

రాఘవయ్య పెళ్ళయిన తరవాత

మండువా లోగిలిని అనుకునివున్న చివరి గదిని వారికి పడకగదిగా కేటాయించారు మీ నాన్నగారు. మన పడకగదికీ వాళ్ళ పడకగదికీ దూరమే. గట్టిగా మాట్లాడు కున్నా వినబడవు. సుభద్ర పగలే సరిగ్గా మనస్సువిప్పి మాట్లాడదు. ఇంక రాత్రివేళ ఏం మాట్లాడుతుంది-అనుకుని లేచి పక్కనేవున్న లాంతరు ఒత్తిని తిప్పాను. గది వెలుతురుతో నిండిపోయింది

"ఎవరూ?" అని పిలిచాను.

నిశ్శబ్దం. కాసేపట్లో మళ్ళీ టక్ టక్ మని తలుపుతట్టిన శబ్దం.

"ఎవరంటుంటే?" అన్నాను మళ్ళీ.

సమాధానం లేదు. ఫలానా అని చెప్పకుండా తలుపు గట్టిగా తట్టేవాళ్ళంటే నాకు చిరాకు. మరోమారు తలుపుతట్టారు. కొంచెం భయంకూడా వేసింది. దొంగ అయితే ఏం చెయ్యాలి. రాఘవయ్య ఆ చివర వుంటాడు. దొంగైతే లోగిలిలో ముందుగదులుదాటిరావాలి. లేదా ఇల్లెక్కి డాబామీద నుంచివచ్చి లోపలికి దిగాలి.

ఏమైతే అయిందని తలుపువద్దగరికివెళ్ళి గెడతీసి తలుపు తెరిచాను.

రాఘవయ్య!

గభాలున లోనికివచ్చి తలుపు మూసేశాడు.

"తలుపెందుకు మూస్తావయ్యా ?" అన్నాను.

అతడినోరు తడబడసాగింది. తలుపునకి అడ్డంగా నుంచుని, "వదినా! మగతోడు లేకుండా ఇలా ఎంతకాలం వుంటావు. నీకు ఏ లోటూ లేకుండా చూసే బాధ్యత నాది. ఈవేళ మనమిద్దరం ఒక్కటౌదాం" అన్నాడు.

నాకు భయం వెయ్యలేదు. అతడి ప్రవర్తనకి ఆశ్చర్యం వేసింది. అలాంటి పాపపు ఆలోచన వాడికివున్నట్లు ఎప్పుడూ ఊహించలేకపోయాను. అదివరకు ఎన్నోసార్లు దొంగచూపులు చూడ్డం గమనించాను. కాని ధైర్యంగా ముఖంలోకి చూడటానికి సిగ్గుపడుతున్నాడేమో అను కున్నాను.

అందుకే నిబ్బరంగా, "రఘూ! ఎగతాళిమాటలకైనా ఒక సమయం సందర్భం వుంటుంది. ముందు బయటికి నడు" అన్నాను.

అతను మొండిగా, "ఈరోజు నన్ను బయటికి పంపడానికి దేవుడు దిగిరావాలి. లేదా ఈ దేవత లొంగిపోవాలి. బయటికి వెళ్ళేదిలేదు" అన్నాడు.

"ఏం...అంత మొనగాడివయ్యావా? ముందు నేనెవరినో చెప్పు. నీకు వదినని, వదిన తల్లి తరవాత తల్లి. నా వొంటిమీద చెయ్యివేశావంటే నీకు చావు మూడినట్లే" అన్నాను.

కాని, వాడు మీదిమీదికి రాసాగాడు.

"అడుగు ముందుకు వెయ్యకు" అని గట్టిగా గర్జించాను.

అయినా వాడు ఒక్క ఉదుటున మీదపడి ఒకచేత్తో నా నోరునొక్కి రెండో చేత్తో నన్ను గుండెలకు అదుముకు న్నాడు. కాసేపు పెనుగులాడాను. ఉక్కుకంలాగా పట్టుకున్నాడు. దాంతో పెనుగులాడ్డం మానేశాను. ప్రతిఘటన లేకపోగానే నోటి మీది చెయ్యి సడలించి మీదికి వంగి నా పెదవులకు తన పెదవులు ఆనించబోయాడు.

"అమ్మా! ఇంక ఆపు" అని గర్జించాడు మురళి.

ఆదమరపుగా వింటున్న సురేఖ, శ్రీధర్ ఉలిక్కిపడ్డారు.

అన్నపూర్ణమ్మ కూడా తన ధోరణిలో





చెప్పుకుపోయిందేగాని కొడుకు అలాంటి ఘోరం వింటే ఏమౌతుందని ఆలోచించ లేదు.

"అమ్మా..ఇంతకాలం ఎందుకు చెప్ప లేదు" అని ఊగిపోయాడు.

"ఇదిగో ఇందుకే ... ఇలాగే కోపం తెచ్చుకుంటావనే చెప్పలేదు. సావధానంగా విను. ఎలాగూ మొదలుపెట్టానుగదా అని చెప్పడమేగాని నువ్విలా ఉద్రేకం తెచ్చుకుంటే మానేస్తాను" అంది.

"చెప్పు...వాడికి రోజులు దగ్గర పడ్డాయి. జరిగింది దాచకుండా చెప్పు'' అన్నాడు.




"అదే అదనని శక్తినంతా కూడ దీసుకుని ఒక్క తోపు తోశాను. అంత మనిషీ ఆ తోపుకి తూలిపడ్డాడు. అడ్డంగా ఒక పీట కాలికి అడ్డం రావడం వలన గోడ మీద దబ్బునపడ్డాడు.

మీరు లేస్తారని భయపడ్డాను. కాని నువ్వుగాని, అక్కగాని పందిరి మంచం మీద నుంచి లేవలేదు.

ఆ సాయంత్రమే అక్కకూ, నీకూ జామకాయ కొయ్యడానికి వంటగదిలో నుంచి తెచ్చిన చురకత్తి జ్ఞాపకం వచ్చింది. ఆ కత్తిని టేబుల్ మీద నుంచి తీసి దాని మొనని గుండెల మీద ఆనించుకున్నాను.

"చవట వెధవా! వెంటనే గదిలో నుంచి కదులు. లేకపోతే పొడుచుకుని చస్తాను. ఖూనీకోరుగా జైలుపాలువుతావు జాగ్రత్త'' అని బెదిరించాను.

అప్పుడులేచి ఒళ్ళు దులుపుకున్నాడు. "వెళతాను. కాని ఒకటి గుర్తుంచుకో! నీ పాతివ్రత్యం ఎన్నాళ్ళో నేనూ చూస్తాను. నీ అంతట నువ్వే నా కాళ్ళమీద పడేలాగ చెయ్యకపోతే నా పేరు రాఘవయ్య కాదు. ఈ సంగతి ఎక్కడయినా పొక్కిందో మురళిని స్మశానానికి అన్నయ్యకితోడుగా పంపిస్తాను...జాగ్రత్త" అని తలుపు తెరిచి బయటికి నడిచాడు.

తలుపు గడియపెట్టి నేలని కుప్పలాగా కూలిపోయాను. వెక్కి వెక్కి ఏడిచాను. భర్తలేని స్త్రీ ఎంత దిక్కుమాలినదో అర్థమయింది. కంచెలాగా కాపాడవలసిన కొడుకులాంటి మరిదే మానాన్ని కోరుకుంటే గతేమిటి. వాడు అన్నంతపని చేసి మురళికి ఏదయినా అపాయం తలపెడతాడేమో. పంచప్రాణాలతో పెంచుకుంటున్నాను. ఆ సంగతి నా గుండెల్లోనే దాచుకున్నాను. ఈనాడు మీకు చెబుతున్నాను" అంది.

అమ్మ చెప్పిన గతం శ్రద్ధగావింటున్న మురళి పిడికిళ్ళు మరోసారి గట్టిగా బిగుసుకున్నాయి. భీముడిలాగా విజృంభించి రాఘవయ్య గొంతు నులిమి, గుండెలు చీల్చి రక్తంతాగాలన్నంత కోపం వచ్చింది.

"తరవాతేం జరిగిందో త్వరగా చెప్పమ్మా" అన్నాడు ఉద్రేకంగా.

"మండువా లోగిలి పక్కనే వున్న ప్రస్తుతపు మన ఇంటిని ఆరోజుల్లో మాస్టర్లకీ వాళ్ళకి ఊరికే వుండటానికి ఇచ్చేవాళ్ళం. ప్రతిఫలంగా మాస్టార్లు పిల్లలకి పాఠాలు చెప్పేవాళ్ళు. ఆ ఇల్లు

అప్పుడు ఖాళీగానే పడివుంది.

ఆ సంఘటన జరిగిన మరునాడే రాఘవయ్యనీ, సుభద్రనీ పిలిపించి వాడి ఎదురుగా సుభద్రతో, "నేను మన పెంకుటింట్లోకి మారిపోతాను. భర్త లేకుండా వయసులోవున్న నేను మీతో కలిసివుంటే నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటారు" అని చెప్పాను.

"ఏమనుకుంటారక్కా... నేను లేనా? నువ్వెలాంటిదానివో ఊరందరికీతెలియదా" అంది.

"రోజులొక్కలాగే వుండవు సుభద్రా! అయినా పక్కనేగదా" అని ఒప్పించి సామానుని పెంకుటింటిలోకి మార్చేశాను.

రాఘవయ్య బెల్లంకొట్టిన రాయిలా చూస్తూ వూరుకున్నాడు.

ఆరోజునుంచి అన్నీ బాధలే.

మన తరవున పొలంలో పనిచేసే మగ దిక్కులేదు గనక మన వంతు పొలంలోని పాలేళ్ళకీ, రాఘవయ్యకి భోజనాలు తీసుకెళ్ళే పని నాకు వప్పచెప్పాడు వాడే!

అనకాపల్లిలో పెరిగాను. ఇల్లు విడిచి పెట్టి ఎరగను. తల్లిదండ్రులు పోయారు. ఉన్న ఒక్క తమ్ముడూ ఉద్యోగం రాగానే హైదరాబాదులో కుటుంబంతో కాపురం పెట్టాడు. ఎవరికి చెప్పుకోవాలి? ఆ వూళ్లో ఆడవాళ్లు పొలాలలోకి భోజనాలు తీసుకువెళ్ళడం మామూలే! అందుకని మీకోసం నేనూ ఆ పనులు చెయ్యాలనుకున్నాను.

మిమ్మల్ని బడికి పంపించి పాలేళ్ళకి అన్నం వండి, అంబలి ఉడకబోసి పొలం వెళ్ళేదాన్ని. పొలంలో చిన్న చిన్న పనులుచేసి సాయంత్రం వంటకోసం పుల్లలూ కట్టెలూ ఏరుకుని ఇల్లు చేరుకునే సరికి అక్కా, నువ్వూ వచ్చేవారు. వంట అవగానే భోజనంచేసి నిద్రపోయేవాళ్ళం.

మీ నాన్నగారు వుండేరోజుల్లో రామకోవెలలో పురాణ కాలక్షేపానికి వెళ్ళేవాళ్ళం. ఆరోజుల్లో మన వూళ్లో రిటైరైన ఓ బడిపంతులు శర్మగారని వుండేవారు. ఎంతో చక్కగా పద్యాలు రాగయుక్తంగా చదివి అర్థం చెప్పేవాడు. పోతన మహాభాగవతమో లేక మహాభారతమో రోజుకి పది ఇరవై పద్యాల దాకా చదివి విడమర్చి చెప్పేవారు. ఊళ్లో అది చక్కని కాలక్షేపంగా వుండేది. వర్షాలు సకాలంలో పడకపోతే ఉత్తర గోగ్రహణం చదివేవారు.

మీ నాన్నగారు పోయిన తరువాత ఒంటరిగా ఆ పురాణ కాలక్షేపానికి మరి వెళ్ళలేదు. నేను శ్రద్ధగా వినేదాన్ని. అందరూ మరిచిపోయినా ఏ పద్యంవరకూ వచ్చిందో గుర్తుగా చెప్పేదానిని. చాలా మంది వచ్చేవారు. కాని వెంటనే గురకలు కొట్టుకుంటూ గచ్చు అరుగులమీదా, మంటపం స్తంభాలని ఆనుకునీ నిద్రపోయేవారు.

నేను లేక పురాణం రక్తికట్టడంలేదని శర్మగారు ఒకటి రెండు మార్లు కబురు పంపించారుగానీ నేను వెళ్ళలేదు. మన ఇంట్లో అన్ని పుస్తకాలూ వుండేవి. ముఖ్యంగా మహాభాగవతంలోని దశమస్కందం మీ నాన్నగారికి ఇష్టం. కృష్ణలీలలు అన్ని పద్యాలూ ఆయన నోటికి వచ్చేవి. ఆయనని తలచుకుంటూ నేనూ అదే పుస్తకం ఎప్పుడూ చదువుకునేదాన్ని.

పొలంలో నాట్లు కాలంలోనూ, కోతలప్పుడూ మాటల సందర్భం కుదిరినప్పుడు నాకువినిపించేలాగా రాఘవయ్య, "అనుభవించడానికైనాఅదృష్టముండాలి.





కొందరికి అదృష్టం అందలమెక్కిస్తుంటే బుద్ధి బురదలోకి లాగుతుంది" లాంటి మాటలు వదిలేవాడు.

నేను వినీవిననట్లు నా పనులు చేసుకు పోయేదాన్ని. "అందరూ మహాపతివ్రతలే. సీతామహా సాధ్వులం అనుకుంటారు. ఏదో అగ్నిపరీక్ష చేసి బయటికి వచ్చినట్టు. పాతివ్రత్యం అంటే మాటలా. మనోవాక్కాయ కర్మలలో భర్తని తప్ప పర పురుషుణ్ని కలల్లోకూడా తలంచకూడదు. ఇది కలికాలం. పైకి అందరూ మంచివాళ్ళలాగే కనపడతారు. లోపలంతా కుళ్ళే" అంటూ ద్వేషం వెళ్ళగక్కేవాడు.

నాకు వళ్ళు మండిపోయేది. నేను వాడితో మహా పతివ్రతనని చెప్పలేదు. నీతిగా బతకాలనుకోవడం కొందరి వ్యక్తిత్వం. అదికూడా ఒక బలహీనత లాంటిదే. దానిని అపహాస్యం చేసేవాడు. వాడి బుద్ధిహీనతా, మూర్ఖత్వం కాకపోతే ఒకవేళ నేను నీతి తప్పాలనుకుని నా స్థాయినుంచి దిగజారినా కొడుకు లాంటి వాడితోటే చెడిపోవాలని ఎక్కడుంది అనుకునేదాన్ని.

అలాగ దినదిన గండంగా రోజులు గడిచేవి. కష్టపడటానికి నేనెప్పుడూ జంకలేదు. కాని వాడు వేసవి సెలవుల్లో అక్క చేతా, నీ చేతా కూడా పొలంపనులు చేయించేవాడు. నువ్వు పశువుల్ని కాస్తుంటే, మనుషులున్నా కసిగా అక్క చేత పశువుల పేడ తీయించి పాక శుభ్రం చేయిస్తుంటే నా ప్రాణాలు విలవిలలాడేవి.

మీ నాన్నగారు చనిపోయిన రెండో యేడు ఆయన వేసిన అంటు మామిడితోట బాగా కాపు కాసింది. ఆ ఏడాది బోయ వాళ్ళకి అమ్మకుండా సొంతంగా అమ్మాలనుకున్నాడు రాఘవయ్య. ఎండాకాలం నిన్నూ, అక్కనూ తోటల్లో కాకులూ పిట్టలూ మామిడిఫళ్లు తినెయ్యకుండా కాపలా పెట్టాడు. ఆ రెండెకరాల తోటలో ఒక డబ్బా చేత్తో పట్టుకుని దానిమీద కర్రతో కొడుతూ ఎండలో తోటంతా తిరిగేవారు మీరు.

చిలకకొట్టిన కాయల్ని కూడా దగ్గరున్నప్పుడు మిమ్మల్ని తాకనిచ్చేవాడు కాదు.నాకెంతఏడుపొచ్చేదో.వాటిని ఇంటికి తీసుకొనిపోయి వాళ్ళ అబ్బాయికి పెట్టేవాడు. మండువా లోగిలిలోని ఒక గదిలో బంగినిపల్లి, సువర్ణరేఖ లాంటి ఎన్నో రకాల పళ్ళు కాపువేసి వ్యాపారులకు అమ్మేవాళ్ళం.

ఒకరోజు మామిడితోట చుట్టూవున్న కంచెలోనుంచి ఒక నాగుపాము వచ్చి అక్కని కాటేసింది. నువ్వెంత భయపడిపోయావో "అక్కా...అక్కా'' అని ఎంత ఏడిచావో. సమయానికి మందూ మాకూ లేక నా బంగారు తల్లి నురుగులు కక్కుకుని చనిపోయింది.దాని ఉసురైనా వాడికి తగలలేదు''అని దీర్ఘంగా నిట్టూర్చింది.

మురళికి అక్క జ్ఞాపకం వచ్చింది. తనకాళ్ళకి బురద అంటుతుందని ఎత్తుకుని కాలువలపై ఎలా దాటించేది. అక్క చనిపోయినరోజు జ్ఞాపకం వచ్చి కళ్ళు చెమ్మగిల్లాయి. రుమాలుతో కళ్ళు ఒత్తుకున్నాడు.

ఆ రాఘవయ్యని ఇంక బతకనియ్యకూడదు అని నిశ్చయించుకున్నాడు ఆ క్షణాన్నే. "అందరూ కన్నీళ్ళు కార్చారు. ఆ రాఘవయ్య మొసలి కన్నీళ్ళు కార్చాడు. ఇద్దరూ రెండు కళ్ళను కున్నాను. ఒకకన్ను పోయినంత బాధ

పడ్డాను. ఒంటి కన్ను దానినయ్యాను. మామయ్యకి ఉత్తరం రాస్తే వెంటనే వచ్చాడు.

"ఇంక నిన్నిక్కడ వుండనివ్వను అక్కా! వచ్చేయి. మాతోటే ఏ కలోగంజో తాగుదువుగాని. వీడిని అక్కడే చదివిద్దాం" అని ఎంతో బలవంతం చేశాడు.

ఊరు విడిచి వెళ్ళిపోతే పైలోకాలలో వున్న మీ నాన్న నన్ను క్షమించరని భ్రమపడ్డాను. నా బొందె కూడా ఆ పల్లెటూళ్ళోనే ఆయన పక్కనే కాలి మసైపోవాలని నిశ్చయించుకోవడం చేత అప్పుడూ తిరస్కరించాను.

"ఏముందిరా తమ్ముడూ! మరో ఏడు. వాడు అయిదు పాసవగానే నీదగ్గరికే పంపించేస్తాను. ఇక్కడ హైస్కూలు ఎలాగూలేదు కదా'' అని నచ్చజెప్పాను. ఎంతో నిరాశగా వెళ్ళిపోయాడు మీ మామయ్య.

స్కూళ్ళు తెరిచారు. నువ్వు అయిదో క్లాసులోకి వచ్చావు.

ఆరోజు రాఘవయ్య మన వాకిట్లోకి వచ్చి ''మురళిని చదువు మానిపించేద్దాం. పొలంలో పశువుల్ని చూసేవాడులేడు" అన్నాడు గోడకి చెబుతున్నట్టు.

ఆ వెధవ నాతో మాట్లాడ్డం నాకిష్టం లేదు. పైగా ఒళ్ళు మండే మాట మాట్లాడాడు. నాకు పూనకం వచ్చినట్లయింది. నేనూ ఓ చెట్టుకి చెప్పినట్లు, "నా కొడుకుని చదువు మాన్పించడం జరగదు. అంతగా పశువులు కాసేవాళ్ళు లేకపోతే వాళ్ళ అబ్బాయిని చదువుమాన్పించుకోవచ్చును" అన్నాను కోపంగా.

"వాడి తరఫున పని చెయ్యడానికి నేనున్నాను. మీ వాటాకి పనిచెయ్యడానికి నీ కొడుకు కాకపోతే మరెవడున్నాడు నీ మొగు..." అనబోయాడు.

వాక్యం పూర్తి చెయ్యకముందే ఒక్కటి దవడ పగిలేలాగ అంటించాను.

"నోర్ముయ్ వెధవా! మళ్ళీ మరో మారు అలాంటి కూత కూశావంటే నీ అంతు చూస్తాను. ఏమనుకున్నావో" అని గర్జించాను.

అందరమ్మలక్కలూ ఇంటిముందు పోగయ్యారు. మగవాడి మీద చెయ్యి చేసుకోవడం తప్పన్నారు. నాది గయ్యాళితనం అన్నారు. భర్త పోయినా కష్టపడి కుటుంబాన్ని లాక్కొస్తున్న వాడు చిన్న మాటంటే తప్పు లేదన్నట్లు మాట్లాడారు.

"నా కుటుంబాన్ని ఎవరూ లాక్కురానవసరంలేదు. నా వాటా నాకు పంచేస్తే నేనే చూసుకుంటాను" అని పెద్ద మనుషులలో పెట్టాను.

రాఘవయ్య పంపకాలకి వప్పుకోలేదు.

"భూమి పంచి వాళ్ళని వదిలేస్తే చనిపోయిన మా అన్నయ్య ఆత్మకి శాంతి వుండదు. చచ్చినా నేను పంపకాలకి ఒప్పుకోను" అని దొంగ ఏడుపు ఏడ్చాడు.

కాని నేను ఆ దుర్మార్గుడితో కలిసి ఇంకెంతమాత్రం వుండదలుచుకోలేదు

"మీ నాన్నగారికి చిన్ననాటినుంచీ ప్రాణ స్నేహితుడు బలరామయ్య. మీ నాన్నగారి సాయంవలన పైకొచ్చాడు ఆయన.

ఆయన దగ్గరికి వెళ్లాను. నా కష్టాలన్నీ వివరించాను. పంపకాలలో సాయంచెయ్యమన్నాను. ఆయన గట్టిగా నిలబడ్డాడు. రాఘవయ్య పంపకాలకి ఒప్పుకోకుండా కాలికీ మెడకీ ఎన్ని లంకెలు వేసినా ఒప్పించి పంపకాలు జరిపించాడు.

పంపకాలలో మనకు అన్యాయమే




జరిగింది. ఒక్క బలరామయ్య తప్ప మిగిలిన పెద్దమనుషులందరూ అన్యాయం చేశారు.

అంటు మామిడితోటా, మంచి సార వంతమైన ఏటి కాలవకింది మరో ఐదెక రాల మాగాణి పొలాలని వాడి వాటాకీ, వర్షాధారంలో మాత్రమే పండే రేగడిపొలం పదెకరాలూ మన వాటాకీ వచ్చేలాగ పంచారు. అలా పంచడానికి వాళ్ళని బాగా మేపాడని తెలిసింది. అందుచేత బలరామయ్య ఏమీ చెయ్యలేకపోయాడు.

అప్పుడు నాకు మామిడి తోటా, మాగాణి పొలాలూ మనస్సులోలేవు. ఎలాగోలాగ పంచుకుని వాడి రొంపిలో నుంచినిన్ను బయటపడెయ్యాలి. అందుకనే ఒప్పుకున్నాను.

పంపకాలు జరిగిపోయాయి.

మన వాటాకి మనంవుంటున్న పెంకుటిల్లు వచ్చింది. మండువా ఇల్లు రాఘవయ్యకి పోయింది. ముదరాగా రెండు వేలు వచ్చాయి. ఆ రెండు వేలూ బలరామయ్యగారి దగ్గరే దాచాను. ఆయన వడ్డీ వ్యాపారం కూడా చేసేవాడు. ధర్మవడ్డీ నూటికి నెలకి ఒకరూపాయి. నెలనెలా ఇరవై రూపాయలు వచ్చేయి. ఆరోజుల్లో పదిరూపాయిలుకూడా గొప్పే. పెద్ద మొత్తం ఎప్పుడు అవసరంవచ్చినా వడ్డీ మాట లేకుండా సర్ది తన స్నేహితుడి ఋణం తీర్చుకునేవాడు బలరామయ్య.

ఆ ఏడాది వర్షాలుపడగానే రెండెకరాల్లో తినడానికి వరివేసి మిగిలినది కౌలుకి చ్చెయ్యాలని నిశ్చయించుకున్నా.

ప్రాణం తేలికపడింది ఆవిధంగా.

* * *

వర్షాలు పడ్డాయి. నలుగురితోపాటు విత్తనాలు కొని ఆకుమడిలో నారు పోయించాను. పొలంలోకి వెళుతుంటే ఎంతో ఉత్సాహం, సంతోషం కలిగింది. ఎవ్వరికీ భయపడవలసిందిలేదు. ప్రకృతి ఎంతో ఆహ్లాదకరంగా అనిపించింది. దేవుడు మేలుచేస్తే తినగలంత ధాన్యం వస్తుంది. పైఖర్చులకి సరిపడా భూమి మీద వచ్చే ఆదాయంతో కాలక్షేపంచేసి నిన్ను పైచదువులు చదివించవచ్చునని సంబరపడ్డాను.

కాని రాఘవయ్య మనల్ని సుఖంగా బతకనియ్యదలచుకోలేదు. నామీద పగబట్టాడు.

జూలై నెల కుంభవృష్టి కురిసింది, గెడ్డలు పొంగిపారాయి. రెండు ఎకరాలూ దమ్ము దున్నించి గట్లుమెయ్యి నీరు పెట్టించాను. మరునాడే ఊడుపుకి ఆకు తీతకి కూలీలని పెట్టుకున్నాను.

మరునాడు ఉత్సాహంగా పొలానికి వెళ్ళిన నేను మళ్ళు చూసి అవాక్కయి పోయాను. మళ్ళలో ఓ చుక్క నీరు కూడాలేదు. ఎవరో దిగువ అప్పసాలను తెగగొట్టి నీరు తీసేశారు. మడులు ఆరి పోయివున్నాయి. నీరు ఉధృతంగా పారడంచేత దిగువని పెద్దగండ్లు పడ్డాయి. అవి ముందు మరామత్తు చేయించాలి. తరవాత నీరు పెడితేనేగాని నాట్లుకావు. మిగిలిన అందరి మళ్ళలోనూ నీరుంది. మన మళ్ళలోనే లేదు. అది ఎవరి పనో నాకు తెలుసును. కాని చెప్పి లాభంలేదు. తగువు కొనితెచ్చుకోవడమే.

కూలివాళ్ళని బతిమాలి మరునాడు పనిలోకి రమ్మన్నాను. పరిస్థితిని గ్రహించి మరోచోట పనిచూసుకుని వెళ్ళిపోయారు. లేకపోతే ఆరోజు కూలి ఇస్తేనేగాని పోరు వాళ్ళు.

ఆకుతీతకివచ్చినవాళ్ళలోఇద్దర్ని మాత్రం

పనిలో వుంచుకుని గండ్లని పూడ్పించి గట్లు సరిగా వేయించి మళ్ళీ నీరు నింపే సరికి పొద్దుపోయింది.

పుస్తకాలు ఇంట్లోపడేసి నువ్వూ ఆరోజు పొలంలోకి వచ్చావు. నిన్ను చూడగానే ఎక్కడలేని దుఃఖం వచ్చింది. నిన్ను గుండెల్లో దాచుకుని ఏడ్చేశాను.

"మనం ఈ ఊళ్ళో వుండొద్దమ్మా! మామయ్య దగ్గరికి హైదరాబాదు పోదాం" అన్నావు.

"అలాగే...నువ్వు అయిదు పాసవగానే వెళ్ళిపోదాం" అన్నాను.

ఆ మరునాడు భయంగానే పొలం చేరుకున్నాను. మళ్ళలో నీరు చూడగానే ప్రాణం కుదుటపడింది. నారు తియ్యడానికి మనుషులొచ్చారు. కూలీలంతా వచ్చారు.

అంతలో ఎక్కడినుంచో వూడిపడ్డాడు రాఘవయ్య. నారు తియ్యడానికి మడిలోకి దిగుతున్న కూలీలతో ఏదో చెప్పాడు. వాళ్ళు పనిలోనుంచి లేచిపోయారు. అందులో ఒకతను నాదగ్గరికివచ్చి, "మాకు వేరే పనుందమ్మా.. .వెళ్ళిపోతున్నాం" అని చెప్పాడు.



నాకు వళ్ళు మండిపోయింది. ఆడదంటే ఎంతచులకన. నాఎదురుగుండానే వాళ్ళని తనవేపు తిప్పేసుకున్నాడు.

అతనితో, "మరిక్కడెవరు చేస్తారు? మీరు ముందే చెప్పితే వేరేవాళ్ళని చూసుకునేదాన్ని. ఇది మీకు ధర్మంగా వుందా?" అని ప్రశ్నించాను.

నేను తనని బతిమాలుతానను కున్నాడు. కాని నేను వాడితో మాట్లాడ దలచుకోలేదు. కూలీలతోనే అన్నాను అనవలసిందేదో.

"మాకదేం తెలీదమ్మా! కష్టపడి కూలీ చేసుకునేవాళ్ళం. నాలుగు డబ్బు లెక్కువ ఎవరిస్తే వాళ్ళపని చేస్తాం. డబ్బు న్నోళ్ళే గడ్డికరుస్తున్నప్పుడు మాకుమాత్రం దరమం, నీతి ఎందుకు కడుపు కాల్చుకోడానికి తప్ప" అని మిగతా వారినికూడా తీసుకుపోయాడు పెద్దకూలీ.

రాఘవయ్య ఎంతనీచానికైనా దిగజారి నన్ను లొంగదీసుకోవాలనుకుంటున్నాడని అర్థమయింది.

కూలీలు చేసినపని బలరామయ్యకి తెలిసింది. వేరే పనివాళ్ళని పురమాయించి పంపించాడు. ఆలస్యంగా పనిమొదలైనా సాయంత్రానికి ఊడ్పులైపోయాయి.

రోజుకోసారి పొలం వెళ్ళి నీరూ అదీ చూసుకునేదాన్ని.

ఒకరోజు రాఘవయ్య ఇంటిమీదికొచ్చాడు. నువ్వు స్కూలునుంచి వచ్చి బయటి వరండాలో ఆడుకుంటున్నావు. నీ రెక్క పట్టుకున్నాడు. బరబరా వాకిలి లోనికి లాక్కెళ్ళాడు.

"ఎందుకురా భాస్కర్‌ని కొట్టావట? ఒళ్ళుపొగరెక్కిందిరా నీకు" అని గొంతు చించుకుంటున్నాడు. నేను వంటయింట్లో పనిచేసుకుంటున్నాను.

గబగబా బయటికి వచ్చాను. నువ్వు భయంతో గజగజా వణకడం చూశాను. నాకు కోపం ఆగలేదు. ఒక బాగా కాలుతున్న కొరకంచు తీసుకుని బయటికి వచ్చాను. నేను రావడం చూడలేదు వాడు.

నీ రెక్క పట్టుకున్న కుడిచెయ్యిమీద వాతవేశాను. "ముందు వాణ్ని ఒదులు" అన్నాను కాళిలాగ.

"అమ్మా" అని నీచెయ్యి వదిలేశాడు. నా మీదకి రాబోయాడు.

"రా...చవట వెధవా! నా ఒంటిమీద మళ్ళీ చెయ్యి వెయ్యి. నీకళ్ళు పొడిచెయ్యక పోతే నా పేరు అన్నపూర్ణ కాదు" అని అరిచాను.

"వీడు నా కొడుకుని కొడతాడా?" అన్నాడు.

"చిన్నపిల్లలు ఈరోజుకొట్టుకుంటారు. రేపు మళ్ళీ కలుసుకుంటారు. అంత మాత్రానికి తండ్రి లేనివాడని జాలైనా లేకుండా రెక్కపట్టుకుని బరబరా ఈడ్చుకుపోతావా? నీ చెయ్యి విరిగిపోను. బెంగ పెట్టుకుని వాడికేమైనా అయితే" అన్నాను.

నువ్వు వెక్కివెక్కి ఏడుస్తూ, "భాస్కర్ నా సంచిలో పెన్సిల్ తీసుకుని వాడిదే అంటున్నాడు. నాది అని లాక్కున్నాను. నేను కొట్టలేదు చిన్నాన్నా" అని ఏడ్చుకుంటూ చెప్పావు.

"నాకు వాతపెడతావా? ఇంతమందిలో అవమానిస్తావా? వీడి అంతు చూస్తాను. ఏడాది తిరక్కుండా ఏట్లోకెళతాడు చూడు. తరవాత నీపనిపడతాను. లేకపోతే నా పేరు రాఘవయ్యకాదు" అని విసవిసా వెళ్ళిపోయాడు.

నాకేమైనా ఫరవాలేదు. నీ అంతు చూస్తానన్నాడు. అదే భయం నన్ను





పీడించేది. నువ్వు సుఖంగా వుండాలంటే ఒక్కటే మార్గం. ఊరు విడిచిపెట్టి వెళ్ళిపోవాలి. మీ నాన్నగారి ఆత్మశాంతికోసం ఊళ్ళోవుండే నిన్ను ప్రయోజకుణ్ని చెయ్యాలనుకున్నాను. కాని నీ ప్రాణాలకే ముప్పు అయినప్పుడు ఇంక ఆ వూళ్ళో వుండటం అనవసరం. అలాగని చెడి తమ్ముడిల్లు చేరడమూ ఇష్టంలేదు. భూమి మీద రాబడి సరిగ్గా వుంటుందో వుండదో భూమి అమ్మేసి బేంకులోవేసి దానిమీద వచ్చే రాబడితో మామయ్య దగ్గరుంటూ నిన్ను చదివించాలని నిర్ణయానికి వచ్చేశాను.

నువ్వు అయిదు పాసయ్యావు. మామయ్యని పిలిపించాను. భూమి అమ్మకానికి పెట్టాం. ఆరోజుల్లోనే ఎకరం ఐదువేలైనా మన భూమికి వచ్చేది కాని మరొకరికి అమ్మడానికి వీలులేదనీ, తనకే అమ్మాలనీ ఎకరానికి రెండువేలే ఇస్తాననీ కూచున్నాడు. ఎవరు కొనడానికి ముందుకివస్తే వాళ్ళని బెదిరించాడు. చివరికి ఇరవైవేలకే వాడి ఎదాన పదెకరాలూ కొట్టి ఆ డబ్బుతో హైదరాబాదు చేరుకున్నాం.

వచ్చిన వడ్డీడబ్బుతో మన ఇద్దరిపోషణా, నీ చదువూ అయివుండేదికాదు. కాని మామయ్య మనల్ని చూసుకున్నాడు. అసలుని అలాగేవుంచి ఎప్పుడైనా పెద్ద అవసరాలువస్తే వాడిడబ్బే ఖర్చుపెట్టాడు. ఆ డబ్బే నీ వ్యాపారానికి పెట్టుబడిగా పనికివచ్చింది. నువ్వింత వాడివయ్యావు... మామయ్యకి మనం ఎంతచేసినా రుణం తీరదు. మనం చెయ్యగలిగేదల్లా ఒక్కటే. సుశీలని ఇంటికోడల్ని చేసుకోవడం...అదే చేశాను.

ఇదేమనగతం..నువ్వేంచేస్తావోచెయ్యి"

అని అన్నపూర్ణమ్మ తన కథ ముగించింది.




ఎంతో ఆసక్తితో అన్నపూర్ణమ్మ చెప్పిన కథ విన్నవారికెవరికీ ఆమె అన్ని కష్టాలు పడిందని తెలియదు అంతవరకూ.

మురళికి వాళ్ళ నాన్నగారి చావు విషయంలో అనుమానాలు బయలుదేరాయి. దయ్యాలులేవని మురళి గాఢనమ్మకం. అంటే ఏదో కుట్ర జరిగివుంటుంది. అదీ రాఘవయ్య పనే కావచ్చును.

"అమ్మా! నాన్నగారి చావు గురించి నీకేమైనా అనుమానాలున్నాయా?"

"చాలా అనుమానా లున్నాయి. ఆయన దయ్యాలు కనిపించినా భయపడకుండా వాటితో మాట్లాడి వాటినే భయపెట్టే రకం. అదీగాక దయ్యాల కథలు ఎన్నో విన్నాను. అవి భయపెడతాయే గాని రాళ్ళూ రప్పలూ లేపి మనుషుల్ని చంపిన ఉదంతాలు లేవు" అంది.

మురళి దృష్టిలో అనుమానితుడు రాఘవయ్యే.అన్న.పోతే మొత్తంఆస్తిమీద, వదిన మీద అధికారం చెలాయించవచ్చు అని ఆశపడివుంటాడు అనుకున్నాడు.

"ఆనాటి రామకోవెలలో జరిగిన మరికొన్ని విశేషాలు చెప్పమ్మా" అన్నాడు.

"వాళ్ళు రామకోవెలలో పందెం కాసు

కున్న రోజున మీ నాన్నగారి వెంట రాఘవయ్యకూడా వున్నాడట. నాకు ఆ సాయంత్రమే పందెం సంగతి తెలిసింది. ఎంతో వారించాలని చూశాను. ఆయనకి మాటపట్టింపు ఎక్కువ. మాట అన్న తరవాత వెనక్కిపోవడం ఏనాడూ జరగ లేదు. అది నామోషీగా, అవమానంగా భావించేవారు. ఆయన ఎలాగా మానరు. రాఘవయ్య సాయం తీసుకుందామంటే అతను ఆరోజు పత్తాలేకుండా పోయాడు. శ్మశానానికి వెళ్ళినవాళ్ళలో మాత్రం రాఘవయ్య వున్నాడట. ఆయన చనిపోయిన తీరుకి కొంతమంది అది దయ్యాల పనే అనుకున్నారు. కొంతమంది ఎవరో చంపేసి వుంటారని అనుమానపడ్డారు."

"ఆరోజు కోవెలలో దయ్యాల ప్రసక్తి ఎవరుతెచ్చారో ఏమైనా తెలుసా?"

"ఏమో! ఆరోజు చాలామంది వున్నారట. ఎవరన్నారో నేను ఆరా తియ్యలేదు. ఇరవై అయిదేళ్ళ కిందటి సంగతి. ఇప్పుడు ఆ సంఘటన కొంతమంది ముసలివాళ్ళకి జ్ఞాపకం వున్నా వివరాలు ఆరాతియ్యడం కష్టమే"

"అమ్మా! చిన్నప్పుడు నాకు బలమూ తెలివీ లేనిరోజుల్లో 'మనం ఈ ఊళ్ళో వుండొద్దమ్మా. హైదరాబాదు మామయ్య దగ్గరికి పోదాం' అన్నానన్నావు. ఇప్పుడు చెబుతున్నాను. మళ్ళీ మనం మన వూరు వెళ్ళి మనకి జరిగిన అన్యాయాలకి ప్రతీకారం తీర్చుకుందాం. వాణ్ణి చంపి వాడి రక్తంతో నీకు తిలకం దిద్దుతానమ్మా" అన్నాడు మురళి ఆవేశంగా.

అన్నపూర్ణమ్మ తల అడ్డంగావూపింది. "నాకు తెలుసు...నువ్విలాగే ఆవేశపడి పీకల మీదకి తెస్తావని. అందుకనే ఇంత కాలం నాలోనే ఆ బాధని దాచుకున్నాను. ఆ పాపిష్టివాడి పాడు రక్తంతో నా ముఖానికి తిలకమా? ఎందుకు? అలాగైతే ఆ వూరు వెళ్ళడానికి నానుంచి ఏనాటికీ నీకు అనుమతి దొరకదు" అంది.

"మరెలాగమ్మా! పగతో నా గుండెలు మండిపోతున్నాయి. వాడి అంతు చూడాలని వుంది. నన్నేం చెయ్యమంటావు?" అన్నాడు. అతడి కళ్ళు చింత నిప్పుల్లాగ వున్నాయి.

తలచుకుంటే రాఘవయ్యని ఏకాలుకా కాలు, ఏ కీలుకా కీలు తన కొడుకు విరిచెయ్యగలడనీ, వాణ్ణీ, వాడి కొడుకునీ మూడంటే మూడు నిముషాలలో మట్టి కరిపించగలడనీ అన్నపూర్ణమ్మకి తెలుసును. కాని అలాగ నేరస్తుడై, తన కొడుకు జైలుపాలు కావడం ఇష్టంలేదు.

"మురళీ... వాడిప్పుడు పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు. ఊరిని సగం దోచుకున్న జమీందారు. వాడి చెప్పుచేతల్లో బోలెడు మంది వున్నారు. కనక ముఖాముఖీ ఎప్పుడూ తలపడకూడదు. వాడి పతనం నా కళ్ళారా చూడాలని వుంది. కాని మనం కయ్యానికి కాలుదువ్వకూడదు వాడి వేలుతో వాడికన్నే పొడుచుకునేలాగా చెయ్యాలి. వాడి గొయ్యి వాడిచేతే తవ్వించి దానిలోనే పాతెయ్యాలి. అదే తెలివైన వాడు చేసేపని. అలాగ చెయ్యగలిగితేనే నువ్వు నా కొడుకువి. మీ నాన్న రక్తం పంచుకుని పుట్టిన కొడుకువి. బలంవుంది గదా అని మీదపడి కొట్టడానికైతే నువ్వు ఆ వూరే వెళ్ళొద్దు" అనేసింది.

"అలాగేనమ్మా! నీ కోరిక ప్రకారమే, నువ్వు చెప్పినట్లే చేస్తాను. నాన్నగారికి ఆత్మశాంతి కలగజేస్తాను. వాడికి నిలవ నీడలేకుండా చేస్తాను. మన భూములు మనకి తిరిగి వచ్చేలాగ చేస్తాను. ఇదే నా

ప్రపథం. శ్రీధర్ మన వ్యాపారం చూస్తూ వుంటాడు. మనం రేపే బయలుదేరుదామమ్మా" అన్నాడు.

"ఆ వూరిలో నీదే పైచేయి అని నిరూపించేదాకా నేనా వూరిలో అడుగుపెట్టను. సురేఖా నువ్వూ వెళ్ళండి" అని చెప్పింది అన్నపూర్ణ.

"అలాగే. నేను ముందు వెళ్ళి మన ఇల్లుని నివాసయోగ్యంగా మార్చి తరవాత వచ్చి సురేఖని తీసుకువెళతాను" అన్నాడు మురళి.

మరునాడు ఉదయమే శ్రీధర్‌తో దుకాణానికి వెళ్ళాడు. అన్నీ వివరించి వ్యాపారం వప్పజెప్పాడు. స్వయంగా ముఖ్యమైన కష్టమర్లను, వ్యాపారస్థులను పరిచయం చేశాడు. ముందే కాస్త అనుభవం వున్న శ్రీధర్ తేలికగా ప్రతి విషయమూ అర్థం చేసుకున్నాడు.

ఆనందరావుకి మురళి ఆ పల్లెటూరు వెళ్ళడం ఇష్టం లేదు.

"ఎందుకురా... మళ్ళీ ఆ వూరితో నీకు? వాడి పాపాన వాడే పోతాడని ఊరుకుంటే మంచిది. నీకేం తక్కువ" అన్నాడు.

"లేదు మామయ్యా! తక్కువలు ఎక్కువలూ పగకి వుండవు. ప్రతిజ్ఞ నెరవేర్చేదాకా మళ్ళీ హైదరాబాదు రాను. నా ప్రాణాలకి భయం లేదు. మీరు నిశ్చింతగా వుండండి" అన్నాడు.

ఆరోజే గోదావరికి రిజర్వేషను చేయించుకున్నాడు. శ్రీధర్, సురేఖ స్టేషనుకి సెండాఫ్ ఇవ్వడానికి వచ్చారు.

సురేఖ మురళిని చూసి, "అత్తయ్యకిచ్చిన వాగ్దానం జ్ఞాపకం వుంది కదా... మీరు అక్కడ ఎవ్వరి మీదా చెయ్యి చేసుకోకూడదు. అక్కడ కరాటే విద్యలు ప్రదర్శించి ఎవ్వరి కాళ్ళూ విరక్కొట్టకండి" అంది నవ్వుతూ.

"అన్నీ జ్ఞాపకం వున్నాయి. థాంక్స్ ఫర్ రిమైండింగ్ మి" అన్నాడు.

"జోక్ కాదు బావా! గొడవ చెయ్యనని మాటివ్వండి" అన్నాడు శ్రీధర్ భయంగా.

"నీమీదొట్టురా" అన్నాడు.

రైలు వచ్చింది. మురళి రిజర్వుడు కంపార్టుమెంటు ఎక్కాడు. రైలు కూత వేసి తూర్పువేపుకి దూసుకుపోయింది.

* * *

రైలు ఉదయం ఎనిమిది గంటలకి అనకాపల్లి స్టేషనులో ఆగింది. దిగేవాళ్ళు దిగకుండానే ఎక్కేవాళ్ళు ఎగబడుతున్నారు. విశాఖపట్నంలో పాలు, కూరగాయలు అమ్ముకుని జీవనం సాగించే ఎంతోమంది పాల కేనులతోటీ, తట్టలతోటీ తయారయ్యారు. స్టేషను కాస్త రద్దీగా వుంది.

మురళి దిగాడు. అతని చేతిలో చిన్న సూట్‌కేస్ మాత్రమే వుంది. చుట్టూ కలియజూశాడు.

ఈ పాతికేళ్ళలో ఊరు చాలా మారింది అనుకున్నాడు. ముఖ్యంగా మార్పు మనుషుల్లో కనిపించింది. కట్టూ బొట్టూ, వస్త్రధారణలో మార్పు కనిపిస్తూంది. ఒకరూ అరా వృద్ధుల్లో తప్ప తలపాగాలూ, పంచెకట్టూ వున్నవాళ్ళు కనిపించడం లేదు. యువకులందరూ టిప్‌టాప్‌గా కనిపించారు. ఎంతో సంతోషించాడు. ఇది పట్టణం. మరి పల్లెటూళ్ళెలా బాగుపడ్డాయో చూడాలి. ముఖ్యంగా తమ ఊరు.

ప్లాట్‌ఫారం చివరికి వెళ్ళి బెంచి మీద పెట్టి సూట్‌కేస్ తెరిచాడు. బ్రష్, టూత్ పేస్టు తీసుకుని పంపు నీటితో ముఖం

 

కడుక్కున్నాడు. తలదువ్వుకుని శుభ్రంగా తయారయ్యాడు. సూట్‌కేస్ పట్టుకుని ఓవర్ బ్రిడ్జి మీదగా స్టేషను బయటికి వచ్చాడు. రిక్షా కట్టించుకుని బస్ స్టేషను చేరుకున్నాడు.

చాలా బస్సులు ఆగి వున్నాయి. కొన్ని విశాఖపట్నం పోయేవి, కొన్ని చోడవరం, శృంగవరపుకోట వెళ్ళేవి ఆగి వున్నాయి. తనకి కావలసిన బస్సులేదు. ఎంక్వైరీలో ఒకతను కూర్చుని వున్నాడు.

"దేవరాపల్లి వెళ్ళే బస్సు ఎన్ని గంటలకు వస్తుందండీ?" అని అడిగాడు.

"ఇప్పుడప్పుడే లేదండీ! పదిన్నరకి వస్తుందండీ" అని చెప్పాడు అతను.

టైమ్ చూసుకున్నాడు. ఏడున్నర కూడా కాలేదు. గంటకు పైగా ఇంకా టైమ్ వుంది. బెల్లం మార్కెట్‌కి వెళితే పూరి వాళ్ళు కనిపించవచ్చును. ప్రసాద్ రెండేళ్ళనుంచి బెల్లం వ్యాపారం చేస్తున్నానని చెప్పాడు– అనుకుని అటు నడిచాడు.

మార్కెట్టులో వాళ్ళవూరి అప్పారావు కనిపించాడు. మురళికి తన జ్ఞాపకశక్తికి ఆశ్చర్యం వేసింది. ఆ వ్యక్తిలో ఎంతో మార్పు వచ్చింది. అయినా గుర్తుపట్టాడు. ప్రసాద్ ఏ కొట్లో ఉంటాడో తెలియదు. కనుక్కుందాం అని ఎదురెళ్ళాడు. కాని అప్పారావు గుర్తుపట్టలేదు.

వివరాలు చెప్పి ప్రసాద్‌ఆరాతీశాడు. ప్రసాద్ దుకాణానికి కూడా వుండి తీసు కెళ్ళాడు అప్పారావు.

దూరంనుంచే మురళిని చూశాడు ప్రసాద్. పరుగుతో ఎదురొచ్చి కౌగిలించుకున్నాడు.

"మాట నిలబెట్టుకున్నావు. చాలా మంచి పని చేశావు. వుండు...ఇప్పుడే వస్తాను" అని బెల్లం దుకాణంలోని ఒక వ్యక్తికి ఏవో పురమాయించి వచ్చాడు.

"పద" అని ముందుకు తోవ తీశాడు. మెయిన్‌రోడ్‌మీది ఓ ఉడిపి హోటల్‌లో ఎంతవద్దన్నా దట్టంగా టిఫిన్ తినిపించాడు.

"సాయంత్రందాకా ఉంటే ఇద్దరం బస్సులో పోదాం. వుంటావా? లేక ఇప్పుడే వెళ్ళిపోతావా?" అని అడిగాడు ప్రసాద్.

"ఒద్దు...సాయంత్రందాకా వుండలేను. వెళ్ళి స్నానంచెయ్యాలి. బడలికగా చిరాగ్గా వుంది" అని చెప్పాడు.

ఇద్దరూ బస్‌స్టేషనుకి బయలుదేరారు. తోవలో ఓ దుకాణు ఆగుతూ, అర్ధ కిలో లడ్డూలు మేనత్త మహాలక్ష్మమ్మకి కొన్నాడు.

"కొంతమంది రైతులు సాయంత్రం మళ్ళలికి వస్తానన్నారు. నోటులు రాయించుకోవాలి. లేకపోతే నేను ఇప్పుడే వచ్చేద్దును. వాళ్ళు ఇబ్బందిపడతారు" అన్నాడు ప్రసాద్.

"ఫరవాలేదు...సాయంత్రం కలుసుకొందాం" అన్నాడు మురళి అనునయంగా. "పీలుంటే నేను క్షేమంగా చేరుకున్నట్టు మా ఆఫీసుకి ఓ టెలిగ్రామ్ కొట్టు" అని ప్రసాద్‌కి పురమాయించాడు.

"తప్పకుండా ఇస్తాను. టెలిగ్రామ్ ఇచ్చిన తరవాతే బస్సెక్కుతాను"

ఇద్దరూ బస్‌స్టేషనుకి చేరేటప్పటికి దేవరాపల్లి బస్ సిద్ధంగా వుంది. మురళి బస్సెక్కగానే అది కదిలింది. ప్రసాద్ చెయ్యి వూపుకుంటూ బెల్లంమార్కెట్టువేపు నడిచిపోయాడు.

అనకాపల్లి నుంచి దేవరాపల్లి పోయే బస్‌రూట్‌లో ఉంది మురళివాళ్ళ సొంత వూరు. దాదాపు 15కిలోమీటర్లు వుంటుంది. బస్ జంక్షన్‌లో దిగి ఒకకిలోమీటరు దూరం దాటద్వారా నడిచిపోవాలి ఆ వూరికి.

బస్సు దిగాడు మురళి. చుట్టూ కలయ చూశాడు. ఎంతో మార్పు కనిపించింది.

వాళ్ళ ఊరికి కలిపే కాలిబాట కాస్తా రోడ్డయ్యింది. ఆ రోడ్డునే నడవసాగాడు. రోడ్డుకిరువేపులా పచ్చని వరిచేలూ, చెరకు తోటలూ వున్నాయి. చల్లని పైరగాలి శరీరాన్ని తాకుతూవుంటే ఒళ్లు పులకించి పోయింది. పట్టణాలలో ఏమున్నదని జనం అలా ఎగబడిపోతున్నారో మురళికి అర్థం కాలేదు.మురికికాలువలు, పట్టపగలే పీక్కు తినే దోమలు, ముక్కు ఊడిపోయే చెడు వాసన తప్ప మరేముంది పట్నాల్లో.

తోవలో ఏదో లోపం కనిపించింది అతనికి. జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఓ పెద్ద వేపచెట్టుండేది. దానిని నరికేసినట్లున్నారు. దానిపక్క దిగుడుబావి మాత్రం అలాగే వుంది. పదకొండుగంటలౌతోంది. దాహం వేసినట్లయింది. బావిలోకి దిగి ముఖం కడుక్కుని చల్లని నీళ్లు తాగాడు.

చిన్నప్పుడు రోజూ బడి అవగానే సాయంత్రాలు మిత్రులతో ఆ పరిసరాలలోనే ఆడుకునేవాడు.

మరికాస్త ముందుకి వెళ్ళాడు. రోడ్డు పక్కన ఎప్పుడో అమ్మేసిన మళ్లేగడి పొలం కనిపించింది. ఆ భూమాత కూడా కన్నతల్లిలాగే అనిపించింది. "నాకు తెలియని చిన్నతనంలోనే నిన్ను పోగొట్టుకున్నాను. మళ్ళీ నిన్ను సేవించడానికీ, నిన్ను పొందడానికీ వస్తున్నాను. నన్ను ఆశీర్వదించు" అని మనస్సులోనే మొక్కుకున్నాడు.

ఊరి పొలిమేరలుదాటి చెరువు గట్టు ఎక్కాడు. కొత్త కొత్త చెట్లు పెరిగాయి కొన్ని పాతవి పోయాయి. కొత్త కొత్త పాకలు వెలిశాయి. పాతవి పోయాయి. ఎంత మార్పు. కాలం ఎలాంటి మార్పులు తీసుకురాగలదు. ఈ పాతికేళ్ళలో తనలో మాత్రం ఎంత మార్పు రాలేదు. ఐదో క్లాసు పాసై కట్టుబట్టలతో అమ్మ రెక్క పట్టుకుని ఊరు విడిచి వెళ్ళిపోయాడు ఆనాడు. వ్యాపారిగా ఎదిగి మళ్ళీ ఊరు మీది మమకారంతో వస్తున్నాడీనాడు. ఎంత మార్పు.

ఊరిలో అడుగుపెట్టాడు. కొత్త కొత్త పెంకుటిళ్లు వెలిశాయి. కమ్మలఇళ్ళు పెంకుటిళ్ళయ్యాయి. ఊరిమధ్యకి వెళ్లాడు. రామకోవెల చక్కగా ఆహ్వానిస్తున్నట్లు కోవెల ముందు మండపం కట్టించారు. మండపంలో ఎవరో ముసలివాళ్లు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

కోవెల ముందు చెప్పులు విడిచి సూట్ కేస్ కిందపెట్టి నమస్కరించాడు. మళ్ళీ సూట్ కేసు పట్టుకుని చెప్పులు తొడుక్కున్నాడు.

తమ ఇంటి ముఖంగా నడిచాడు. పెద్ద మేడ కనిపించింది. ఎదురుగా పెద్ద ద్వారం. నడవ గదిలోంచి నాలుగిళ్ళ లోగిలి కనిపించింది. మురళి ముఖం ఎరుపెక్కింది. కళ్ళు నిప్పులయ్యాయి. పళ్ళు బిగుసుకున్నాయి. ఊరుని దోచుకుంటున్నగజదొంగ ఇల్లుఅది. పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు రాఘవయ్య ఇల్లు అదే! తన బద్ధశత్రువు చిన్నాయన అక్రమంగా కాజేసిన ఇల్లు అదే! ఆ పక్కన వున్నదే తమ పెంకుటిల్లు.

రెండు గదుల చిన్న పెంకుటిల్లు అది. ఎదురుగా రెండు గదుల ముందూ గచ్చువరండా. అయిదారు మంచాలు పడతాయి. ఆరడుగుల వరండాని గోడ మూస్తుంది. అక్కడే అమ్మ వంట చేసేది. ఇప్పుడా ఇంట్లో మహాలక్ష్మమ్మత్త ఉంటోంది. హైదరాబాదునుంచి





బయలుదేరేముందే ఆమెకి ఉత్తరం రాశాడు.

మురళి గనక ఉత్తరం రాయకపోతే గుర్తుపట్టివుండేదికాదు. ఎత్తయిన కండలు తిరిగిన మురళిని చూసి వీడేనా మురళి. ఎంత ఎదిగిపోయాడు అనుకుంది. ఎదురువచ్చి చెంబుతో నీళ్ళిచ్చింది. కాళ్లు కడుక్కుని లోనికి వెళ్ళాడు.

అరటి పండ్లు, స్వీట్ల పొట్లం అందించాడు.

ఎన్నో కళ్లు మురళిని అప్పటికే గమనిస్తున్నాయి అంతవరకూ ఆ వచ్చిన వ్యక్తి ఎవరా అని చూస్తున్న వాళ్ళందరికీ ఎవరైందీ అవగతమైంది. పరిచయం లేకపోవడం, కనిపిస్తున్న 'అతని హోదా వాళ్ళ నోళ్ళకి మూతవేశాయి. లేకపోతే మాట్లాడి పలకరించేవాళ్ళే.

"మీ అమ్మ ఎలాగుందయ్యా?" అని పరామర్శించింది మహలక్ష్మమ్మ.

"బాగానే వుందత్తా! నిన్ను మరీ మరీ అడిగింది'' అన్నాడు.

"నీ భార్య, మీ మామయ్యా అంతా బాగున్నారుగదా?"

"అందరూ బాగున్నారుగాని ఇక్కడి సంగతులు చెప్పు. మీ అన్న రాఘవయ్య బాగున్నాడా?''

"వాడికేమయ్యా! ఊరిని ఏలుతున్నాడు. వాడి కొడుకు కూడా అచ్చోసినఆంబోతులాగా ఊరిమీద పడి అధికారం చలాయించడం మొదలుపెట్టాడు" అంది. ఆ మాటల్లో అయిష్టత ధ్వనించింది.

"ఏం...అలాగ మాట్లాడుతున్నావు? నీకేమీ సాయం చెయ్యనా?" అనడిగాడు.

"వారి సాయం ఎవరిక్కావాలి.ఆయన పోయినా నా వాటాకి వచ్చిన ఎకరం పొలం మీది ఆదాయంతో గడుపుకొస్తున్నాను. కనీసం కనిపిస్తే కూడా చెల్లెలు గదాఅనైనా మాట్లాడడు" అని విచారంగా చెప్పింది.

"సరే....వాళ్ళనే బాగుపడనియ్యి" అన్నాడు.

వంట చేసింది. స్నానానికి నీళ్ళు తెచ్చి సిద్ధంగా వుంచింది. ఆరుబయట వాకిళ్లో గోచి కట్టుకుని మగవాళ్లు, కమ్మలు దడులు కట్టుకుని ఆ మరుగులో ఆడవాళ్లు స్నానాలు చేస్తారు.

ఇన్నేళ్ళయినా పాయఖానాలు ఆ వూళ్ళో లేవు. స్త్రీల ఇబ్బందులు అర్థం చేసుకోలేనివాడు ఆ పంచాయితీబోర్డు ప్రెసిడెంటు! అందుకని రాత్రివేళ మాత్రమే స్త్రీలు మంద బయలుకి పోతూ వుంటారు. ముందుగా ఈ విషయంలో గొడవలేవదియ్యాలి అనుకున్నాడు. సురేఖ వస్తే ఎలాగ పాపం. చేసేది ఏదో వెంటనే చెయ్యాలి.

స్నానం చెయ్యకుండా భోజనం చెయ్యలేదు. అందుకని ఇష్టం లేకపోయినా బిందెలో నీళ్ళు వాకిట్లోనే అండర్‌వేర్‌తో పోసుకున్నాడు.

అండర్‌వేర్, బనియను మార్చుకుని, లుంగీకట్టుకుని భోజనానికి కూర్చున్నాడు. భోజనం సయిస్తుందో లేదో అని భయపడ్డాడు. కాని కోడిగుడ్లు, ఉల్లిపాయల ఇగురు, పప్పు చేసి, పాపం చారు కూడా చేసింది. బాగానే కుదిరాయి. ఆకలి కూడా వెయ్యడంతో శుభ్రంగా తిన్నాడు.

ఈలోగా మంచం వేసి, "కాసేపు పడుకో" అని ఎంగిళ్లు తియ్యడానికి ఉపక్రమించింది మహలక్ష్మమ్మ.

మురళి మంచం మీద పడుకుని కార్యక్రమాన్ని రూపొందించుకున్నాడు. ముందుగా బాల్యమిత్రుల్ని, తరవాత




గ్రామ పెద్దల్ని కలుసుకోవాలనుకున్నాడు. రైలులో రాత్రి బాగానే నిద్రపోయాడు. పగలు నిద్రపోవడంఅలవాటు లేదు. కాని భోజనం చేసిన తరవాత మంచంమీద పడుకుని పేపరు చదువుతాడు. ఒక్కోమారు తెలియకుండా ఓ పావు గంట నిద్రపడితే పడుతుంది కూడా. అలసటచేతనో ఏమో మురళికి ఈరోజు బాగానే నిద్ర పట్టింది.

సాయంత్రం నాలుగు గంటలకి నిద్ర లేచాడు. బట్టలు వేసుకునిఊరిలోకిబయలుదేరాడు. మురళికన్నా అతని గురించిన సమాచారం ముందుగానే ఊరంతా తెలిసిపోయింది. అందుకనే కొంతమంది ఎంతో మర్యాదగా పలకరించారు. అతను మాత్రం అందరితోనూ సరదాగా మాట్లాడాడు.

ముందుగా బలరామయ్యగారింటికి వెళ్ళాడు. విశాలమైన పెంకుటిల్లు, పెద్ద హాలులాటి వరండా! ఇనప కటకటాలతో ఆ వరండాకూడా మూసివుంది. కటకటాల తలుపు తెరిచేవుంది.

ఓ వాలుకుర్చీలో పేపరు చదువుకుంటూ ఓ అరవై యేళ్ళు పైబడ్డ వృద్ధుడు కనిపించాడు. బలిష్టంగానే వున్నాడు. తల సగానికిపైగా నెరిసివుంది. ముఖం చూసి మురళి గుర్తుపట్టాడు.

"నమస్కారం మామయ్యా" అని తనే పలకరించాడు.

చదువుతున్న దినపత్రికని పక్కనే వున్న బెంచీమీద పడేసి మురళిని పరీక్షగా చూశాడు బలరామయ్య. అయినా గుర్తుపట్టలేకపోయాడు.

"నేను మామయ్యా..వేణుగోపాలరావు గారి అబ్బాయిని. ఈవేళే హైదరాబాదు నుంచి వచ్చాను" అన్నాడు.

బలరామయ్య ముఖం సంతోషంతో వికసించింది. "ఇలా దగ్గరకురా. మురళి బాబువా..చాలా సంతోషం. ఇంత కాలానికి మామయ్య జ్ఞాపకం వచ్చాడన్నమాట. మా ప్రసాద్ మొన్న హైదరాబాదులో నిన్ను కలిశాడటగదా" అన్నాడు. దగ్గరగా వచ్చిన మురళి వీపు నిమిరి, "చాలా పెద్దోడివయ్యావే! వస్తాదులాగున్నావు. చాలా సంతోషం" అన్నాడు.

మురళి బలరామయ్యని చూసి తన తండ్రి బతికివుంటే ఆ వయసులోనే వుండి వుండేవాడని అనుకున్నాడు.

"నువ్వేదో పెద్ద వ్యాపారమే చేస్తున్నావని మా ప్రసాద్ చెప్పాడు" అన్నాడు.

"పెద్ద వ్యాపారం ఏమీ కాదులెండి. రేడియో షాపు"

"ఏదో ఒకటి. మీ నాన్న వ్యవహార దక్షత నీకూ అబ్బిందన్నమాట. నాలుగు రోజులుంటావా?" అన్నారు బలరామయ్య గారు.

"నాలుగు రోజులు కాదు. మీలాంటి పెద్దలందరూ ఆశీర్వదిస్తే మన వూరొచ్చి స్థిరపడదామనుకుంటున్నానండీ" అన్నాడు మురళి.

"అంతకన్నానా. నాకెంతో సంతోషంగా వుందయ్యా! మీ నాన్న ఊరి కోసం, ఊరి బాగుకోసం ఎంతో పాటు పడేవాడు. ఆ దుర్ఘటన జరక్కపోతే ఈ ఊరిలాగ వుండేదికాదు. ఎంతో అభివృద్ధి చెందేది" అని చాలా బాధగా చెప్పాడు.

బలరామయ్యగారి కోడలు వచ్చిన అతిథి ఎవరో తెలియకపోయినా హైదరాబాదు నుంచి వచ్చాడని అర్థంచేసుకుంది. రెండు మినప సున్నివుండలు ప్లేటులో తెచ్చి "తీసుకోండి" అని బెంచిమీద పెట్టింది.



"సుశీలా! ఈ అబ్బాయి నా స్నేహితుడు వేణుగారబ్బాయి. ప్రసాద్ హైదరాబాదు వెళితే పిళ్ళింటికే వెళుతుం టాడు" అని మురళిని పరిచయం చేశాడు

"నమస్కారం" అని చేతులు జోడిం చాడు మురళి.

తనకన్నా వయసులో పెద్దవాడైన వ్యక్తి నమస్కరించడం నచ్చక ఇబ్బందిగా,

"తీసుకోండి" అని లోనికి వెళ్ళి పోయింది.

మురళి ఒక వుండ తిన్నాడు. అంతలో ఓ గ్లాసెడు చిక్కని మజ్జిగ ఇచ్చింది. తీసుకుని తాగాడు.

"వస్తానండీ! మళ్లీ కలుసుకుంటాను. ప్రసాద్‌తో నేను వచ్చి వెళ్ళానని చెప్పండి. సాయంత్రం రాగానే మా ఇంటికి రమ్మన్నానని చెప్పండి" అని బెంచీమీదనుంచి లేచాడు.

ఊర్లో రోడ్లు వేశారు. వీధి దీపా లున్నాయి. చాలా తేడా కనిపించింది. లైబ్రరీ, హైస్కూలు, హాస్పిటల్, సహకార గ్రామీణ బాంక్ అన్నీ వచ్చాయి. ఫరవాలేదు అనుకున్నాడు.

లైబ్రరీలో చాలామందితో పరిచయం అయింది. అందులో రోజూ అనకాపల్లి కాలేజీకి వెళ్ళి మళ్లీ సాయంత్రానికి ఊరు చేరుకునే విద్యార్థులు చాలామంది వున్నారు. కొంతమంది చదువుని అశ్రద్ధ చేసి పరీక్షలు తప్పి అటు పొలంపనికి, ఇటు ఉద్యోగానికీ పనికిరాక షోకుగా తయారై ఊరిమీద బలాదూరు తిరిగే వారు వున్నారు. కాని వాళ్ళందరికీ రాజ కీయ పరిజ్ఞానం మాత్రం బాగానే వుందని తర్వాత తేలింది. ఆరోజుల్లో ఇంత చైతన్యం యువకుల్లో లేదు.

నరసింహం అనే విద్యార్థితో "మీరేం చదువుతున్నారు?" అని అడిగాడు.

"బి.ఎ. ఫైనలియరండీ" అన్నాడు.

"మన ఊరిని రాఘవయ్యగారు చాలా బాగుచేసినట్లు కనిపిస్తోంది. పాతికేళ్ళ క్రితం నేను మన ఊరు విడిచిపెట్టి మళ్లీ ఈరోజే వచ్చాను" అన్నాడు.

అందరూ మురళిని ఆశ్చర్యంగా చూశారు.

నరసింహం, "మీరు పొరపడుతున్నారు. ఈ ఊరుని సర్వనాశనం చేసింది వాడే. మీరు చూస్తున్న ఈ అభివృద్ధి పదేళ్ళ క్రితం బలరామయ్య చేసిందే. వీడు పదేళ్ళక్రితం ప్రెసిడెంటయ్యాడు. ఒక్క పని చేయిస్తే ఒట్టు. బలరామయ్య వుంటే ఈపాటికి పంపులుకూడా వచ్చేవి. స్కీము కూడా శాంక్షను చేయించాడు. ఎలక్షన్లు రావడం, ఈ శనిగాడు నెగ్గడం, ఊరు ఇలా తగలడ్డం జరిగింది. బావులనుంచి నీళ్ళుతేవడం ఆడవాళ్ళకి పెద్ద యాతనగావుంది. వాళ్ళకి మరుగు దొడ్లుకూడాలేవు" అని వివరించాడు.

"మరి మీరు అతన్ని దించెయ్యవచ్చునుగదా?"

"ఆమధ్య రాకరాక వచ్చిన పంచాయితీఎలక్షన్లలో విశ్వప్రయత్నంచేశాము. కానీ ఊరిలో సగానికిపైగా జనాభా వాడి దగ్గర అప్పులుచేశారు. ఓడిపోతే అప్పులు వసూలుచేస్తానని భయపెట్టాడు. బెదిరి వాడికే ఓటువేశారు. దానికితోడు నోట్లు వెదజల్లి కొన్ని ఓట్లు కొనేశాడు. ఎవ్వరికీ ఇష్టంలేకపోయినా ఊరికి పీడ విరగడవ లేదు" అని చెప్పాడు.

"మరి మీ యువతరం ఏంచేస్తోంది?"

"మా యూత్‌క్లబ్ మెంబర్లం ఊర్లో జరుగుతున్న ప్రతి అన్యాయాన్నీ ప్రతిఘ



టిస్తున్నాం. గ్రామీణ సహకార సంస్థ లన్నింటిలోనూ అవకతవకలు జరుగు తున్నాయి. అన్నిటిలోనూ పంచాయిటీ బోర్డు ప్రెసిడెంటుకి లాలూచీలున్నాయి. కాని మాకు పెద్దవాళ్ళు సహకరించడం లేదు. పై అధికార్లకి మేము పిటిషన్లు పెడితే మమ్మల్నే తిడుతున్నారు" అన్నాడు.

ఎవరో సైకిలికి రావడంచూసి అందరూ మాట్లాడ్డం మానుకున్నారు. పుస్తకాలు, పేపర్లు తీసుకుని పఠనంలో మునిగిపోయారు.

"భాస్కర్ వస్తున్నాడు. ప్రెసిడెంటు కొడుకు. చదువూసామూ అబ్బకపోయినా రౌడీలాగ ఊరిమీదపడి అధికారం చలా యిస్తాడు" అని గొణుక్కున్నాడు నరసింహం.

ఊరిని రాఘవయ్య ఎంత చెప్పు చేతల్లో వుంచాడో మురళికి అర్థమైంది.

భాస్కర్ సరాసరి వచ్చి "మురళివి నువ్వేనా?" అని అడిగాడు.

భాస్కర్ అడిగిన తీరుకి మురళి ఒళ్ళు మండింది.

నిజానికి రాఘవయ్య మురళిని మర్యా దగా పిలుచుకురమ్మనే పంపించాడు. ఆస్తిపాస్తులులేక కోరలులేని పాములాగ వెనక్కి వచ్చిన మురళిని ఉన్న నాలుగు రోజులూ మర్యాదచేసి పంపేస్తే పాత పగలు సమసిపోతాయనే ఉద్దేశంతోనే పిలిచాడు. కాని భాస్కర్ ప్రవర్తన అలాంటిది!

"అవును...ఎందుకు?" అన్నాడు మురళి.

"నాన్న నిన్ను పిలుచుకురమ్మ న్నాడు" అన్నాడు.

"తర్వాత వస్తానని చెప్పు"



"కాదు... ఇప్పుడే నుంచున్నపళంగా రమ్మన్నాడు"

"ఒకమారు ఇలాగే చీఫ్ మినిష్టర్ కూడా వున్నపళానరమ్మని కాపుపంపాడు. పిల్లేదు పొమ్మన్నాను. మీ నాన్నకి సాయంత్రం వస్తానన్నానని చెప్పు" అన్నాడు మురళి.

దాంతో భాస్కర్‌కి అంతమందిలోనూ తల తీసేసినట్లయింది. "ఊరికి కొత్త వాడివి. కొంచెం మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకో. లేకపోతే రేపే హైదరాబాదు రైలెక్కించెయ్యగలను" అన్నాడు కోపంగా.

"ఇదేనా నీకు తెలిసిన మర్యాద? రయ్యానికి కాలుదువ్వుతున్నావు, గనుక చెబుతున్నాను. నువ్విలాగే మాట్లాడితే నిన్ను చంద్రమండలానికి రాకెట్ ఎక్కించిగాని నేను హైదరాబాదు రైలెక్కను" అన్నాడు కోపంగా.

భాస్కర్ తల తిరిగిపోయింది. పంచా యితీబోర్డు ప్రెసిడెంటు, ఊరికి మోతుబరి రైతుకొడుకయిన తనని తాడూబొంగరం లేని అణాకాణీగాడు ఇంత తిరస్కరిస్తే రేపు తన ప్రతిష్ట ఏంకావాలి? వెధవని తొక్కివెయ్యాలి. చదువుకున్నవాడిననే పెక్కు లాగుంది. గుంజిపడేస్తాను అను కున్నాడు.

"ముందు వస్తావా రావా?" అని కాలరు పట్టుకున్నాడు.

ఒడ్డూ పొడుగూ బాగానే వుంటాడు భాస్కర్.

మురళికి కోపం వచ్చింది. దాచి డొక్కలో తన్నాలనుకున్నాడు. కాని ఏ పక్క ఎముకలో విరిగిపోతాయి. అమ్మకీ, సురేఖకీ, శ్రీధర్‌కీ ఇచ్చినమాట తప్పిన వాడౌతాడు.

సౌమ్యంగా, "ముందుచొక్కా వదులు"

అన్నాడు.

"వదలను. ముందు నువ్వు మర్యాదగా రా...లేకపోతే ఈడ్చుకుపోతాను" అని మరికొంచెం పట్టు బిగించాడు.

చిన్ననాటి సంఘటన జ్ఞాపకం వచ్చింది. ఆనాడు తను కొట్టకపోయినా చాడీలుచెప్పి తండ్రిచేత రెక్కపట్టి ఈడ్పించాడు. ఇప్పుడు కొడితే ఏంచేస్తాడో చూద్దాం అనుకున్నాడు.

భాస్కర్ బలాన్ని అంచనా వెయ్యడానికి కొంచెం కొంచెం బలంపెంచుతూ భాస్కర్‌ని వెనక్కి తొయ్యసాగాడు. భాస్కర్ తన శక్తినంతా వినియోగించి మురళిని నిరోధించాడు.

కరాటే, జూడో, కుంగ్‌ఫూలాంటి మల్ల యుద్ధాలలో శత్రువు శక్తిని మొదట అంచనావేసి ఆ శత్రువు శక్తిని కూడా వినియోగించుకుంటారు. ప్రత్యర్థి అయిన శత్రువుకి ఆ మెళకువలు తెలియకపోతే చిన్నకుర్రవాడి చేతిలో కూడా చిత్తె దెబ్బలు తినడం ఖాయం.

భాస్కర్ పూర్తి బలాన్ని ఉపయోగించేదాకా ప్రతిఘటించి, క్షణంలో ఆ ప్రతిఘటనని ఉపసంహరించుకుని మెరుపులాగ తప్పుకుని భాస్కర్‌ని ముందుకి లాగాడు. భాస్కర్ చొక్కాని వదిలి చేతులు నేలని ఆనుకోకపోతే ముఖం చితికి సగం పళ్ళు రాలిపోతాయి. వెంటనే చొక్కా వదిలి బొక్కబోర్లా పడ్డాడు.

మురళి భాస్కర్ మీదకి వంగి వెనక నుంచి అతడి చొక్కా కాలరు పట్టుకుని లేపాడు. ఒక చెయ్యి దొరకబుచ్చుకుని వెనకనుంచి మెలిపెట్టాడు.

భాస్కర్ విడిపించుకోవడానికి ప్రయత్నించినకొద్దీ బిగించాడు. చెయ్యి వూడిపోతున్నట్లు భుజంలో నొప్పి రావటంతో కదలకుండా వుండిపోయాడు.

"ఇప్పుడైనా మర్యాదగా ఇంటికి వెళతావా? గూళ్ళు విరిచెయ్యాలా?" అన్నాడు మురళి.

భాస్కర్ అవమానంతో తల వంచుకున్నాడు.

అమ్మ చెప్పింది జ్ఞాపకం వచ్చింది. ఏ గొడవా పడకుండానే అనుకున్నవి సాధించాలి అనుకుని ఏమీకానట్లు చిరునవ్వుతో "వెళ్ళు తమ్ముడూ! నీకన్నా పెద్దవాడిని, కాస్త మర్యాదగా రమ్మంటే నీసొమ్మేంపోయింది. ఓ గంటలో వస్తానని చెప్పు" అని ప్రేమగా భుజంమీద చరిచి పొమ్మన్నాడు.

భాస్కర్ రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు. అలా చాలాదూరంపోయేదాకా అతడినే అందరూ గమనించారు. వెనక్కి తిరిగి చూడలేదు. కొంతదూరం పోయేక భుజాన్ని ఎన్నోమార్లు విదిలించాడు.

"కాపడంపెట్టాలి. మూడురోజులదాకా చెయ్యి లేవదు" అన్నాడు మురళి.

మురళి మాట్లాడిన తీరు ఆ యువకులందరికీ ఆశ్చర్యం కలగజేసింది. రాఘవయ్యని భాస్కర్ ఎదురుగా అలా నిర్లక్ష్యం చెయ్యడం ఆ వూళ్ళోవాళ్ళకి తెలిసిననాటినుంచీ జరగలేదు. ఊరిలో ఏదో ఉపద్రవం జరగబోతున్న సూచనలు వారికి కనిపించాయి.

"మీరింకా ఎన్ని రోజులుంటారండీ" నరసింహమే మళ్ళీ అడిగాడు.

అందరూ ఒళ్ళంతా కళ్ళు చేసుకుని మురళిని చూడసాగారు.

"నేనెక్కడికీ వెళ్ళను. మన వూళ్ళో స్థిరపడదామనేవచ్చాను. మీ యూత్‌క్లబ్‌లో నన్ను కూడా మెంబర్ని చేసుకోండి. మీతోపాటు ఊరిని బాగుచేసే అవకాశం

ఇవ్వండి" అన్నాడు.

"అలాగేనండీ. ఈరోజునుంచే మీరు మెంబరు. రాజకీయంగా, సాంఘికంగా ఊరిని పట్టి పీడిస్తున్న వ్యక్తుల్ని, మేము ఎదుర్కొంటున్న సమస్యల్ని మీకు తరవాత వివరిస్తాము" అన్నాడు నరసింహం.

"థాంక్స్! అయితే నేనిక వెళ్ళిరానా" అని వాళ్ళందరికీ చెప్పి బయలుదేరాడు.

మురళి వెళ్ళిన అర్ధగంటదాకా అతడి ధైర్యాన్ని గురించే వాళ్ళు మాట్లాడుకున్నారు. వాళ్ళు అంతకాలంగా ఎదురు చూస్తున్నది అలాంటి వ్యక్తికోసమే. నడిపించేవాడుంటే ఎంత దూరం వెళ్ళడానికైనా వాళ్ళు సిద్ధంగానే వున్నారు.




కాళ్ళూ, చేతులూ కడుక్కుని పేంటు విప్పి లుంగీ కట్టుకున్నాడు మురళి.

"భోజనం పెట్టెయ్యమంటావా బాబూ" అనడిగింది మేనత్త.

"ఇంకా వస్తా! రాఘవయ్య నన్ను రమ్మని కబురుపెట్టాడు. వెళ్ళి వచ్చి భోంచేస్తాను" అని రాఘవయ్య ఇంటివేపు నడిచాడు.

వచ్చినరోజునే భాస్కర్‌తో గొడవ పడటం మురళికి నచ్చలేదు. అనవసరంగా భాస్కర్ తన చొక్కా పట్టుకున్నాడు. జరిగిందేదో జరిగిపోయింది. మళ్ళీ అలాంటి సంఘటన జరగకుండా జాగ్రత్త పడాలి. పగ సాధించుకోవడానికివచ్చినట్లు రాఘవయ్య తెలుసుకోగూడదు.

రాఘవయ్య ఇల్లు ఇంద్రభవనంలాగ వెలిగిపోతోంది. ఎదురుగుండా ఎత్తైన మెట్లు ఆహ్వానిస్తున్నాయి. లోనికి ప్రవేశించడానికి నడవ. మెల్లగా మెట్లెక్కి లోన ప్రవేశించాడు. లోపల నాలుగిళ్ళ లోగిలి. పెద్ద ఆవరణ. చుట్టూ వరండా. మధ్యనున్న లోగిలిలోకి పగలు ఎండ, రాత్రి వెన్నెల వద్దన్నా కాస్తాయి. ఇల్లు పాతదే అయినా అలంకరణకి బాగానే ఖర్చుపెట్టినట్లున్నాడు. వాస్తుశాస్త్రంలో కూడా చాలా మార్పులు వచ్చాయి. ఆధునిక గృహ నిర్మాణంలో గాలికీ, వెలుతురుకీ ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. ఈ ఇంట్లో రక్షణ వున్నా గాలి మాత్రం రాదు. ఫేన్ల మీదనే ఆధార పడవలసి వుంటుంది. నిజానికి ఈ ఇంట్లో తనకి కూడా వాటా వుంది. మోసం చేసి కాజేశాడు రాఘవయ్య.

మురళి లోన ప్రవేశించగానే కుక్క మొరిగింది. కుడి వేపున ఒక గది, ఎడం వైపున ఒక గది వున్నాయి. ఒకటి రాఘవయ్య ఆఫీసుకీ, రెండోది భాస్కర్ తన స్టడీ రూమ్‌కీ వాడుకుంటున్నారు.

కుక్క అరవగానే భాస్కర్ బయటికి వచ్చాడు. ట్యూబ్‌లైట్ వెలుగులో వరండాలో నుంచున్న మురళిని చూసి కాస్త కంగారుపడ్డట్టు కనిపించాడు. ముఖం చూస్తే జరిగిన సంగతి చెప్పినట్లు లేదు. చిన్నప్పుడు కొట్టందే కొట్టాడని పితూరీ చెప్పేవాడు. ఇప్పుడు జబ్బ సలుపుతున్నా కెవ్వరుమనడం లేదు - అనుకున్నాడు మురళి.

కుడివేపు రాఘవయ్య గదిలోనుంచి




ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి.

"నాన్న ఆ గదిలో వున్నారు...వెళ్ళు" అనేసి ఎడమవేపున్న తన గదిలోకి జారుకున్నాడు.

మురళి ఆ గదిలో అడుగుపెట్టాడు. రాఘవయ్య ఆ ఆజానుబాహుణ్ని చూసి మురళి అనుకుని వుండేవాడు కాదు ముందే తెలియకపోతే! ''ఏం మురళీ! రా...అలా కూర్చో'' అన్నాడు

మురళి ఓ కుర్చీలో కూర్చున్నాడు.

ఇద్దరు రైతులు ఏదో డబ్బు పని మీద వచ్చినట్లున్నారు. వాళ్ళని త్వరగా పంపించేశాడు.

మురళి ఎదురగానుంచుని, "మీ అమ్మా, మామయ్య అంతా బాగున్నారా?" అని పరామర్శించాడు.

మురళి తల వూపాడు.

"నాలుగు రోజులుంటావా?"

"ఇక్కడే వుండిపోదామని వచ్చాను. హైదరాబాదు ఇక వెళ్ళను" అన్నాడు మురళి.

రాఘవయ్య ముఖం వెలవెలపోయింది. శత్రుశేషం, రుణశేషం, అగ్నిశేషాన్ని వుంచకూడదనే సిద్ధాంతాన్ని నమ్మిన వ్యక్తి. తాను వాళ్ళకి చేసిన ద్రోహాలు తెలుసు. కోరి తెచ్చుకున్న శత్రుత్వం. మురళిని ఊరునించి ఎలాగైనా తరిమెయ్యడం శ్రేయస్కరం. ఒక్కమారు ఏదైనా దొంగిలించిన తరువాత ఆ వస్తువు సొంతదారుడు మరి కనిపించకూడదు. అదే రాఘవయ్య సూత్రం.

"నువ్వేదో చదువుకుని ప్రయోజకుడివయ్యావని విని సంతోషించాను. మావాడు చూడు. చదువూ సంధ్యా అబ్బక ఊరు మీదపడి తిరుగుతున్నాడు. ఈ పల్లెటూరిలో ఏం చేస్తావు. నా మాట విని నీ భవిష్యత్తుని పాడుచేసుకోకు. చదువుకున్న వాళ్ళకి పట్నాలే నయం. మీ నాన్న చదువుకుని కూడా ఊళ్ళేలాలని చూశాడు. ఏమైంది?" అన్నాడు రాఘవయ్య.

"ఏ లాభమూ వుండదని ఉన్న వూరునీ కన్నతల్లినీ వదులుకుంటారా ఎవరైనా? ఇక్కడున్న వాళ్ళందరూ బతకడం లేదా? ఇప్పటికి సంపాదించిందే చాలని వచ్చేశాను" అన్నాడు మురళి.

"నీ ఇష్టం''అన్నాడేగాని రాఘవయ్య ముఖం ముడుకునిపోయి పెంకులాగ మాడిపోవడం గమనించాడు మురళి.

పాతికేళ్ళ క్రితం ఊరు విడిచి వెళ్ళిపోయారు. రాక రాక వచ్చాడన్న ప్రసన్నత ముఖంలో లేదు. ఉన్నదంతా లాక్కున్నానుగదా, చిప్పా జోలె చేతికిచ్చానుగదా అన్న తృప్తి లేదు. ఇంకా బతికే వున్నాడే. కాళ్ళైనా విరగకొట్టక పోతినే-అని బాధపడిపోతున్నట్లున్నాడు అని అతని బుద్ధిని అంచనా వేసుకుని లోలోనే నవ్వుకున్నాడు మురళి.

"కూర్చో... ఇప్పుడేవస్తాను" అని లోనికి వెళ్ళాడు రాఘవయ్య. ఇతగాడు తనతల్లిమీద చెయ్యిబోయిన అఘాయిత్యం జ్ఞాపకం వచ్చింది. వెనుక నుంచి ఎగిరి తన్నాలనిపించింది. కాని వాడి కళ్ళు వాడి వేళ్ళతోటే పొడవాలట. అంత దాకా ఆగడం కష్టమే. భయపెట్టాలి, బాధపెట్టాలి, ఏడిపించాలి అనుకున్నాడు.

జేబులోంచికీచైన్‌కివున్న కత్తిబయటికి లాగాడు. రాఘవయ్య పాత కుర్చీ మీద కూర్చుంటున్నాడు. ఆ కుర్చీ పైవుడ్ పెచ్చులు లేస్తోంది. పిన్నికి తన రాక గురించి చెప్పి ఏదో ఏర్పాట్లు చెయ్యడానికి వెళ్ళి వుంటాడు. రావడానికి టైమ్ పడుతుంది.భాస్కర్ తన దగ్గిరికి ఇక జన్మలో

రాదు అనుకుని సూదిగావున్న ఓ పేడుని కోసి రెండంగుళాల ఎత్తుకి లేపి విరిచాడు. కుర్చీ మధ్యలో నిలబెట్టాడు. మొన సూదిగా చెక్కినట్లు వచ్చింది.

వెనక్కి వచ్చి యధాస్థానంలో కూర్చున్నాడు. రాఘవయ్య వచ్చాడు. అలవాటు ప్రకారం స్థూలకాయాన్ని తన కుర్చీమీద కుదేశాడు.

అంతే! మరుక్షణం "అమ్మా" అని అరిచి స్ప్రింగులాగ మళ్ళీలేచాడు. పంచెను చించుకుని అంగుళం లోతు పేడు పిర్ర లోకి దిగిపోయింది. రక్తం బయటికి చిమ్మింది.

"ఏమైంది చిన్నాన్నా?" అని లేచి వెళ్ళి కుర్చీని చూశాడు.

"ఇంత డబ్బు సంపాదిస్తున్నావు. ఇలాంటి పాత కుర్చీలలోనా నువ్వు కూర్చు నేది. చూడు..ఎక్కడ చూసినా పెచ్చులు లేచివుంది. ఓ డెకలామ్ కుర్చీకొనుక్కో" అని ఉచితమైన సలహా ఇచ్చాడు.

"నిజమే! వెధవ కుర్చీని మార్పించాలి. చాలా పంచెలు కూడా చినిగిపోయాయి" అన్నాడు మెల్లగా. పాపం పిర్ర సలుపు తోంది. ఎక్కడా లేని నీరసం వచ్చేసింది.

"మురళీ... భోజనం చేద్దాం రా" అన్నాడు.

"అత్త వంట చేసేసింది. మరోసారి చేస్తాను" అని బయటికి నడిచాడు.

భోజనం చేస్తూ వుండగా ప్రసాద్ వచ్చాడు. టెలిగ్రామ్ ఇచ్చానని చెప్పాడు.

ఇద్దరూ కాసేపు తిరగడానికి వెళ్ళారు. వాళ్ళమ్మ చెప్పిన కథంతా ప్రసాద్‌కి చెప్పాడు.

"నా బాల్యస్నేహితుడివిగనక చెప్పాను నీలోనే దాచుకో. నా బాధ అర్థంచేసుకునే వాడొకడైనా ఈ వూళ్ళో వుండాలి. నువ్వు తప్ప నాకెవరూ లేరు" అన్నాడు.

"సమయం చూసి వాడి పనిపడదాం" అన్నాడు ప్రసాద్.ఇద్దరూ చెయ్యీచెయ్యీ కలుపుకున్నారు.

కాసేపుండి ఎవరి ఇళ్ళకి వాళ్ళు వెళ్ళి పోయారు.

* * *

మురళి మంచంమీద పడుకున్నాడు. నిద్రపట్టడంలేదు. భవిష్యత్తు తేలు కొండి లాంటి ప్రశ్నార్థకంగా కనిపిస్తూంది. ఏదైనా ఒక కార్యక్రమం లేనిదే ఆ వూళ్ళో కాలక్షేపం చెయ్యడం కష్టమే. ముందుగా పురందర్నీ తన వాళ్ళుగా చేసుకోవాలి. ఇదివరకటిలాగా రామకోవెలలో పురాణ కాలక్షేపం జరగడంలేదులాగుంది.

"అత్తమ్మా" అని పిలిచాడు ఇంటికి చేరగానే.

"ఏం మురళీ" అని దగ్గరికి వచ్చి కూర్చుంది.

"గుడిలో ఇదివరకటిలాగ పురాణం చదవడంలేదా?" అని అడిగాడు.

"అది అన్నయ్యతోటే పోయింది. అన్నయ్య పద్యాలు చదువుతుంటే ఆ పంతులు అర్థం చెబుతుంటే వినవలసిందే. ఇప్పుడందరికీ సినిమాల పిచ్చి. ఒక్కళ్ళకీ రామాకృష్ణా అందామనే ధ్యాసేలేదు. అంతెందుకు-శనివారాలు భజనలు జరిగేవి కదా... మండపం జనంతో కిటకిటలాడేది. తాళాలు, మద్దెల కీర్తనలు పాడుతూవుంటే ఎంతో బాగుండేది. ఓ ఏడాదినుంచి నలుగురైనా రావడం లేదని మానేశారు" అని చెప్పింది.

"సరే.. వెళ్ళి పడుకో" అని చెప్పగానే మహాలక్ష్మమ్మ వెళ్ళి నిద్రపోయింది.

ఏదో మిషమీద నలుగురూ కలుసు కుంటూ వుంటూనే ఒకళ్ళ మీద ఒకరికి

ప్రేమాభిమానాలేర్పడతాయి. అందుకనే పండుగలూ, తిరణాలూ పెద్దలు ఏర్పరచి వుంటారు అనేది మురళి నమ్మకం. ఏదో ఒకటి చెయ్యాలి!

అతనికి మెరుపులాంటి ఆలోచన తట్టింది.

వెంటనే లేచి లైటు వెలిగించి కాగితం కలం తీసుకున్నాడు.

"చి॥ శ్రీధర్‌కి

ఊరికి క్షేమంగానే చేరుకున్నాను. టెలిగ్రామ్ అందేవుంటుంది. మా పాత ఇల్లు సౌకర్యంగానేవుంది. సున్నం, రంగులూ అవీ వేయిస్తే చాలు. రీమోడల్ అనవసరం. ఓ బాత్ రూం, సెప్టిక్ లెట్రిన్ మాత్రం కట్టించాలి. లేకపోతే మీ అక్క ఈ ఊళ్ళో వుండలేదు. మన వి.సి.ఆర్ కలర్ టీవీ మీ అక్కతో పంపిస్తేమంచిది. వారం వారం ఉచితంగా రామకోవెలలో వీడియో సినిమాలు ప్రదర్శించితే మంచిదనుకుంటున్నాను. తెలుగు సినిమా కేసెట్లు మన దగ్గరున్నవికాక మరికొన్ని కొని పంపించు. పదిరోజుల్లో వస్తున్నాను. రెండుమూడు రోజులకన్నా వుండను.

అమ్మకీ, మామయ్యకి మీ అమ్మకి సమస్కారములు తెలియజెయ్యవలయును

సురేఖతో నేను వస్తున్నట్టు చెప్పు- వ్యాపార విశేషాలతో వెంటనే సమాధానం రాయి.

బావ

మురళి"

ఉత్తరం రాసిన కాగితం మడతపెట్టి కవరులో పెట్టాడు. శ్రీధర్ కవర్లూ, ఇన్‌లేండు లెటర్లూ సూట్‌కేసులో పెట్టడం మంచిదయిందనుకున్నాడు. ఎడ్రసు రాసి టేబుల్ మీద పెట్టాడు.

మురళికి వాళ్ళ నాన్న జ్ఞాపకం వచ్చాడు. ఆయన వాడిన టేబుల్, కుర్చీలనే అమ్మ ఈ పెంకుటింటికి తరలించింది. అదే కుర్చీమీద కూర్చుని రాసుకునేవాడు. కాకపోతే అప్పుడు టేబుల్ మీద లాంతరు వుండేది. ఇప్పుడు టేబుల్ లేంప్ వచ్చింది. తండ్రి తలంపుకి ఒళ్ళు పులకించింది. ఆయన అడుగుజాడల్లోనే తనూ నడవబోతున్నాడు. ఆయన ఆశీర్వాదాలు తనకి తప్పకుండా వుంటాయి అనుకుని లైటు ఆర్పి మంచంమీద మేనువాల్చి నిశ్చింతగా నిద్రపోయాడు.

* * *

ఉలిక్కిపడి లేచాడు మురళి.

ఒళ్ళంతా చెమటతో తడిసివుంది. మంచంమీదనుంచి లేచి లైటువేశాడు. ఎంత చిత్రమైన కల. ఎంత భయంకరమైన కల.

గ్లాసెడునీళ్ళు కుండలోనుంచి తీసుకుని తాగాడు. కాస్త ప్రాణం కుదుటపడింది.

ఎందుకిలాంటి కల వచ్చింది.

స్మశానంలో తండ్రి చావుని గురించి తనకి అనుమానాలున్నాయి. అవి మెల్లగా కూపీలాగాలనే ప్రయత్నంలోనేవున్నాడు. ఇంతలో ఇలాంటి కల. మనస్సులోని భావాలకనుగుణ్యంగా కలలొస్తాయా?

మురళి శాస్త్రీయ దృక్పథం ఎక్కువగా వున్న మనిషి. మనోభావాలకనుగుణ్యమైన కల వచ్చివుంటుందని సరిపెట్టుకున్నాడు. ఏదయినా పరిశోధన మాత్రం మానదలచుకోలేదు.

'నీ కొడుకుని అనిపించుకుంటాను నాన్నా! నీ పేరు ఊళ్ళో నిలబెడతాను. చిన్నాన్న తన కళ్ళు తనే పొడుచుకునేలాగ చేస్తాను. నీకు నమ్మకద్రోహం తలపెట్టిన వీడి అంతు చూస్తాను. ఈ శపథం అమ్మదగ్గర చేశాను. సాధించి తీరతాను' అని మనస్సులోనే అనుకున్నాడు.

గడియారం చూస్తే వేకువజామున నాలుగు గంటల ముప్పైమూడు నిముషాలయింది. తను మామూలుగా రోజూ మేలుకునే సమయమే.

హైదరాబాదులో మురళి తను కట్టించిన ఇంటి డాబామీద ఎక్సర్‌సైజులు చెయ్యడానికి అనువుగా అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. బట్టలు ఆరబెట్టుకోవడానికి కట్టుకున్న తాడులాగ పది అడుగుల ఎత్తున ఒక గజం అడ్డంగా పిట్టగోడమీద నుంచి బిగింపించాడు. ఆ గజానికి బంతి లాంటి బరువైన మూట ఆరడుగుల ఎత్తున వేలాడుతూ వుంటుంది. అన్ని ఎక్సర్‌సైజులూ, ఆసనాలూ చేసిన తరవాత గాలిలో ఎగిరి తన్నుతూ వుంటాడు.

బాడీబిల్డర్స్ కండరాలను అందంగా పెంచడానికి ఉపయోగించేవేవీ కరాటే ఎక్సర్‌సైజులకి అవసరంలేదు.

17వ శతాబ్దంలో ఓకినావా ద్వీపాన్ని చైనాచక్రవర్తులు ఆక్రమించుకుని అక్కడి ప్రజలు తిరుగుబాటు చెయ్యకుండా వారిని నిరాయుధుల్ని చేశారు. అప్పుడు ఆ ద్వీపంలోని ప్రజలు కరాటేని కనిపెట్టారని చరిత్రకారులు చెబుతున్నారు. 'కరా' అంటే ఏమీలేని, 'టే' అంటే హస్తాలు అని అర్థం చెబుతారు. అనగా కరాటే నేర్చుకున్నవారికి రిక్తహస్తాలతోనే శత్రువుని ప్రతిఘటించి ఆత్మరక్షణ చేసుకోగల లాఘవం అబ్బుతుందన్నమాట.

తరవాత ఆ విద్య ఓకినావా ద్వీపంనుంచి జపాన్ చేరింది. తరవాతి శతాబ్దాలలో జపాన్ ఆ కళని అభివృద్ధి చేసింది. బౌద్ధమత ధర్మానికి కూడా అది సరిపోయింది. బౌద్ధమత ధర్మం ప్రకారం కర్రా, కత్తి, తుపాకులూవంటి మారణాయుధాలు మనిషికి దూరంగా వుండాలి. అందుచేతనే సత్యాగ్రహాన్ని ప్రదర్శించడానికి అనువైన కెండో, అకిడో, జూడో వంటి ప్రాణభయంలేని యుద్ధప్రక్రియలు వారు అభివృద్ధి చేశారు.

స్త్రీల మానరక్షణకి కరాటే నేర్చుకోవడం అవసరం. అలాగైతే ఏ స్త్రీపై వాళ్ళ అభిమతానికి వ్యతిరేకంగా ఏ పురుషుడూ ఎలాంటి అత్యాచారం చెయ్యలేడు.

ట్రైనింగు సమయంలో గురువులు ఎంతో రెచ్చగొడతారు. గట్టి దెబ్బలు కొట్టి శరీరాన్ని గట్టిపరుస్తారు. అవన్నీ భరించాలి. సహనం ఎంతో అవసరం. కొన్ని కరాటే స్కూళ్ళలో పెంకులనీ, కర్రలనీ శరీర భాగాలతో విరగకొట్టడం లాంటివి నేర్పుతారు. అవి కరాటేలో అసాధారణ చర్యలు. టెలివిజన్‌లూ, సినిమాలూ వచ్చి ప్రేక్షకుల వినోదం కోసం అవన్నీ చేయిస్తారు.

కరాటే స్కూలులో చేరినప్పుడే "నేను కరాటే-డోని నా ఆత్మరక్షణకోసమే నేర్చుకుంటున్నాను. శత్రువు మీద పడినప్పుడూ, అన్యాయానికి మరో ప్రాణి బలయిపోతున్నప్పుడూ మాత్రమే కరాటేని వాడుకుంటాను" అని మురళి అందరిలాగే శపథం ఫారంమీద సంతకం చేశాడు.

వాకిలిలోనే ఆసనాలూ, ఎక్సర్‌సైజులూ పూర్తిచేశాడు. గంటలో ఎక్సర్‌సైజులన్నీ పూర్తయ్యాయి. కాస్త చలిగానే వుంది. బనియన్, అండర్‌వేర్ లోనే వున్నాడు. పక్కనే పడున్న లుంగీ కట్టుకుని షర్టు తొడుక్కుని టవల్ భుజం మీద వేసుకుని పొలంవేపు బయలుదేరాడు.

తోపలో గెడ్డ పారుతుంది. వడి తగ్గి తేటతేరి స్వచ్ఛంగా పారుతుంది. ఆ నీటిని చూడగానే అక్కడే నిత్యకృత్యాలు తీర్చు

 

కోవాలనుకున్నాడు. బ్రష్, పేస్టు తెచ్చుకో లేదు. పుల్లతో పళ్ళు తోముకుని ఎన్నాళ్ళయిందో. వేపచెట్టు పుల్ల విరిచి పళ్ళు తోముకున్నాడు. ముఖం కడుక్కుని స్నానం పూర్తిచేశాడు.

తర్వాత ఇంటి ముఖం పట్టాడు. అప్పటికి సూర్యోదయం అయింది. పొలాలలోని స్వచ్ఛమైన ప్రాణవాయువు పీల్చడం వలన ఎంతో హాయి అనిపించింది. వూరికి తూర్పున ఓ చెరువువుంది. అటు వెళ్ళితే ఈదడానికి బాగుండేది. మురళికి చిన్నప్పటినుంచీ ఈదడం సరదా. ఆ మరునాటినుంచీ ఉదయమే సరాసరి చెరువుకే వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు.

ఇల్లు చేరగానే మేనత్త పెరుగేసిన చద్దన్నం పెట్టింది. ఆవకాయ నంచుకుని తినేశాడు. బట్టలు వేసుకుని మరిచిపోకుండా రాత్రి రాసిన ఉత్తరాన్ని పట్టుకెళ్ళి పోస్టు డబ్బాలో వేశాడు.

* * *

వారం తిరక్కముందే మురళికి చాలా మంది స్నేహితులు ఏర్పడిపోయారు. రేడియోలు రిపేరు చెయ్యడం వచ్చునని తెలిసి పాడైపోయిన ట్రాన్సిస్టర్లు, రేడియోలు తెచ్చి రిపేరు చేసిపెట్టమని చాలా మంది అడిగారు మురళిని.

మీటర్, సోల్డరింగ్ ఐరన్, టూల్సు ముఖ్యమైన కాంపోనెంట్సు తెచ్చుకోసందుకు ఇబ్బందిపడ్డాడు. షాపు పెట్టిన ఏడాది రెండేళ్ళదాకా గారంటీ పీరియడ్స్‌లో రిపేరుకి వచ్చిన సెట్లని తనే రిపేరు చేసేవాడు. టెలివిజన్ డీలర్‌షిప్ తీసుకుని వ్యాపారం పెరిగిన తరువాత ఒక సర్వీసింగు ఇంజనీరుని అపాయింట్ చేశాడు. సర్వీసింగ్ సెక్షన్ విడిగా తెరిచాడు.

సురేశ్‌ని తీసుకురావడానికి వెళ్ళినప్పుడు అన్ని పరికరాలూ తేవడానికి నిశ్చయించుకున్నాడు.

మురళి జేబులో పెన్‌తోబాటు నియోన్ ఫేస్ ఇండికేటర్‌వున్న స్క్రూడ్రైవర్ కూడా ఎప్పుడూ వుంటుంది. పవర్ సప్లయిలో ఫాల్టువున్న సెట్లనీ ఎలిమెంటు, దోషాలున్న సెట్లనీ ఎలాగో రిపేరు చేశాడు. దాంతో చెడిపోయిన రేడియోలూ, ట్రాన్సిస్టర్లూ పట్టుకుని ఇంటి చుట్టూ మూగసాగారు చాలామంది.

"రిపేరు చేసే సామానులేదు. తెచ్చిన తరవాత చేస్తాను" అని చెప్పాడు.

"సత్యారావు దగ్గరున్నాయండీ" అని చాలామంది చెప్పారు.

సత్యారావుని కలుసుకుని వివరాలు తెలుసుకున్నాడు. ఏ షాపులోనూ రేడియో మెకానిక్ దగ్గరా నేర్చుకోలేదని స్వంతంగా నేర్చుకున్నానని గొప్పగా చెప్పుకున్నాడు ఆ సత్యారావు. అతని ట్రాన్సిస్టరు చెడిపోతే తెగిపోయిన వైర్లు అటూ ఇటూ అతికి పలికించాడట. ఇంక పెద్ద మెకానిక్ అయిపోయాడు.

వూళ్ళో పంపుసెట్ మెకానిక్‌లూ, మోటారు ఆర్మేచర్ వైండింగ్ చేసేవాళ్ళు, మోటారుసైకిల్ మెకానిక్‌లూ - అందరూ అలాగే తయారయ్యారు.

మెకానికల్ ఇంజనీరింగ్‌లో చూసి కొంతైనా గ్రహించవచ్చును. కాని ఎలక్ట్రానిక్స్‌లో అలాగ కుదరదు. కొంతైనా ట్రాన్సిస్టర్ థీరీ, వాల్వు థీరీ, బేసిక కనెక్షన్లు తెలిసివుండాలి. ఊళ్ళో అన్ని ట్రాన్సిస్టర్లు చెడిపోవడానికి కారణం అసలు ఫాల్టు తెలుసుకోకుండా స్క్రూడ్రైవర్‌తో కెలికి విప్పి, చెడగొట్టటమే.



కొన్ని ఫండమెంటల్స్ చెప్పి సత్యారావుని మంచి మెకానిక్‌గా తీర్చిదిద్దితే తనమీద దాడి తగ్గుతుందనుకున్నాడు.

కాని, తాను వచ్చిన అసలు పని వేరు.

ఇవన్నీ ప్రతిబంధకాలుగానే కనిపిస్తున్నాయి. కాని తన పలుకుబడి పెంచుకోవడానికి తనకి తెలిసిన ప్రతి కళనీ వినియోగించుకోవాలనుకున్నాడు మురళి.

ఉదయం వేళ వ్యాయామశాల, కరాటే ట్రయినింగ్ సెంటరు.

సాయంత్రంవేళ వయోజన విద్య. సురేఖ మహిళా విభాగాన్ని నిర్వహిస్తుంది.

రామకోవెలలో వారానికో వీడియో సినిమా ప్రదర్శన! మురళి ముందుగా వేసుకున్న పథకాలు ఇవి!

ఒకరోజు మధ్యాహ్నం పోస్టుమన్ మురళికి ఓ ఉత్తరం ఇచ్చాడు. అది శ్రీధర్ రాసిన ఉత్తరం.

"బావకి శ్రీధర్ నమస్కరించి రాయునది. నీ ఉత్తరం చదువుకుని అందరం సంతోషించాము. మన వి.సి.ఆర్, కలర్ టి.వి. మీ కోసం సిద్ధంగా వుంచాము. ఓ పది సినిమా కేసెట్లు తెలుగు సినిమాలవి సంపాదించి రెడీగా ఉంచాను.

ఇక మన వ్యాపార విషయం! నువ్వు పరిచయం చేసిన పాత కస్టమర్ల ద్వారా వచ్చినవారికి తప్ప క్రెడిట్‌లో ఎవ్వరికీ ఏ వస్తువూ అమ్మడంలేదు. కేష్‌కే అమ్ముతున్నాను. అమ్మకాలు బాగానేవున్నాయి.

పోయిన నెల బాకీ చెల్లించని బాకీదారులందరికీ రిమైండర్స్ పోస్టు చేయించాను. ఓ పదివేలదాకా అదనంగా వసూలైంది. పెద్దమొత్తాలు బాకీ వుండి రెగ్యులర్‌గా పేచెయ్యనివాళ్ళ ఇళ్ళకి స్కూటర్లమీద రేపు ఆదివారం తిరగాలనుకుంటున్నాము. నువ్వు వస్తే కొన్ని డౌట్స్ క్లియరు చేసుకోవాలి.

అత్త నీ గురించి రోజూ దిగులుపడుతోంది. అక్క సామాన్లన్నీ సర్దుకుని నీ రాకకోసం ఎదురుచూస్తోంది. ఉత్తరం అందగానే బయలుదేరి రావలయును. నీ ముఖస్థంగా మీ ఊరి విశేషాలు వినాలని వుంది.

ఇట్లు
శ్రీధరరావు"

ఉత్తరం చదివి నవ్వుకున్నాడు మురళి. వ్యాపారం అన్న తరువాత క్రెడిట్‌లో అమ్మకతప్పదు. కేష్ బిజినెస్ మాత్రమేచేస్తే ఇంత పైకివచ్చేవాడా తను? శ్రీధర్ అంత రిస్కు తీసుకునే రకం కాదు. ఎలాగో చేసుకోనీ, వ్యాపారంమీద సంపాదన మీద తనకిక ఏవగింపు కలిగింది. వ్యాపారంలో ఇరుక్కుపోయిన వాడు శ్లేష్మంలోపడ్డ ఈగలాగ మరి బయటపడలేడు. తానింక దాని జోలికి పోదలచుకోలేదు. నికరాదాయంలో సగం వాటా తనకి వస్తేచాలు. సగం నడిపినందుకు శ్రీధర్ తీసుకుంటాడు. అలాగే పార్టనర్‌షిప్ డీడ్ రాయించాలి అనుకున్నాడు.




మురళి సురేఖని తీసుకువచ్చేశాడు. ప్రసాద్ భార్యసుశీల వచ్చి ఇల్లు సర్దడంలో

సాయంచేసింది.

సురేఖ ఉన్న రెండు గదులనూ చక్కగా సర్దింది. అత్త చెప్పినవన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఊరు విడిచి పెట్టి నప్పుడు ఇల్లు కూడా అమ్ముకునిపోదాం అనుకున్నదట. కాని పూర్తిగా ఊరితో సంబంధాలు తెగిపోతాయని మానేసింది. ఎవరిపంచనో తలదాచుకుంటున్న ఆడబిడ్డ మహాలక్ష్మికి ఇల్లు అప్పగించి వెళ్ళి పోయారు.

ఇత్తడిసామాను సర్దుకోవడానికి చెయ్యెత్తున గోడకి పాతపద్ధతిలో ఓ బల్ల, రెండు గదుల్లోనూ రెండు గోడ బీరువాలూ, సొరుగులున్న ఓ టేబులూ, ఓ పాతరకం కర్ర కుర్చీ, అన్నీ అలాగే వున్నాయి. ఈ ఇల్లూ ఆ పెద్ద ఇల్లూ మామగారుకట్టించినవే. మామగారిని తను చూడలేదు. అత్త రోజూ దేవుడిలాగ పూజ చేసుకునే ఫొటోని మాత్రమే చూసింది.

బావ ఈ పల్లెటూరు ఎందుకు వచ్చిందీ తనకు బాగా తెలుసును. తన శాయ శక్తులా మురళికి సాయపడటానికే నిశ్చ యించుకుంది.

బెడ్‌రూమ్‌లో ఎత్తైన పందిరిమంచం వుంది. దానిమీద పరుపు, దుప్పట్లు బాగా మాసివున్నాయి.

మురళితో, "పరుపూ, తలగడలూ మార్చాలండీ" అని చెప్పింది.

అంతే! సాయంత్రానికే యూఫోమ్ పరుపూ, తలగడలూ తెప్పించాడు.

"ఇంకా మన ఇంటికి ఏమేంకావాలో చెప్పు...కొందాం" అని ప్రోత్సహించాడు.

అప్పటికే సున్నాలూ, రంగులు వెయ్యడాలూ అన్నీ అయిపోయాయి.

"ఓ స్కూటర్ అవసరం వుంటుం దనుకుంటా" అని చెప్పింది.

"నిజమేసుమీ! పల్లెటూరిలో వున్నా పట్టణాలు అందుబాటులో వుండటానికి ఓ స్కూటర్ అవసరమే. రేపే శ్రీధర్‌కి రాస్తాను. నా స్కూటర్ అక్కడ వృధాగానేపడివుంది. దాన్ని పంపుతాడు"

"ఎన్నివున్నా పర్మనెంటుగా ఈ పల్లెటూళ్ళోవుండిపోగలమంటారా?" అంది సురేఖ భయంగా.

"ఏం...ఎందుకుండలేమూ? జీవితంలో అన్నీ అలవాట్లే. ఇంతకాలం పట్టణ జీవితానికి అలవాటుపడ్డాం. ఇప్పుడు పల్లె జీవితానికి అలవాటుపడాలి. కొన్నిరోజులు ఇబ్బందిగావున్నా తరవాత పట్టణాలన్నా ఆ శబ్దాలు, గోల అన్నా అసహ్యించు కుంటాం" అని చెప్పాడు.

"అలాగ ఎందుకని అలవాటు పడిపోవాలండీ? కావాలనుకుంటే పట్టణం వెళ్ళలేమా? అనకాపల్లి వెళ్ళాలనుకుంటే అర్ధగంట, వైజాగ్‌పోవాలనుకుంటే గంట. హైదరాబాదు పనుంటే గోదావరిలో సాయంత్రం కూర్చుంటే తెల్లవారేసరికి దిగిపోతాం. అంతే! మళ్ళీ వెనక్కి పచ్చెయ్యవచ్చు. మనల్నెవరైనా కట్టి పడేశారా?" అంది సమస్యని పరిష్క రించినదానిలా.

"అదీ...అలాగుండాలి. నాకన్నా నీవే ఓ అడుగు ముందున్నావు. నీ గురించే నేను బాధపడుతున్నాను సురేఖా!నువ్వేమో హైదరాబాదు పట్టణంలో పుట్టి పెరిగావు. ఇదేమో పల్లెటూరు. నాకేమో జీవిత ధ్యేయం ఇదే" అన్నాడు.

"అలా అనకండి..మన జీవితధ్యేయం అనండి. అత్తయ్య నోట ఆమె పడిన కష్టాలు విన్న తరవాత వీడి అంతు తేల్చాలని నేనూ నిశ్చయించుకున్నాను. భర్త అనుకున్నవి సాధించడానికి భార్య




పల్లెటూళ్ళకేం ఖర్మ అడవులకైనా వెళ్ళక తప్పదని మీకు తెలియదులాగుంది" అంది నవ్వుకుంటూ.

మురళి సంతృప్తిగా ఊపిరిపీల్చుకున్నాడు. సురేఖ అర్థంచేసుకుంటేచాలు సగం పని అయినట్లే అని సంతృప్తి పడ్డాడు.

* * *

శనివారంనాడు రామకోవెల మండపం జనంతో కిటకిటలాడుతోంది. పల్లెటూరిలో టెలివిజన్ ఎవ్వరూ చూడలేదు. ఏదో పట్టణాలు తిరిగినవారుతప్ప. విశాఖపట్నం దూరదర్శన్ ప్రసారాలు అంతదూరం రావడం లేదు. అందుచేత డబ్బున్నవాళ్ళు కూడా కొనుక్కోలేదు.

కోవెల ముందు వరండాలో వీడియో కేసెట్ రికార్డర్ టి.వి కనెక్టుచేసి మురళి సినిమా చూపిస్తున్నాడని ఊరంతా పొక్కింది. అందుకేఅంత జనంమూగారు.

ఆ పూళ్ళోవాళ్ళకి తెలిసిందల్లా నాటకాలూ, వీధిభాగవతాలు, హరికథలూ మాత్రమే. సినిమా చూడాలన్నా ఏ చోడవరమో, అనకాపల్లో పోవాలి. టివిలో సినిమా చూస్తే ఎలాగుంటుందో అనుకున్నారు ఎప్పుడూ చూడనివాళ్ళు.

మొదట జనాన్ని కూర్చోబెట్టి అదుపు చెయ్యడం కష్టమైంది. పిల్లలు మరీ గందరగోళం చేశారు. మురళి మిత్రులందరూ పిల్లలను భయపెట్టి బెదిరించి అదుపు చేశారు.

'లవకుశ' సినిమా వేశాడు. చాలామంది చూసిందే! టి.వి.లో చూడ్డం కొత్త గనక మళ్ళీ ఆసక్తిగా చూశారు. కొంతసేపటికి సద్దుమణిగింది.

పూర్తయ్యాకకొంతమంది ఆశ్చర్యంగా, "కలికాలం..ఊళ్ళోకే సినిమా వచ్చింది'' అనుకుంటూ వెళ్ళారు.

ఎంతోమంది మురళిని అభినందించారు.

కొంతమంది, "ఇలాగే వారం వారం చూపిస్తావా?" అని అడిగారు.

"అందుకనే వీటిని తెప్పించాను. చూపిద్దామనే అనుకుంటున్నాను'' అని చెప్పాడు మురళి.

అయితే "ఎంతోకొంత టిక్కెట్టు పెట్టకపోతే ఈ జనాన్ని అదుపుచెయ్యలేము. పావలో అర్ధో పెట్టకూడదా?" అన్నారు మిత్రులు.

"వద్దు. ఇది వ్యాపారానికి కాదు. మన కోవెలలో శనివారం శనివారం సందడి వుండాలి. నాకదే కావలసింది" అని తిరస్కరించాడు.

భాస్కర్‌కీ, రాఘవయ్యకీ మురళి అలా పేరు తెచ్చుకోవడం ఇష్టంలేదు. భాస్కర్ వీడియో పార్లర్లు నడిపేవాళ్ళని అడిగి రూల్సు తెలుసుకున్నాడు. వాళ్ళేం చెప్పారోగానీ మురళి పనిపట్టాలనుకున్నాడు.

ఆ మరుసటి శనివారం 'భక్త తుకారాం' సినిమా నడుస్తూవుండగా,

మోటారు సైకిళ్ళమీద ఇద్దరు కస్టమ్స్ అధికారులు వచ్చారు.

"ఎవరు దీనిని నడుపుతున్నారు?" అని అడిగారు.

"నేను" అని మురళి వీడియోని ఆఫ్ చేసి వాళ్ళ దగ్గరికి వచ్చాడు.

వి.సి.ఆర్. టి.వి.కి సంబంధించిన పేపర్లు అడిగారు.

అక్కడేవున్న సురేఖ ఇంటికి వెళ్ళి తెచ్చి చూపించింది.

చూసుకున్నారు. అన్నీ భారతదేశంలో తయారైనవే. లైసెన్సు కూడా కట్టారు. అదీగాక ఉచిత ప్రదర్శన.



"క్షమించండి. ఎవరో మాకు కంప్లయింట్ ఇచ్చారు. ఈ ఊళ్లో వీడియో పార్లర్ నడుపుతున్నారని, శనివారంవస్తే ప్రదర్శన నడుస్తూవుండగా పట్టుకోవచ్చునని ఆకాశరామన్న ఉత్తరం రాశారు. మేము అనవసరంగా వచ్చాము. ఎంత ఉచిత ప్రదర్శన అయినా మీరు పోలీసుల అనుమతి పొందడం మంచిది" అని చెప్పాడు అందులో ఒకతను.

ప్రసాద్ "తీసుకున్నామండీ! రాత్రి 12 గంటల తరవాత ఏ షో వెయ్యవద్దనీ, బ్లూ ఫిలింస్ వేస్తే సెట్లు పట్టుకుపోతాం జాగ్రత్త అనీ సబ్ ఇన్స్పెక్టర్ చెప్పారు. ఇలాంటి పల్లెటూళ్లో దేవాలయంలో అలాంటి వెందుకు చూపుతామండీ" అని చెప్పాడు.

వాళ్లు వెళ్ళిపోబోతుంటే మురళి సినిమా చూసి వెళ్ళండి అన్నాడు.

"అబ్బే! అనకాపల్లి పోవాలి. థాంక్స్. సారీ ఫర్ ది డిస్టర్బెన్స్" అనేసి మోటారు సైకిలు స్టార్టుచేసుకుని వెళ్ళిపోయారు.

మురళి ప్రసాద్‌తో "పోలీసు పర్మిషన్ తీసుకున్నామని అబద్ధం ఎందుకు చెప్పావు. అలాగే తీసుకుంటామని చెబితే పోయేదిగా" అన్నాడు.

"నిజంగానే సబ్ ఇన్స్పెక్టరు నాకు కనిపిస్తే చెప్పాను. ప్రదర్శించుకోమని నేను చెప్పినట్లే చెప్పాడు. పోలీసులకి ఇలాంటివి చెప్పడమే మంచిది. వంక లేక పోయినా డొంక పట్టుకునే రకాలు. వంక దొరికితే వాళ్ళతో తిప్పలు. నాకు అతనితో బాగా పరిచయం వుందిలే" అని జరిగిన సంగతి చెప్పాడు.

"గుడ్. మంచిపనిచేశావు" అని మళ్లీ వీడియో ఆన్‌చేశాడు.

సినిమా పూర్తయింది.

ఆ ఆకాశరామన్న ఉత్తరం ఎవరు రాసివుంటారో అందరూ అర్థంచేసుకున్నారు.

అమ్మ పెట్టా పెట్టదు అడుక్కు తినా నివ్వదు అనీ, వాళ్ళకదేంబుద్ధి అనీ చాలా మంది రాఘవయ్యనీ, భాస్కర్‌నీ తిట్టుకున్నారు.

* * *

ఒకరోజు అర్ధరాత్రి సురేఖకి ఎందుకో మెలకువ వచ్చింది. బెడ్‌రూమ్‌లో ఫేన్ తిరుగుతూవుంది. బెడ్‌లైట్ వెలుగుతూ వుంది. మంచంమీద మురళి లేడు. తలుపు దగ్గరికి వేసివుంది.

లైట్ వేసి బయటికి వచ్చి చూసింది. వరండాలో మహలక్ష్మమ్మ మంచంమీద నిద్రపోతోంది.

కొత్తగా కట్టించిన బాత్‌రూమ్‌లో ఎలాంటి అలికిడీలేదు. ఇంత అర్ధరాత్రి ఎక్కడికి వెళ్లివుంటారు అనుకుంది. చాలాసేపు ఎదురుచూసింది. అలారం టైమ్‌పీస్ రెండు గంటలు చూపిస్తోంది. భోజనంచేసి ఎనిమిదిగంటలకే త్వరగా నిద్రపోయారిద్దరూ. మళ్ళీ లేచి వెళ్ళవలసిన అవసరం ఏమొచ్చిందో.

నిద్ర ఎగిరిపోయింది లైటు ఆర్పి మంచంమీద పడుకుని ఆలోచించసాగింది. వేకువజామున నాలుగుగంటలకి కాస్త మగతనిద్ర పట్టబోతూవుండగా మెల్లగా తలుపు తెరుచుకుని మురళి గదిలోకి ప్రవేశించాడు.

"ఎక్కడికి వెళ్లారండీ?" అని అడిగింది.

"ఇప్పుడే అలా బయటికి వెళ్ళాను... నిద్రపో" అన్నాడు.

"ఇప్పుడే ఏమిటండీ...మూడుగంటల నుంచీ మీరేమైపోయారా అని బెంగతో

ఎదురు చూస్తూవుంటే" అంది.

ఇక చెప్పక తప్పదని, "శ్మశానానికి వెళ్లివస్తున్నాను సురేఖా! ఆ దయ్యాల మర్రిచెట్టుకింద రెండు గంటలు కూర్చుని వచ్చాను" అన్నాడు.

సురేఖ భయంగా చూసింది మురళిని!

"మీకేమైనా మతిపోయిందా! అలా అర్ధరాత్రి దాటిన తరవాత స్మశానానికి వెళతారా ఎవరయినా? మీకేమైనా అయితే" అంది భయంగా

మురళి నవ్వుతూ "ఏమైనా జరుగుతుందా అని తెలుసుకోడానికే నేను శ్మశానానికి వెళుతున్నాను. ఇది నేను వచ్చిన తరవాత ఏ పదోమారో. కాని ఏమీ జరగడం లేదు. మరి మా నాన్నగారు ఆరోజు ఎలాగ చనిపోయారో" అన్నాడు.

సురేఖకి విషయం అర్థమైంది. "అమ్మబాబోయ్! దయ్యాలు లేవని ఎంత తెలిస్తే మాత్రం ఇలా వెళ్ళటం మరో ప్రమాదానికి దారితీస్తుంది తెలుసా. ఎవరయినా చూస్తే మీరేదో చేతబడినేర్చుకుంటున్నారనీ అందుకే అర్ధరాత్రిపూట శ్మశానానికి వెళుతున్నారనీ పుట్టిస్తేమంత్రాలు పారకుండా పళ్లు పీకేసి, హైదరాబాదు రైలెక్కిం చేస్తారు" అంది భయంగా.

నిజమే అనుకున్నాడు మురళి. అంత దూరం ఎప్పుడూ ఆలోచించలేదు. తన పరిశోధన ఒకరకంగా పూర్తయినట్లే. బూడిద తప్ప అక్కడ మరేదీ లేదనే నిర్ధారణకి వచ్చేశాడు కూడా!

"నిజమే సురేఖా! నేను అంతదూరం ఆలోచించలేదు. శ్మశానంలో నిశ్శబ్దం తప్ప మరేమీ లేదనే నిర్ధారణకి వచ్చాను. ఫాలనేత్రుడు గజ్జకట్టి ఆడే రంగస్థలం కదా... ఆయనయినా కనిపిస్తాడేమో అని ఆశపడ్డాను. ఆశ నిరాశ అయింది. ఇంక ఎవరయినా పందెంకాస్తే తప్ప ఆ మర్రిచెట్టు ముఖం చూడను" అని వాగ్దానం చేస్తున్నట్లు చెప్పాడు.

"చాల్లెండి... ఘనకార్యం చేశారు. భయం వేస్తోంది. నామీద చెయ్యివేసి పడుకోండి" అంది సురేఖ.

మురళి సురేఖని గాఢంగా గుండెలకి హత్తుకున్నాడు. ఇద్దరూ తెల్లవారేదాకా అలా కౌగిలించుకునే పడుకున్నారు.

* * *

మురళి అనుకున్నవన్నీ అనుకున్నట్లే చేస్తున్నాడు.

వ్యాయామశాలకు ఉదయం అయిదు గంటలకల్లా పదిపది హేనుమందియువకులు వస్తున్నారు.

వ్యాయామాలు, ఆసనాలు నేర్చుకుంటున్నారు. కొంతమంది కరాటేకూడా నేర్చుకుంటున్నారు. ఉదయం గ్రూప్ అంతా విద్యార్థులే.

సాయంత్రం వయోజనవిద్య రామకోవెలలోనే పెట్టాడు. పదిమందితో మొదలై ప్రస్తుతం నలభైమందిదాకా తయారయ్యారు. ప్రసాద్, నరసింహం, అప్పారావు టీచర్లుగా పాఠాలు చెప్పడానికి వాలంటీర్ చేశారు. మూడు నాలుగు గ్రూపులుచేసిరోజుకి గంటా రెండుగంటలు చదివిస్తున్నారు.

సురేఖ మహిళావిభాగం మాత్రం ఫెయిలయింది. దాంతో చదువుకుంటున్న పిల్లలకి ఉచితంగా ట్యూషన్లు చెప్పడం మొదలుపెట్టింది.

శ్రీధర్ మురళికి స్కూటర్ పంపించాడు. ఒకరోజు అనకాపల్లినుంచి స్కూటర్ తెచ్చుకొన్నాడు. సురేఖని తీసుకుని వైజాగ్, అనకాపల్లి అప్పుడప్పుడు వెళుతున్నాడు.





అనకాపల్లి వీడియో లైబ్రరీలో డిపాజిట్ కట్టి కొత్త కొత్త కేసెట్లు తెచ్చి సినిమాలు చూపిస్తున్నాడు.

ఆవిధంగా మురళి అంటే విద్యార్థులు, పిల్లలు ప్రాణం ఇచ్చేలాగా తయారయ్యారు.

* * *

జీవితం విచిత్రమైనది. దానిని నిర్వచించడం కష్టం. ఒకో సంఘటన మనిషి జీవితాన్ని మార్చేస్తుంది. మరో సంఘటన బతుకుని మింగేస్తుంది. అన్నీ అనుకూలిస్తే మనిషి మొనగాడు. అనుకున్నవి జరగక ప్రతికూలిస్తే, అదే మనిషి బుద్ధిహీనుడుగానూ, వెధవగానూ పరిగణింపబడతాడు.

మురళి ఓ త్యాగశీలిగా, ధైర్యశాలిగా ఆ పల్లెటూళ్ళో ముద్రపడటానికి ఓ సంఘటన పనిచేసింది. ఆ సందర్భంలో మురళి ప్రవర్తించినతీరు అతనిస్వభావానికి అద్దం పట్టింది. తాను వచ్చినపని, ధ్యేయం-అన్నీ మరిచిపోయి పనిచేశాడు ఆ సమయంలో.

స్కూటర్ వచ్చినదగ్గర్నుంచీ ఏ పని మీద వెళ్ళినా ఒంటరిగా వెళ్ళలేదు. వాళ్ళూ వీళ్ళూ అనిలేకుండా బస్సుకోసం ఆగివున్న ఏ వ్యక్తికో లిఫ్టు ఇవ్వకుండా వెళ్ళలేదు.

ఆరోజు కూడా చోడవరం వెళుతూ సింహాచలం అనే వ్యక్తికి గోవాడ పంచదార ఫాక్టరీదాకా లిఫ్టు ఇచ్చాడు. పని పూర్తిచేసుకుని ఫాక్టరీ గేటు ఎదురుగా నుంచుంటే వెనక్కివెళ్ళేటప్పుడు కూడా తీసుకువెళతానని చెప్పాడు.

ముఖ్యమైన పనులు చూసుకుని కొన్ని పత్రికలు కొనడంలో ఆలస్యమైంది. గోవాడ వచ్చేసరికి చీకటిపడింది.

సింహాచలం రోడ్డుమీద నిలబడే వున్నాడు.

"రా సింహాచలం" అని పిలిచాడు.

సింహాచలం కూర్చోగానే బయలుదేరాడు. వెంకన్నపాలెం జంక్షను దాటి విశాఖపట్నం పోయేరోడ్డు పట్టుకున్నాడు. మరికాస్త ముందుకివెళ్ళి కోడూరు మీదుగా వెళ్ళే కొత్తవలసరోడ్డుకి మలుపు తిప్పాడు. కుడివేపున కొండలు, తూర్పు కనుమలు. కొండపక్కనుంచే మెలికలు తిరిగిపోతూ వుంది రోడ్డు. విశాఖపట్నం జిల్లాలో చాలావరకు తూర్పుకనుమలూ కొండలే. చిన్న చిన్న కొండలు, చిట్టడవులు.

బాగా చీకటిపడింది. స్కూటర్ లైటు వేశాడు. స్కూటర్ వేగంగా పోతోంది. చల్లని కొండగాలి వీస్తూంది.

ఉన్నట్టుండి పెద్దపులి గాండ్రింపు వినిపించింది.

సింహాచలం వెనకనుంచి "మురళీ... పులిరంకె ఇన్నావా?" అన్నాడు భయంగా.

"విన్నాను... ఈ చిట్టడవుల్లో పులులు కూడా తిరుగుతున్నాయా" అన్నాడు.

"శానాకాలంనించి నేవు. ఈమద్దినే ఓ పులి బయల్దేరింది. మొన్ననే సేనిపిల్లిలో ఓ మేక నెత్తుపోయింది" అన్నాడు.

"ఎవరూ చంపెయ్యలేదా?"

"పుల్ని సంపడవే. అమ్మబాబోయ్! స్కూటర్ని తొందరగా పోనియ్యి బాపూ. ఇప్పుడు పులిమాటొచ్చింది. నాకు బయవేత్తుంది" అన్నాడు. సింహాచలం గొంతులో వొణుకు గుర్తించాడు మురళి.

"మన వూరిలో మేకలజోలికి రాలేదు గదా?" అన్నాడు మళ్ళీ.

"ఆ కొండమీది అప్పుడు దయవల్ల ఇంకా అలాటిదేవీ నేదు"

కీచురాళ్ళ రొద, కొండకి దిగువగా ఎడమవేపున దూరంగాచెరకు తోటల్లోనూ వరిపొలాల్లోనూ, మిణుగురు పురుగులు

ఎగురుతూ కనిపిస్తున్నాయి. కుడివేపున చిట్టడవి కొండతుప్పలు మధ్యమధ్య ఏపుగా ఎదిగిన కొండ తంగేడు చెట్లు.

అలాంటి రాత్రివేళ స్కూటర్ చెడిపోతే కష్టమే. పులి అనవసరంగా మనుషులమీదపడదు. ఆ సంగతి తనకి తెలుసును. కాని సింహాచలంలాటి వాళ్ళని నమ్మించడం కష్టం. దానికి తోడు రాక్షసుడిలాగా సాగివస్తున్న బోడి కొండ భయంకరంగా వుంది.

అప్పుడే లోయల్లోని కొండవాగుల్లో నుంచి మరోమారుపులిరంకె వినిపించింది. పులి సర్వసాధారణంగా మేన్ ఈటర్‌గా మారదు.

స్కూటర్ ఊరు వేపుపోయే జంక్షను రోడ్డుని చేరుకుంది. మలుపు తిప్పాడు. ఊరువేపు స్కూటర్ దూసుకుపోయింది.

మరో పదినిమిషాలలో ఊరు చేరుకున్నారు. సింహాచలం స్కూటర్ దిగి మురళి వేపు కృతజ్ఞతాపూర్వకంగాచూసి వాళ్ళ ఇంటికి వెళ్ళిపోయాడు. మురళి ఇల్లు చేరుకున్నాడు. ఆత్రుతగా ఎదురు చూస్తున్న సురేఖ మురళిని చూసి కుదుట పడింది. భోజనంచేసి నిద్రపోయారు.

* * *

పల్లెటూరిలో ఏ వింత జరిగినా దావానలంలాగా క్షణంలో వ్యాపిస్తుంది. మరునాటి ఉదయం మురళి నిద్రలేచేసరికి ఓ వార్త వూరంతా పాకిపోయింది.

నరసింహంవాళ్ళ ఆవుని రాత్రి పులి చంపేసిందిట!

మురళికి వాళ్ళపాక తెలుసును. కొండ వాగుని ఆనుకునే వాళ్ళ పాక. పాక పక్క నుంచే, కొండలమధ్యనుంచి అడ్డదారి పోవడానికి తోవ వుంది. బస్సులు రాక ముందు సింహాచలం కొండకి, వైజాగ్‌కి ఆకొండమీదినుంచే నడిచిపోయేవారుజనం. ఆ ఆవు పాల మీద నరసింహానికి కొంత ఆదాయం వస్తుంది. గబగబా తయారై బట్టలు వేసుకున్నాడు. ముందుగా ప్రసాద్ ఇంటికి వెళ్ళాడు. అప్పటికే ప్రసాద్ వెళ్ళిపోయాడు. మురళి వెళ్ళేసరికి నరసింహం వాళ్ళ పాక దగ్గర చాలామంది జనం పోగయ్యారు.

ప్రసాద్ మురళిని విష్ చేశాడు. అతని ముఖం విచారంగానే వుంది. నరసింహం కూడా మురళిని చూడగానే జనంలోంచి బయటికి వచ్చాడు. ఎవరో ఒకామె ఏడుస్తోంది. సంపాదించే మనిషి పోయినా, లేక ఆర్జించి పెడుతున్న ఆవు పోయినా విచారించక తప్పదు.

"ఎప్పుడు జరిగింది? మొదట ఎవరు చూశారు?" అని నరసింహాన్ని ప్రశ్నించాడు.

"మా నాన్న రోజూ వేకువ జామునే పాలు పిండటానికి వస్తాడు. తెల్లవారేసరికి పాల తపేళాతో ఇల్లు చేరుకుంటాడు. ఈరోజు వచ్చి చూస్తే గుంజకి కట్టిన ఆవు కనిపించలేదుట అప్పటికి ఇంకా చీకటిగా వుందన్నాడు.దాన్ని మా ఇంట్లో లక్ష్మి అని పిలుస్తాం. పేరు పెట్టి పిలిస్తే అది దగ్గరకు కూడా వస్తాది. పిలిచాడుట. అటూ, ఇటూ వెతికి చూశాడట. కనిపించలేదు. తెల్లవారిన తరువాత తెగివున్న మెడకన్నె, రక్తం కారిన జాడ చూసి పులి పనే అనుకున్నాడట. తరువాత పులి అడుగుజాడలు కూడా కనిపించాయి. వెంటనే వచ్చి మాకు చెప్పాడు" అని వివరించాడు.

"నా చిన్నప్పుడు మన ఊరి రాజులు ఇలాంటి ఆవుల్ని తినే పులుల్ని చంపేవారు. ఇప్పుడు చంపడం లేదా?" అని

ప్రసాద్‌ని అడిగాడు.

"ఈమధ్య ఇలాంటి సంఘటనలేమీ జరగలేదు. అయినా మనవూరి రాజులిప్పుడు వేటలవీ మానేశారు'' అన్నాడు.

"నరసింహం...ఓ సంగతి చెప్పడం మరిచిపోయాను. నిన్న నా స్కూటర్‌పై నేనూ, సింహాచలం వస్తుంటే పులి రంకె వినిపించింది. రాత్రి ఎన్ని గంటల దాకా పాకలో వున్నాడు మీ నాన్న" అని మళ్ళీ అడిగాడు.

"ఏవో ముఖ్యమైన పనులుంటే తప్ప రాత్రి ఏడు గంటలు దాటిన తరువాత ఈ కొండ పెడని వుండం. రాత్రి కూడా అలాగే పశువులకు చొప్పా అదీ వేసి ఊళ్ళో కొచ్చేస్తాం. నిన్ననూ అలాగే చేశాం'' అన్నాడు.

నరసింహం వాళ్ళ పాక ఎత్తైన దిబ్బ మీద వుంది. దానికి ఉత్తరంగా కొంత గెడ్డ తూర్పు నుంచి పడమరగా పారుతూ వుంటుంది. ఆ గెడ్డలోకి దిగడానికి రెండు చోట్ల వరకలాంటి తోవ. వర్షాకాలంలో ఎప్పుడూ మోకాలులోతు నీరు ప్రవహిస్తూ వుంటుంది. వర్షం పడేటప్పుడు మోకాటి లోతు దాటితే ఆ వేగానికి కొట్టుకుపోవడం ఖాయం.

శీతాకాలం కావడం చేత నీరు ఎక్కువగా లేదు. చల్లని నీరు గలగలా పారుతూంది. ఆ గెడ్డ దాటితే ఇంక అడవే. పెద్ద పెద్ద చెట్లు. ఆ చెట్లు పొదల మధ్య నుంచి కట్టెలు, పుల్లలు ఏరుకునే వాళ్ళు చేసిన తోవలున్నాయి.

అప్పటికే చాలామంది పులి అడుగు జాడల్ని పట్టుకుని చనిపోయిన ఆవు మిగిలిన అవశేషాలను వెతకడానికి బయలుదేరారు.

మురళి, ప్రసాద్, నరసింహం గెడ్డ దాటుదాం అనుకుంటూ వుండగా జగన్నాథరాజుగారు వచ్చారు. అతని చేతిలో తుపాకి వుంది. ఊళ్ళో ఇద్దరు ముగ్గురు రాజులకి గన్ లైసెన్సు వుంది. వాళ్ళు అప్పుడప్పుడూ వేటకి వెళ్ళి అడవి పందుల్నీ, లేళ్ళనీ వేటాడి తెస్తూవుండే వారు. ప్రభుత్వం అడవి జంతువుల్ని వేటాడటాన్ని నిషేధించగానే ఆ పని మానేశారు.

జగన్నాథరాజుగారు ప్రసాద్‌ని చూసి "ఏవోయ్ నాయుడూ" అని పలకరించారు.

"నమస్కారం రాజుగారూ" అని వినయంగాసమాధానం చెప్పాడు ప్రసాద్.

మురళిని చూపించి "ఈయనేనా హైదరాబాదునుంచి వచ్చింది" అనడిగాడు ఆయనే మళ్ళీ.

"అవునండీ..నేనే'' అని మురళి కలగ చేసుకుని ఆయనకి నమస్కారం చేశాడు. జగన్నాథరాజుకి ఏభై ఏళ్ళకి పైగా నే వుంటాయి.గురిచూసి తుపాకీ పేల్చడంలో దిట్ట అని ఆ చుట్టుపక్కల మంచి పేరు తెచ్చుకొన్నాడు. ఎప్పుడో ఇరవై ఏళ్ళ క్రితం తను చంపిన పులితో తీయించుకున్న ఫొటో కూడా వుంది.

తల సగానికి పైగా నెరిసిపోయినా ముఖంలో కళ మాత్రం తగ్గలేదు. బొద్దుగా పట్టంగా వున్న నల్లని మీసాలు ముఖానికి నిండుదనాన్ని, దర్పాన్ని ఇచ్చాయి. పంచె కట్టుకుని దానిమీద కాషాయ రంగు చొక్కా వేసుకున్నాడు.

"ఎలా జరిగిందోయ్ ఇది" అని మళ్ళీ నరసింహాన్ని అడిగాడు.

ప్రసాద్ నరసింహం చెప్పిన సంగతులు చెప్పాడు.

రాజుగారు అడుగుల గుర్తులు చూసి





అవి పులి అడుగులే అని నిర్ధారణ చేశారు.

"పదండి..మనమూ ఆవుని వెతుకుదాం" అని ముందుకి తోవతీశాడుజగన్నాథరాజు.

గెడ్డదాటారు. అడవిలోకి ప్రవేశించారు. తుపాకీలు పట్టుకుని గురులు చూస్తూ ముందుకి సాగుతూవుంటే వెనకనుంచి ప్రసాద్, నరసింహం, మురళి ఆయన్ని అనుసరించారు.

ఒకచోట నలిగిన పొదలూ, విరిగిన చిన్న చిన్న మొక్కలూ డొంకలూ వారి దృష్టిని ఆకర్షించాయి. అటు తిరిగారు. ఓ యాభై గజాల దూరంలో ఓ డొంకలో ఆవు కనిపించింది. సగానికి పైగానే ఆవుని తినేసింది పులి.

తల, ముందుకాళ్లు, పొట్టభాగం అంతా వుంది. వెనక కాళ్ళ దగ్గర్నుంచి పైకి తినేసింది.

జగన్నాథరాజు బాగా పరిశీలించి, "ఇది పులిపనే. పులి వెనక కాళ్ళనుంచి తలవేపు తింటుంది అదేచిరుతపులి అయితే ముందు కాళ్ళనుంచి వెనకకాళ్ళ వేపు తింటుంది" అని వివరించారు.

మురళి కలగజేసుకుని, "ఈ పులిని మీరెలాగైనా చంపెయ్యాలండీ! లేకపోతే మనవూళ్లో ఇంకా ఎన్ని ఆవుల్ని, మేకల్ని తినేస్తుందో" అన్నాడు.

రాజుగారు "ఈ వయసులో ఇంకా ఏం పులుల్ని వేటాడగలనోయ్! మీలాంటి కుర్రవాళ్ళు చేయవలసిన పని. మావాళ్ళ కెవళ్లకీ ఆ సరదా అబ్బలేదు" అని తన చిన్ననాటి అనుభవాలెన్నో చెప్పారు.

"మరి ఇప్పుడేం చెయ్యాలంటారు?"

జగన్నాథరాజుగారు పరిసరాలను గమనించారు. ఆ డొంకల పక్కనే ఓ మర్రి చెట్టు వుంది. దానికి పలవలున్నాయి.

"అదుగో ఆ మర్రిచెట్టు పలవల్లో మంచె వేసుకుని రాత్రంతా కాపలా కాయాలి. ఒకవేళ మిగిలివున్న ఈ ఆవు మాంసాన్ని పులి మళ్ళీ తినడానికి వస్తే చెట్టుమీదినుంచి తుపాకితో కాల్చెయ్య వచ్చును. కదలకుండా మెదలకుండా ఊపిరి బిగబట్టుకుని తెల్లవార్లూ జాగారం చెయ్యడానికి ఎంతో నేర్పు కావాలి. అంత శ్రమ తీసుకుని రాత్రంతా మంచెమీద కాపున్నా ఒకోమారు పులి చంపిన ఆహారం దగ్గరకి మళ్ళీ రాదు" అని వివరించారు.

ఎలాగైనా మాటువేసి ఆ పులిని చంపాలని మురళికి అనిపించింది.

"నేను మీకు తోడుగా వుంటాను. ఎలాగైనాసరే ఈ పులిని మాత్రం మనం చంపాలండీ" అని బతిమాలినట్లు అన్నాడు మురళి.

"నీకు తుపాకి కాల్చడం వచ్చునటోయ్" అని మురళినుద్దేశించి అన్నారు.

"వచ్చునండీ! నేను యన్. సి. సి. కాడెట్‌ని. చాలా కాంపులకి వెళ్ళాను. నా గురి తప్పేదికాదు. అన్ని బుల్స్ కొట్టే వాణ్ని. 'నువ్వు మార్క్స్‌మాన్‌కి పనికి వస్తావు' అనేవాడు మా ఇన్‌స్ట్రక్టర్"

"మార్క్స్‌మాన్ అంటే?"

"గురి తప్పనివాడు. అతడి కంటి చూపు బాగావుంటుంది. తుపాకిలో దోషం వుంటేనే అతని గురి తప్పుతుంది. ఒకోమారు ఒకో తుపాకితో అందరు సిపాయిలూ గురి తప్పుతారు. అలాంటి తుపాకిని మార్క్స్‌మాన్‌కి ఇస్తారు. ఒక్కసారి మార్క్స్‌మాన్ తుపాకితో షూట్ చేయిస్తారు. ఎంతలో బుల్ మార్కుని తప్పాడో చూసి తుపాకినే సరిచేస్తారు" అని వివరించాడు.

"అలాగా! అయితే నా తుపాకి సరిగ్గా

వుందో లేదో చూడవోయ్" అని తుపాకిని మురళికి ఇచ్చారు. రెండు గుళ్లు తీసి ఇచ్చాడు.

"పదండి ముందుకి...ఏపిట్టో పిచ్చుకో కనిపించకపోదు" అని మళ్ళీ అతనే చెప్పారు.

"క్షమించండి. నేను పిట్టల్ని చంపను. మనకి హాని చేస్తున్నది గనక పులిని కాల్చెయ్యమంటే కాల్చేస్తాను. మీతుపాకిని పరీక్షిస్తానులెండి" అని రాజుగారితో చెప్పాడు.

ప్రసాద్‌తో దూరంగా ఓ చెట్టు బోదె మీద గుండ్రంగా మార్క్ గియ్యమన్నాడు.

ప్రసాద్ జేబులోనుంచి ఓ కాగితం తీసి అరిచెయ్యంత ముక్కని గుండ్రంగా చించి మర్రి పాలు అంటించి ఓ ర్రిమ చెట్టు బోదెకి అంటించాడు.

అందరూ వింతగా చూడసాగారు. గుండుని తుపాకిలో బిగించి 50 గజాల దూరం నుంచి గురిచూసి పేల్చాడు. సరిగ్గా కాగితం మధ్యలోనుంచి గుండు చెట్టులోకి దిగిపోయింది. జగన్నాథరాజు ఆశ్చర్యపోయాడు.

"నువ్వు మంచి సూటిగాడివేనోయ్" అన్నారు.

"దీనిలో ఏముందండీ! మీరు దేన్నైనా విసరండి ... గాలిలోనే కిందపడేలోగా కాల్చేస్తాను'' అన్నాడు.

గొప్పలు చెప్పుకుంటున్నాడని రాజుగారు అనుకుంటారేమో అని మురళికి నోరు జారిన తరవాత అనిపించింది.

"సరే...అదీ చూద్దాం. ఇంకో గుండు వుంది గదా బిగించు. ప్రసాద్...నువ్వు పైకి దేన్నైనా విసరవయ్యా" అని రాజుగారు పురమాయించారు.

పక్కనే వున్న ఒక ఎండిపోయిన తాటికాయ కనిపించింది. మురళి తుపాకిని రెడీచేసుకున్నాడు.

ప్రసాద్ ఆ కాయని 'రెడీ' చెప్పి ఆకాశంలోకి బలంగా విసిరాడు.

ఆ కాయతోపాటే తుపాకి గొట్టం పైకిలేచింది. చివరికి వెళ్ళి ఓ క్షణం నెమ్మదైంది. కిందకి పడేముందు 'ఢాం' అని పేల్చాడు. ఆ కాయ విచిత్రంగా మరింత పైకి ఎగిరి ఎటో పడిపోయింది.

ప్రసాద్, నరసింహం అలాంటివి సినిమాలలో చూశారు. అది ట్రిక్ ఫొటోగ్రఫీ, ఎడిటింగ్‌లో ఆ ఎఫెక్టు తీసుకువస్తారు. నిజంగా అలా షూట్ చెయ్యడం, అదీ చెప్పి చెయ్యడం అనేది కలలో కూడా జరగదని అనుకున్నారు.

జగన్నాథరాజుగారికి మతిపోయింది. ఎగిరే పిట్టల్ని తానూ కొట్టేవాడు. కాని గుంపులో గోవిందా అని కొంగల, బారుల్లోకి, ఎగిరే గుంపుల్లోకి పేల్చి ఒకటీ అరా పిట్టల్ని పడగొట్టేవాడు.

మురళి తుపాకినిఇచ్చేస్తూ "మీ తుపాకి ఫస్టుక్లాస్‌గా వుందండి" అని మెచ్చుకున్నాడు.

అంతలో ముందుగా వెళ్ళినవాళ్ళు ఆవు జాడ తెలియడంలేదని వెనక్కి వచ్చారు. వాళ్ళకి డొంకల్లోవున్న ఆవుని చూపించారు.

"మీరు దానిని ముట్టుకోవడంగాని, కదపడంగాని చెయ్యకండి. దూరంనుంచే చూడండి" అని వారించాడు మురళి.

రాత్రి కాపుకాసి పులిని చంపే ఉద్దేశం మురళికి వున్నట్లు జగన్నాథ రాజుగారు అర్థం చేసుకున్నారు.

"అయితే రాత్రి మంచెమీద కాపలా కాసేధైర్యమూ, ఓపికా ఉన్నాయేమిటోయ్





నీకు" అన్నారు జగన్నాథరాజుగారు మురళిని ఉద్దేశించి.

అవునని తల వూపాడు.

"నీ తుపాకి గురి మాత్రం గొప్పగా వుందోయ్! నేను తుపాకి, టార్చిలైటు, గుళ్ళు సప్లైచేస్తాను. నీకు ధైర్యం వుంటే మంచెకట్టించే ఏర్పాట్లు చేద్దాం" అన్నాడు.

"దయచేసి కట్టించండి" అన్నాడు ప్రాధేయపడుతున్నట్టు.

అక్కడున్న వాళ్ళందరూ మర్రిచెట్టు కొమ్మల్లో ఓ మంచె కట్టారు. మురళి సాయంత్రం ఒంటరిగానో, జంటగానో రావడానికి ఏర్పాట్లు జరిగిపోయాయి.

అందరూ ఊరిముఖం పట్టారు.

మురళి పులిని వేటాడటానికి అడవి లోకి రాత్రి వెళ్ళబోతున్నాడని సురేఖకి తెలిసింది.

భోజనం చేస్తున్నప్పుడు ఆ విషయం కదిపింది. "మీరేదో పులివేటకెళతారటగా రాత్రి" అనడిగింది.

"ఆ'' అన్నాడు ఎలాగ తెలిసిందా అనుకుంటూనే!

"మీరు వెళ్ళడానికి వీల్లేదు"

"నీకేం భయంలేదు సురేఖా! తుపాకి పట్టుకుని చెట్టుమీదనుంచి పులిని చంపడం కూడా ఓ గొప్పేనా? నువ్వు వూరుకో"

"అదే...అంత చిన్న పనికి కూడా మీరే అవసరమయ్యేరా? మరొకరెవరో ఏ రాజుగారో వెళతారులెండి. ఇన్నేళ్ళుగా మీరే పులుల్ని వేటాడుతున్నారా! మనం ఈ వూరు రాకపోతే మరొకళ్ళు వెళ్ళేవారే కదా" అని వాదనకి దిగింది.

"నిజమే... ఒకరు లేనంతమాత్రాన ఏ పనులూ ఆగవు. కాని ఇలాంటి అవకాశం దొరకడం నా అదృష్టంగా భావిస్తున్నాను. నువ్వు అన్నం పెట్టు'' అని మరి మాట్లాడ కుండా చేశాడు.

ఇంక ఎన్ని చెప్పినా వినేరకం కాదని ఏదో ఊహించుకుని, "మీకేమైనా అయితే" అంది భయంగా.

"నాకేమీకాదు...జరిగేవి రెండే. ఒకటి నా చేతుల్లో పులి చావడం. లేదా తప్పించు కుని అది పారిపోవడం. నువ్వు భయపడకు" అని కట్ చేశాడు




ఆ సాయంత్రం అయిదుగంటలకి ఓ గుంపు – మురళి, జగన్నాథరాజు, వాళ్ళబ్బాయి విశ్వనాథరాజు, ప్రసాద్, నరసింహంతోబాటు బయలుదేరారు. మంచె కట్టిన మర్రిచెట్టుదగ్గరికి చేరుకున్నారు. డొంకలో ఆవు కళేబరం అలాగే చెక్కు చెదరకుండా వుంది.

మురళి డొంకల్లోకి దూరి మర్రిచెట్టు ఎక్కి మంచెమీద కూర్చున్నాడు. అతనికి తుపాకి, టార్చిలైటు, అతను తెచ్చుకున్న ఫ్లాస్కులో టీ అందించారు. ప్రసాద్ అన్నివేపులనుంచీ మురళిని చూశాడు. ముఖ్యంగా ఆవు పడివున్న డొంకదగ్గర నుండి చూశాడు. కొమ్మలు గుబురుగా వున్నాయి. దాదాపు పదడుగుల ఎత్తున పదిగజాల దూరంలో వున్నాడు... ఫరవా లేదు అనుకుని, "మురళీ! జాగ్రత్త. నిద్ర పోవద్దు. తుపాకి చేతుల్లోనే వుంచుకో ఎలాంటి శబ్దం చెయ్యొద్దు" అని



జాగ్రత్తలు చెప్పారు.

"పరవాలేదు" అని ప్రసాద్‌కి చెప్పి, జగన్నాథరాజుగారితో— "మీరిక వెళ్ళండి. రేపు నేను ఊళ్ళోకి వచ్చేదాకా మీరిటు రావద్దు. దెబ్బ తగిలిన పులి ఏ తుప్పలోనో నక్కి మీదపడినా పడవచ్చును" అని చెప్పాడు.

"నువ్వు ఒక్కడివే వంటరిగా వుండ గలవటోయ్! లేకపోతే మా విస్సుగాడు నీతో మంచెమీద తోడుగా వుంటాడు"

"అబ్బే...అనవసరంలెండి. ఇక్కడ స్థలం కూడా లేదు. ఇద్దరం ఒదిగి కూర్చోవడం మరీ ఇబ్బంది" అనేశాడు.

'జాగ్రత్త...జాగ్రత్త' అని పదిమాట్లు హెచ్చరించి అందరూ వెళ్ళిపోయారు.

అప్పటికే సాయంత్రం ఆరుగంటలు దాటిపోయింది. రానురాను చీకటి ఆవ రించింది.

మురళి తుపాకిని సరియైన పొజిషన్‌లో పెట్టుకున్నాడు. పదిగజాలదూరంలో ఆవు కనిపిస్తోంది. గుండుని లోడ్‌చేసి సిద్ధంగా వుంది తుపాకి. పులి రావడమే తరువాయి అనుకున్నాడు. మంచెమీదినుంచి పులిని చంపడంలో పెద్ద రిస్కు ఏముందో మురళికి అర్థంకాలేదు. ఎక్కడో చెట్టుచాటు

నుంచి వాలిని రాముడు కొట్టినట్లు దొంగ దెబ్బ కొట్టడం అనుకున్నాడు.

కుడివేపున పారుతున్న కొండగెడ్డ. ఆ గెడ్డ ఒడ్డున పెరిగిన చీమచింతచెట్లు వున్నాయి. ఆ చెట్లమీద రెండు గువ్వలు కూర్చున్నాయి. ఆ పక్కనే మరో సీతాఫలంచెట్టుమీద నల్లని వెంట్రింతఎగురుతూ పురుగుల్నిపట్టి మళ్ళీ ఆ కొమ్మమీదనే వాలుతూంది. వెంట్రింతలు క్రూర జంతువుల ఆగమనాన్ని ముందుగానే పసికట్టి అరుపులద్వారా ఇతర జీవులకి తెలియజేస్తాయి.

ఎంత సమర్థుడైన వేటగాడయినా అడవిలోని పక్షులు, జంతువుల అరుపులకి సంబంధించిన జ్ఞానం కూడా వుంటే కొన్ని విషయాలను అర్థం చేసుకోవడం సుళువు. ముందుగానే అవి వార్నింగ్ సిగ్నల్స్ ఇస్తాయని చదివాడు. వెంట్రింత, ఆ గువ్వలు ప్రమాదసంకేతాలు ముందుగానే ఇస్తాయని సంతృప్తిపడ్డాడు.

మంచెమీదనుంచి అన్ని వేపులకీ కలయజూశాడు. మురళికి తన ఉనికిమీద నమ్మకం కలిగింది. 'గంటలకి గంటలు కదలకుండా వుండాలి. ఊపిరితీసుకోవడం కూడా నెమ్మదిగా చెయ్యాలి. ఏమాత్రం కదలిక పసికట్టినా పులి వెనక్కి వెళ్ళిపోవడంగాని, మీదపడటంగాని చేస్తుంది' అని రాజుగారు చెప్పారు.

ఓ గంటకిపైగానే గడిచిపోయింది. గడియారం చూసుకున్నాడు. ఏడున్నర కావస్తోంది. అనువైన భంగిమలోనే కూర్చున్నాడు. బస్సుకోసమో, ఓ మిత్రుడికోసమో ఎదురుచూడ్డానికే ఎంతో ఇబ్బందిగా వుంటుంది. రాత్రంతా ఓ చెట్టు కొమ్మమీద దాదాపు పన్నెండు గంటలు నిర్ధారణగా వస్తుందని చెప్పలేని పులిని గురించి ఎదురుచూడ్డం ఓ థ్రిల్. తన సహనానికి ఓ పరీక్ష. వాళ్లు వెళ్లిన దగ్గర్నుంచీ కదలకుండానే వున్నాడు. పిప్పిమీది కండరాలు, ముడిచివున్న కాళ్లు కదలమని ఎప్పటినుంచో గొడవ మొదలుపెట్టాయి. ఆసనాలు చేసినవాడు కావడంచేత ఊపిరి మెల్లగా వదలడం పీల్చడం సమస్య కాదు.

మెల్లగాకదిలి పొజిషన్ మార్చున్నాడు. చంద్రుడు తూర్పున అప్పటికే కొండల్లో ఉదయించాడు. పున్నమి చంద్రుడు కావడంచేత పరిసరాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఉండీ ఉండీ పక్షుల కలకలం' అప్పుడప్పుడు గుడ్లగూబ అరుపు, ఆగకుండా కీచురాళ్ల రొద వినిపిస్తున్నాయి.

ఆ తూర్పు కనుమల్లో ఆ అడవిలో తనలాగా గడిచిన అనంతకాలంలో ఎంతమంది గడిపారో తెలియదు. కాని అది మానవుడు విచ్చలవిడిగా సంచరించే క్రూరజంతువులనుంచి తనను తాను కాపాడుకుని తన సంతానాన్ని రక్షించుకుంటూ ఎలాగ గుండెలరచేత పట్టుకుని బతికాడో అర్థమైంది. నాగరిక సమాజంలోని వ్యక్తికి ఆ సస్పెన్సు, థ్రిల్ అనుభవించే అవకాశం రావడం కష్టం.

మూడుగంటలు గడిచిపోయింది. పులి వస్తున్న జాడలేవీ కనిపించలేదు. మురళికి అంత భయంలోనూ నిద్ర రాబోయింది. కష్టంమీద ఆపుకున్నాడు. ఫ్లాస్కులో నుంచి మెల్లగా కప్పులో టీ పోసుకుని వేడివేడిది తాగాడు. చల్లని వాతావరణంలో కాస్త ఉపశమనం కలిగింది.

మరో అర్థగంట గడిచిన తరవాత కొండలవేపు దూరంగా అయిదారువందల గజాల దూరంగా "ఊ..ఆ" "ఊ..ఆ" అని పులి గాండ్రింపు వినిపించింది. అంతే!




మొత్తం అడవి మేలుకున్నట్లయింది. ఉలిక్కిపడి జంతువులన్నీ వెన్ను చరుచుకున్నాయి. వనరాజు తన ఆగమనాన్ని తెలియజేశాడు. ఎక్కణ్నుంచో దూరంగా ఓ దుప్పి భయంగా అరిచిన ఆక్రందన... మళ్ళీ నిశ్శబ్దం.

దాదాపు తనకి ఓ అయిదువందలమీటర్ల దూరంలో పులి వున్న సంగతి మురళికి అర్థమయింది.

ఊపిరి బిగపట్టుకుని కూర్చున్నాడు. మెల్లగా తలఎత్తి చూశాడు. ఆవు ఎక్కడి దక్కడే పడివుంది. ఇంక దుర్గంధం మొదలయ్యే ప్రమాదంకూడా వుంది. మరోమారు కదిలి రెండుమూడు గంటలైనా కదలకుండా వుండగలిగేలాగ సర్దుకుని కూర్చున్నాడు.

తిన్నగా చంపిన ఆవు దగ్గరికి వచ్చేస్తే మెల్లగా తక్కుతూ తారుతూ వచ్చినా ఐదు పది నిమిషాలలో వచ్చెయ్యవచ్చునని అనుకున్నాడు.

అనుకున్నంత సేపట్లోనే కుడిగావున్న కొండగెడ్డ ఒడ్డెక్కుతున్నట్లు ఓ రాయి కదిలిన శబ్దం వినిపించింది. కుడివేపు కొండగెడ్డ ఒడ్డు ఎక్కడానికి జంతువులూ, మనుషులూ చేసిన తోవ జ్ఞాపకంవుంది. అటునుంచే వస్తే కుడివేపునుంచి వచ్చి ఆవున్న దొంకలో ప్రవేశిస్తుంది. షూట్ చెయ్యడానికి సుళువుగా వుంటుంది. రానియ్-అనుకుని తుపాకి కుడిచేతిలోకి తీసుకున్నాడు.

అనుకున్నట్టుగానే గువ్వ పిట్టలు రెక్కలు టపటపలాడించాయి. వస్తుందన్నమాట. ఆ పుచ్చపువ్వులాంటి వెన్నెలలో టార్చి లేకుండానే చంపవచ్చును. కాని పులిని తనవేపు చూసి ఓ క్షణం ఆగేలాగ చెయ్యాలంటే టార్చి అవసరం అనుకున్నాడు. టార్చి వెయ్యడానికి మరో వ్యక్తి అవసరమే.

ఎన్నో క్షణాలు గడిచాయి. ప్రతి క్షణం ఉత్కంఠతని పరాకాష్టకి తీసుకుని వెళ్లింది. పులి రాలేదు. పక్షుల శబ్దాలు దూరంనుంచి ఎటో సాగిపోయాయి.

ఎడమవేపుగా గువ్వల రెక్కల చప్పుడు వినిపించింది. తల ఎడమకి తిప్పాడు. తనకి అయిదారు అడుగుల దూరంలో ఓ జంతువు ఊపిరి తీసుకోవడం వినిపించింది. చీమచింతచెట్ల మొదళ్ళ దగ్గరున్న బండరాయి అవతలనుంచి ఓ తోడేలు బయటికి వచ్చింది. అటూ ఇటూ చూసింది. ఏ ప్రమాదం లేదని ఆవుని సమీపించింది.

మురళికి ఒక రకంగా సంతోషం వేసింది. పులికూడా జిత్తులమారి. ఎలాంటి అనుమానం వేసినా తాను చంపిన ఎర దగ్గరికి మళ్లీ రాదు. ఈ తోడేలువల్ల ఎలాంటి ప్రమాదం లేదని పులి గ్రహించడానికి పనికివస్తుంది అనుకుని తుపాకీ మీదనుంచి చెయ్యి తీసాడు. కాస్త ఉత్కంఠత తగ్గింది.

కుడివేపుగా వచ్చిన శబ్దాలు ఏమయ్యాయి. అది పులే అయివుంటుంది. ముందుకి వెళ్లిపోయింది. తనని చూసే అవకాశంలేదు. పులి వినికిడి శక్తి, చూపు గొప్పవేగాని దానికి ఘ్రాణశక్తి అంతగా వుండదు అని ఎక్కడో చదివాడు.

తోడేలు ఆవుని పీక్కుతినసాగింది. ఆ దృశ్యం మురళి కళ్ళకి ఘోరంగా అనిపించింది. భయంభయంగా అటూ ఇటూ ప్రేవులు, ఊపిరితిత్తులు మొదలైన సుళువుగా తినడానికి వీలైనవాటిని గబ

గబా తినసాగింది. దాని దొంగచూపులూ అవీ చూస్తే పరుల సంపాదన దోచుకోవడానికి యజమాని లేనప్పుడు పడ్డ దొంగ వాడిలాగ వుంది. తోడేలు అడవిలో పులులకన్నా ప్రమాదమైనది. పులులు ధైర్యంగా ఎదిగిన జంతువులను వేటాడి తింటాయి. కాని తోడేళ్లు పురిటికందులని కూడా ఈడ్చుకుపోయి తినేస్తాయి. తోడేళ్ళంటే మురళికి అసహ్యం. తుపాకి శబ్దం అయితే పులి మరి ఆ ఛాయలకి రాదని ఊరుకున్నాడేగాని లేకపోతే చంపి పారేసేవాడే.

ఓ అర్ధగంటదాకా తిని ఎవరో వెంట తరుముతున్నట్లు వచ్చిన తోవనే గెడ్డదిగి కొండవేపు పారిపోయింది. దాని ప్రవర్తన చూసి పులిగాని వస్తున్నదేమో అనుకున్నాడు కాని పులి రాలేదు.

తరవాత ఎలాంటి సంఘటనలూ జరగలేదు. అడవి ప్రశాంతంగా నిద్రపోయింది. కాలం ఎరని మింగిన కొండచిలవలాగ మెల్లగా పాకిపోయింది. పులి అరుపు, రాయి కదలడం దగ్గరగా వచ్చిన పులి చేయిజారిపోవడం విచారాన్ని కలిగించింది.

తూరుపు తెల్లవారింది. పక్షులు ఆ చిట్టడవిని తమ మేల్కొలుపు పాటలతో నిద్రలేపాయి.

మంచె దిగాడు.

ఊళ్లో చేరుకున్నాడు. ప్రసాద్, నరసింహం ఎదురొచ్చారు.

"పులి వచ్చిందా?" అని అడిగారు.

లేదన్నట్టు తలవూపి జరిగినదంతా చెప్పాడు. అదే ఓ పెద్ద వింతగా ఊళ్లో అందరూ చెప్పుకున్నారు.

* * *

పులి సంగతి జనం మరిచిపోయారు. మురళి తన నిత్యకృత్యాలలో మునిగిపోయాడు. అతని శిష్యులు కరాటే అదీ బాగానే నేర్చుకున్నారు. ఏ దాడిని ఎలా ఎదుర్కోవాలో అన్నీ నేర్పాడు. వాళ్ళు త్వరగానే నేర్చుకున్నారు. మురళి శిష్యుల మీద ఒంటరిగా దౌర్జన్యానికి దిగడం .కొరివితో తల గోక్కోవడమేనని అందరికీ తెలిసింది.

వయోజన విద్యగూడా బాగానే జరుగుతోంది. రానురాను ఊళ్ళోని హైస్కూలు విద్యార్థులు కూడా అక్కడకి వచ్చి చదువుకుంటున్నారు. వాళ్ళవాళ్ళ డౌట్స్ తీర్చుకుంటున్నారు. కొంతమంది తల్లిదండ్రులు నెలకు అయిదూ పదీ ఇవ్వబోయారు. మురళి తిరస్కరించాడు. ఎంతవద్దన్నా కూరగాయలు, పాలు, బెల్లం, చెరకు ముక్కలు, పళ్ళతో ఇల్లు నిండిపోసాగింది. వాటిని కూడా తిరస్కరిస్తే చిన్నబుచ్చుకుంటారని ఊరుకున్నాడు.

ఆ రోజు శుక్రవారం! ఉదయం పది గంటలౌతోంది. పనిమీద వైజాగ్ వెళ్ళడానికి తయారౌతున్నాడు మురళి. స్కూటర్ బయటికి తీసి శుభ్రంగా తుడుస్తున్నాడు.

అంతలో పోస్టుతీసుకుని ఉత్తరాల చిన్న వచ్చాడు–

"మురళి సార్! మీకు ఉత్తరం వచ్చిందండీ" అంటూ...

చిన్న చదువుకున్న వాళ్ళ దగ్గిర వచ్చీరాని ఇంగ్లీషు మాట్లాడుతూ వుంటాడు. పెద్దగా చదువుకోకపోయినా ఇంగ్లీషు, తెలుగు అడ్రసులు చదవగలడు. అతడు ఇంగ్లీషులో మాట్లాడటానికి ప్రయత్నించినప్పుడు అందరూ "ఇంగ్లండునుంచి ఇంగ్లీషు దొర వచ్చాడు" అని ఎగతాళి చేస్తూవుంటారు.





"థాంక్యూ వెరీమచ్ చిన్నా" అని వుత్తరం తీసుకున్నాడు మురళి.

"ఫ్రమ్. హైదరాబాదు సర్?" అని అడిగాడు చిన్న, హైదరాబాదునుంచా-అనే అర్థంతో.

"ఎస్" అని సమాధానం చెప్పాడు మురళి.

"యూ రీడ్ అండ్ ఐ గో సార్" అని వెళ్ళిపోయాడు చిన్న.

ఎంతమంది ఎగతాళి చేసున్నా అవకాశం దొరికితేచాలు ఇంగ్లీషులోనేమాట్లాడుతున్న అతని దృఢ సంకల్పానికి మనస్సులోనే మెచ్చుకున్నాడు. భావ వ్యక్తీకరణానికే భాష. అతని భావమేమిటో అర్థమయింది. అంతకన్నా ఏంకావాలి. ఈ వ్యాకరణాలన్నీ లేకముందే భాష పుట్టి వుంటుంది అని అర్థం చేసుకోవడం మంచిది. ఎప్పటికైనా క్షుణ్ణంగా ఇంగ్లీషు మాట్లాడగలిగేది ప్రయత్నిస్తున్న ఈ చిన్నే. ఎగతాళి చేస్తున్నవాళ్ళ నోళ్ళు ఎప్పుడూ పెగలవు అనుకున్నాడు.

ఉత్తరం చించాడు. వాళ్ళమ్మ రాసిన ఉత్తరం.

"చిరంజీవి మురళిని,

అమ్మ ఆశీర్వదించి రాయునది

ఇక్కడ మేమందరం క్షేమంగానే ఉన్నాము. మొన్ననే సురేఖ రాసిన ఉత్తరం అందింది. చదివి నేను చాలా భయపడ్డాను. నువ్వూ మీ నాన్నగారిలాగే తయారౌతున్నావేమో అనిపిస్తుంది. చెప్పి ఏ ప్రమాదమూ రాదు బాబూ! మన జాగ్రత్తలో మనం వుండాలి. ఆనాడు మీ నాన్నగారు ఎలాంటి సాహసానికి పూనుకుని ప్రాణాలమీదకి తెచ్చుకున్నారో మరిచిపోయావా? నిన్ను ఊరు పంపించింది పులులనీ, క్రూరజంతువులనీ చంపడానికా? సురేఖ ఆ రాత్రి నిద్రరాక ఎంతో భయపడిందట. ఊళ్ళో నీకన్నా ధైర్యవంతులు చాలామంది వుంటారు. వాళ్ళు అలాంటి పనులు చూసుకుంటారు. నువ్వు వెళ్ళిన పని చూసుకో. మళ్ళీ అలాంటి తెలివితక్కువ పనులు చేసి మా ప్రాణాల మీదకి తేకు. నా వూపిరే నువ్వు అని మరిచిపోకు. సురేఖకి ఆశీర్వాదాలు చెప్పు. వెంటనే సమాధానం రాయి.

ఇట్లు
మీ అమ్మ
అన్నపూర్ణమ్మ"

ఉత్తరం మడిచాడు. సురేఖ అమ్మకి అన్ని సంగతులూ రాస్తుందన్నమాట అనుకున్నాడు. పులి మళ్ళీ జ్ఞాపకం వచ్చింది. అది మళ్ళీ ఈ ఊరి ఛాయలకు రావాలేగాని దానిని చంపకుండా వుంటాడా ఆఫ్టరాల్.. మేకల్నీ, ఆవుల్నీ చంపుకుతిని ఊరికి అపకారం చేస్తున్న ఓ పులిని చంపకపోతే ఊరికింకేమి చెయ్యగలడు?

"సురేఖా" అని పిలిచాడు.

సురేఖ బయటికి రాగానే "ఇదుగో అమ్మ ఉత్తరం రాసింది...చదువు. నేను సాయంత్రానికల్లా వచ్చేస్తాను" అని స్కూటర్ స్టార్టు చేసి వెళ్ళిపోయాడు.

* * *

సాయంత్రం ఏడుగంటలకి వైజాగ్ నుంచి మురళి వచ్చేసరికి ఓ ఘోరమైన వార్త కాచుకునివుంది. ఊరంతా భయభ్రాంతమైపోయివుంది.

"అప్పలనాయుడు అనే 18 సంవత్సరాల యువకుణ్ని పులి చంపేసింది"

స్కూటర్ ఇంటిదగ్గర వదిలేసి మంచినీళ్ళయినా తాగకుండా వివరాలు తెలుసుకోవడానికి వూళ్లోకి బయలుదేరాడు. సురేఖకి ఆ దుర్వార్త తెలుసును. కాళ్ళు,

ముఖం కడుక్కొని భోజనంచేసిన తరవాత చెప్పదాం అనుకుంది. కాని తుఫానులాగ వచ్చి వెళ్లిపోతున్న మురళిని చూసి విషయం ముందే ఎవరో చెప్పారని అర్థం చేసుకుని వూరుకుంది. వివరాలు తెలుసుకున్నా ఫరవాలేదు. కాని ఆ పులిని చంపడానికి మళ్లీ ఎక్కడ బయలుదేరతాడో అని వార్త విన్నదగ్గర్నుంచీ భయపడుతూనేవుంది.

మురళి కోసం ఎదురుచూస్తున్న అతని శిష్యులు, మిత్రులు చుట్టూ మూగారు. అందరూ కన్నయ్య అనే అప్పలనాయుడు తండ్రి దగ్గరికి తీసుకువెళ్లారు. ఇంట్లో అందరూఏడుస్తున్నారు. పిల్లవాడి తల్లిని ఎవ్వరూ ఓదార్చలేక పోతున్నారు. కష్టపడి పొలంపనులు చేసేది ఆ ఇంట్లో అప్పలనాయుడేనట. కన్నయ్య కళ్లు ఉబ్బివున్నాయి.

"ఎలా జరిగింది కన్నయ్యా?" అని అడిగాడు మురళి.

దుఃఖాన్ని దిగమింగుకుని, "సాయంతరం గేదని అడివిలో గడ్డిమేస్తాదని వొదిల్నాంబావూ... రోజూ చీకటి పడకుండానే కల్లానికొచ్చేసేది. ఈరోజేమైందో చీకటణ్నా రానేదు. పాపిస్టోణ్ని నానే గేదని ఎతికి తోలుకురారా అని పంపినాను బాబయ్యా!

అడిలాగెల్లి పోనాడోనేదో దొంగముండ గేద కల్లానికొచ్చేసింది. నా కొడుకుని పులిని బుక్కమని పంపినాను దాలో'' అని ఏడవసాగాడు.

''పులి మీ అబ్బాయిని చంపడం ఎవరు చూశారు. అసలు చనిపోయాడని మీకెలా తెలిసింది?" అని మళ్లీ అడిగాడు మురళి.

"నానెల్ల మనగానే పొద్దుగూకింతరవాత సేతికర్రొట్టుకొని అడివిలోకెల్లాడు. సెలగదేయ ఒద్దంటే అడుగులు సూసుకుంటా, దాన్ని పిలుసుకుంటా బాగా లోపలకెల్లిపోనాడట్ట. తోవలో పుల్లలేరుకునే ఆడోళ్లు సూసినారు. అల్లకి పులిని సూసి ఆడేసిన కేక, తరవాత పులిరంకె ఇనబడ్డాయట బాబూ'' అని మళ్లీ వలవల లాడాడు.

ఒక యువకుడు మెల్లగా, "ఎప్పుడైనా ఇలాగ సాయంత్రంవేళ ఆవులవి అడవిలో తప్పిపోతే నలుగురూ అయిదుగురూ కర్రలుపట్టుకుని వెతకడానికి వెళతారు. మరి ఈ ముసలి ముండాకొడుకు ఒక్కణ్నే ఎలాగ పంపించాడో?" అన్నాడు మురళితో.

అతనిని మాట్లాడవద్దని సంజ్ఞచేశాడు.

"ఇంతవరకూ ఎవరైనా శవాన్ని చూశారా?" అని అడిగాడు మళ్లీ కన్నయ్యని.

''లేదు బావూ! మనుసుల్ని తినే పులి. ఎవులెల్తారు'' అన్నాడు దిగులుగా.

''సరే...మేంవెళ్ళి అడవంతా గాలించి మీ అబ్బాయిని వెతుకుతాము. పులిని చూసివుంటాడు, అరిచివుంటాడు, పులి కూడా గాండ్రించి వుంటుంది. స్పృహ తప్పి వుంటాడు. పులి మనుషుల్ని అనవసరంగా చంపదు... భయపడకండి" అని ఓదార్చాడు మురళి.

తర్వాత అందరూ కలిసి పులిరంకె విన్న ఆడవాళ్ళలో ఒకామెని కలుసుకున్నారు. ఆమె సంగతంతా చెప్పింది.

ఓ ముప్పై మందిదాకా మురళి ఆదేశం మీద కర్రలూ, గొడ్డళ్ళూ, గునపాలూ, లైట్లూ టార్చిలైట్లూ పట్టుకుని బయలుదేరారు.

ఎక్కడినుంచి పులిరంకె ఏ దిక్కుగా





వినిపించిందో చెప్పడానికి ఆమెను రమ్మన్నారు. ఆమె రాలేదు. తోవ మాత్రం అంచనాగా చెప్పింది.

అప్పలనాయుణ్ని ప్రాణాలతో రక్షించగలమనే ఆశ లేకపోయినా కనీసం అతన్ని తినెయ్యగా మిగిలిన అవశేషాలను తీసుకువద్దాం అని అంత రాత్రిలో బయలుదేరారు. కన్నయ్యావాళ్లకుటుంబం వాళ్లంతా శవం అయినా దొరికితే ఒకమారు చూసి అంత్యక్రియలైనా చేసుకుంటాం అని ఏడుస్తున్నారు. అందుకనే బయలుదేరారు.

ఆ ఆడమనిషి చెప్పిన గుర్తులనుబట్టి కొండవాగంబడే నడిచారు. ఆమె చెప్పిన అడ్డంగా పడివున్న తాటిమాను కనిపించింది. ఎత్తయిన బూరుగుచెట్టు, ఆ పక్కనుంచే అడవిలోకి తోవ కనిపించాయి.

వెనక నడిచేవాడికే ప్రమాదం అన్నట్లు అందరూ ముందుముందుకి వెళ్లిపోయారు. అందరికీ వెనక మురళి నడుస్తున్నాడు.

మరో వందగజాలు వెళ్లాక ఆ అడవిలో అప్పలనాయుడి చేతికర్ర, తలపాగ కనిపించాయి.

"ఇదుగో ... కర్రా, తలపాగాను. ఇక్కడే పులి మీదపడి వుంటుంది" ఒకడు చెప్పాడు.

లైట్ల వెలుగులో అందరూ పరికించారు.

మురళి కూడా బాగా పరిశీలించాడు. బహుశా అక్కడినుంచే అప్పలనాయుడు పులిని చూసి వుంటాడు. చూడగానే భయంతో అరిచి లాఠీతో ఎదుర్కొని వుంటాడు. ఆ కోపంతో పులి గాండ్రించి వుంటుంది. లేకపోతే ఏ చప్పుడూ చెయ్యకుండా దొంగదెబ్బతియ్యడమే పులి నైజం.

తలపాగదగ్గరే రక్తపుచుక్కలు రెండు కనిపించాయి. మరే ఇతరమైన సంఘర్షణా జరిగినట్లు లేదు. ఒక్క పంజాదెబ్బతో పడగొట్టి అనువైనస్థలానికి ఈడ్చుకుని పోయివుంటుంది-అనుకున్నారందరూ.

కిరోసిన్ కాళీడబ్బాని కర్రలతో వాయించుకుంటూపరిసరాలనుగాలించారు. పదిగజాల దూరంలో ఒక తుప్పమీద అప్పలనాయుడి పంచె కనిపించింది. మరో యాభై గజాల దూరంలో అదే దిశగా రక్తం కనిపించింది. వెతకగా వెతకగా ఓ కాలూ చెయ్యీ, గుండెకాయ, ఊపిరితిత్తులూ, తినేసిన పక్కటెముకలతో అస్థిపంజరం వుంది. తలకాయ మాత్రం వుంది.

కన్నయ్య ఆ శవాన్ని చూడగానే స్పృహతప్పాడు. కొందరికి వాంతి రాబోయింది.

ఒక ముసలతను, "పూర్తిగా తినేసినా బాగుండిపోను. ఆ శవాన్నిచూస్తే ఏ తల్లి దండ్రులు భరించగలరు" అన్నాడు.

అదే రోజున ఓ గుడ్డలో అప్పలనాయుడి శరీరం తాలూకు అవశేషాలను అతని బంధువులు వాగుపక్కనే వున్న శ్మశానంలో పాతేశారు.

గ్రామ మునసబు అతని చావుని మరణ రిజిస్టరులో ఎక్కించి ప్రమాదమైన చావుగనక పోలీసుస్టేషనుకి రిపోర్టు చేశాడు. పులి మనిషిని చంపిన కేసుగా నమోదయింది.

అందరూ ఇళ్ళు చేరుకున్నారు. మురళి ఆరాత్రి భోజనం చెయ్యలేదు. ఓ గ్లాసెడు పాలుతాగి పడుకున్నాడు. రాత్రంతా అదే దృశ్యం మదిలో మెదలసాగింది. అతని మెదడులో పులిని చంపడానికి పథకాలు

మెదులుతూనే వున్నాయి.

మనిషిని తినడం మరిగితే పులి మరి జంతువుల జోలికిపోదు. మనిషి మాంసం జంతువుల మాంసం కన్నా ఉప్పగా వుండటమే దానికి కారణం అని చదివిన జ్ఞాపకం. అదే నిజమైతే మరికొంతమంది జీవితాలతో ఆ పులి చెలగాటమాడుతుంది. దానిని తక్షణమే చంపెయ్యాలి.

ఆలోచనలతో మురళికి నిద్రపట్టలేదు.



తెల్లవారుజామున కాస్త నిద్రపట్టింది.

* * *

మరునాడు వ్యాయామాల కార్యక్రమం పూర్తవగానే స్నానం కూడా ముగించాడు మురళి. టిఫిను చేస్తూండగా ప్రసాద్ పేపరు తీసుకువచ్చాడు.

ఆ పేపర్లో అరిపాకలోని ఓ ముసలమ్మ పొలం పనిచేసుకుంటూ వస్తూ వుండగా పులి ఎత్తుకపోయిన వార్త వుంది.

అదే పేపర్లో ఓ రాయల్ బెంగాల్



టైగర్ మేన్ ఈటర్‌గా మారినట్లూ, దానిని చంపినందుకు బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వం ఒకరికి బహుమానం ఇచ్చిన వార్త కూడా వుంది.

వాటిని ప్రసాద్ చూపించాడు.

సురేఖ ప్రసాద్‌కి కూడా టిఫిన్

పెట్టింది.

వద్దని వారిస్తూనే శుభ్రంగా తిన్నాడు.

మురళి ఆరిపాక వార్త చదివి, "టన్ని బట్టిచూస్తే ఈ కొండలచుట్టూ వున్న గ్రామాలలో ఈ పులి తిరుగుతుందన్న మాట. ఇంక ఒకడూ అరా పులికి ఆహారం అవుతూనే వుంటారు. వెంటనే దీనిని చంపే ప్రయత్నం చెయ్యాలి. పద జగన్నాథరాజుగారి దగ్గరికి వెళదాం" అని బట్టలు వేసుకుని బయలుదేరాడు.

ఇద్దరూ రాజులవీధికెళ్ళారు.

జగన్నాథరాజుగారు సావిట్లోని గచ్చు అరుగుమీద కూర్చుని వున్నారు.

మురళిని చూసి, "ఏమోయ్ నాయుళ్ళూ...పొద్దున్నే వచ్చారు" అని పలకరించారు.

మురళి పేపరు చదవమని ఇచ్చాడు.

ఆ వార్తలు చదివారు.

రాజవీధిలోకి ఇతర కులస్తులు వెళితే సావిట్లో ఎన్ని కుర్చీలున్నా ఎంత స్థలం ఖాళీగావున్నా కూర్చోమ్మని అనరు. వెళ్ళిన వారు కూడా తమకితాము కూర్చునే ధైర్యం చెయ్యరు.

మురళి చిన్నప్పుడు, స్వరాజ్యం రాకమునుపైతే, రాజులు వీధివెంట పోతున్నా, ఇతర కులస్తులు వాళ్ళ ఇంటి అరుగులమీదకూడా కూర్చునేవాళ్ళు కాదు. లేచి నిలబడేవారు. మర్యాదగా దండం పెట్టేవాళ్లు. కసమదుగ య్యేదాకా నిలబడేవారు. ఇప్పుడదేంలేదు. కుర్రవాళ్ళ 'మీ ఇంటిదగ్గర మీరు రాజులయితే మా ఇంటిదగ్గర మేము రాజులం' అన్నట్లు రాజులు రోడ్లమీదనుంచి ముఖం తప్పించుకుపోతున్నా దర్జాగా కూర్చుని "ఏవండీ రాజుగోర్లూ..పొలంకేటండి" అని నిందిస్తున్నారు. అలాంటి ఎన్నో మార్పులను కాలం తీసుకువచ్చింది. కాలిన దర్పం కూలిన గోడలు మిగిలాయి.

జగన్నాథరాజుగారు, "పదండోయ్... అలా వెళ్ళి కాసేపు కబుర్లు చెప్పుకుందాం" అని సావిట్లోనుంచి లేచారు.

ముగ్గురూ చెరువుగట్టుకి వెళ్ళి స్త్రీలు నీళ్లు మోసుకుపోయే రేవుకి దూరంగా చింతచెట్టు నీడని కూర్చున్నారు.

"చెప్పవోయ్'' అని మురళిని అడిగారు.

"ఆడేనండీ..పులిని గురించే! ఇప్పుడు మనుషుల్ని కూడా తినమరిగింది. దానిని ఎలాగయినా చంపిస్తేనేగాని మన గ్రామ ప్రజలకి మనశ్శాంతి వుండదు. పొలాల్లోకి ఇదివరకటిలాగ వెళ్ళడంలేదు" అన్నాడు.

"ఇప్పుడు పోలీసులదృష్టికి, ప్రభుత్వం దృష్టికి వెళ్ళింది. ఫారెస్టు డిపార్టుమెంటు వాళ్లు చూసుకుంటారు. ఏదో మామూలు పులి అయితే ఫరవాలేదు. మనుషుల్ని తినే పులితో ప్రమాదమే"

"అలాఅని వదిలేస్తే ఇంకా ఎంతమంది ప్రాణాలు బలితీసుకుంటుందో అని నా భయం" అన్నాడు మురళి.

"అయితే ఏం చేద్దామంటావు? పోనీ అడవి అంతా గాలించి చంపుదామన్నా కొండలూ, లోయలూ పదిహేను ఇరవై చదరపు మైళ్లు విస్తరించివుంది. ఏ రోజు ఎక్కడ మాటువేసివుంటుందో ఎవరికి తెలుసును? కీకారణ్యంలో ఎక్కడని వెతుకుతాము చెప్పు" అన్నారు.

"మనసుంటే మార్గం తప్పకుండా వుంటుందండీ! మనం ఒకరోజు మన వూరి అడవంతా పులి అడుగులకోసం గాలిద్దాం. బహుశా ఈ ప్రాంతంలోనే సంచరిస్తున్న దనే నా అనుమానం. అడ్డూరు కొండ లోయల్లో ఎక్కడో దాని గుహ వుండి





వుంటుంది. రాత్రి సమయాలలో తిరుగుతుంది. నీరు తాగడానికయినా కొండవాగులకి వస్తుంది. కొండచెరువులు, నీటిగొయ్యలు గాలించామంటే దాని అడుగుజాడలు కనిపించకమానవు. అక్కడ మంచె వేసుకుని కొన్ని రాత్రులు కాపుకాశామంటే దొరికిపోతుంది. కాల్చిపారేస్తే పీడా విరగడయిపోతుంది అని నా ఉద్దేశం. దేనికైనా మీ ప్రోత్సాహం కావాలి" అని చెప్పాడు.

"చాలా సంతోషమోయ్! నా ప్రోత్సాహం మీ యువకులకి ఎప్పుడూ వుంటుంది. రేపు ఉదయం ఓ పదిహేను ఇరవైమంది యువకులను వెంటేసుకుని అడవంతా తిరుగుదాం. తుపాకులూ, గుళ్ళూ నేను చూసుకుంటాను. కత్తులూ కర్రలూ, మందీ మార్బలం మీ వంతు" అని ప్రసాద్ వేపు చూసి చెప్పారు జగన్నాథరాజుగారు.

"అలాగేనండీ! రేపు ఉదయం ఎనిమిది గంటలకల్లా మీదగ్గరుంటామండీ" అని ప్రసాద్ చెప్పాడు.

ముగ్గురూ చెరువుగట్టు దిగి ఎవరి ఇళ్ళకి వాళ్లు వెళ్ళిపోయారు.

మురళికి మంచి పలుకుబడి ఆ కొద్ది నెలల్లోనే వచ్చేసింది. కరాటే జూడో నేర్పడంచేత ఓ పదిమంది మెరికల్లాంటి యువకులు శిష్యులుగా తయారయ్యారు. ఏం చెప్పినా చెయ్యడానికి వాళ్ళెప్పుడూ సిద్ధమే. మురళి ఉద్దేశాలు చెప్పి వాళ్ళని కూడగట్టడానికి ప్రసాద్ వున్నాడు.

ఆ సాయంత్రమే మరునాడు అడవంతా తిరగడానికి సన్నాహాలు జరిగిపోయాయి.

* * *

ఉదయం ఎనిమిదిగంటలౌతోంది. దాదాపు పదిమంది మురళిస్నేహితులూ, జగన్నాథ రాజుగారు ముందు తోవ తీస్తున్నారు. ఆయనకి ఆ అడవిదారులన్నీ కరతలామలకాలే. దాదీతెన్నూలేని ఆ అడవుల్లో అమావాస్య రాత్రుల్లోకూడా వేట వ్యసనం వల్ల యవ్వనంలో తెగతిరిగారు. విశ్వనాథ రాజు కూడా వాళ్ళ నాన్నని అనుసరించి నడుస్తున్నాడు. ప్రసాద్, నరసింహం, అప్పారావు, జగన్నాథం కర్రలూ, ఈటెలూ పట్టుకున్నారు. మిగతావాళ్ళ చేతుల్లోకూడా మారణాయుధాలున్నాయి. తుపాకి బరువు అని మురళికి ఇచ్చారు జగన్నాథరాజుగారు. తుపాకీ భుజాన వేలాడుతుండగా అందరినీ కవరుచేస్తూ అందరికన్నా వెనక నడుస్తున్నాడు. విశ్వనాథ రాజు దగ్గరా మరో లోడ్‌గన్ వుంది.

కొండవాగుద్వారా చాలా దూరం నడిచారు. గెడ్డకి రెండువేపులా పెద్దా చిన్నా చెట్లున్నాయి.

పక్షులూ, కొన్ని రకాల అడవి కోళ్ళూ కనిపిస్తున్నాయి. తూర్పుకి అభిముఖంగా నడవటం చేత వాళ్ళ ముఖాల మీద ఎండ పడుతూంది. ఇదివరకుఅప్పలనాయుడుని పులి చంపిన ప్రాంతానికి వచ్చారు. ఆడవాళ్ళు భయంతో ఏరుకున్న పుల్లలు, కట్టెలు, వాళ్ళ తట్టలూ అలాగే వదిలిపెట్టి పారిపోయారు. అవన్నీ అలాగే పడి వున్నాయి. ఆసంఘటన జరిగిన తరువాత ఊరి జనం అడవిలోకి అడుగు పెట్టలేదు.

కొండవాగు మీదకి ఒడ్డు మీద నుంచి ఓ అడవి చెట్టు కొమ్మ వాలి వుంది. దాని మీద కొన్ని నీటి పిట్టలు కూర్చుని వున్నాయి. పది రోజులకు పైగా ఎటువంటి జనసంచారం లేక ప్రకృతి ప్రశాంత గంభీరతను కలిగి వుంది.

ముందుకు సాగుతూనే జగన్నాథ రాజుగారు నీరు నిలిచిన ప్రతిచోటా పులి 'పగ' మార్కుల కోసం వెతుకుతూ నడుస్తున్నారు. దాదాపు రెండు మైళ్ళ

దూరం వెళ్ళి వాగు కుడికి తిరిగింది. అది తిరిగిన మలుపు దగ్గిర పెద్ద కొంద కొలను వుంది. నీరు బాగా నిల్వ వుంది. అడవిలోంచి నీరు తాగడానికని అడవి పందులూ మొదలైన అడవి జంతువులు చేసిన తోవలు ఒడ్డు మీద నుంచి వరక ల్లాగా కనిపిస్తున్నాయి. అందరూ అడుగుల కోసం వెతుకుతున్నారు.

ప్రసాద్‌కి పులి అడుగులు తెలియక పోయినా పిల్లి అడుగుల్లాంటి పెద్ద అడుగులు దూరంగా కనిపించాయి. రాజుగారికి చూపించాడు. అందరూ అటు నడిచారు. చాలా పెద్ద అడుగులు.

''పెద్ద పులి అడుగులే...అనుమానం లేదు. రాత్రో లేక నిన్నరాత్రో ఇక్కడికి వచ్చింది" అని నమ్మకంగా చెప్పారు జగన్నాథరాజుగారు.

మురళికి సంతోషం వేసింది. ఇక్కడ ఎన్ని రోజులు కాపలా కాసి అయినా దానిని చంపితీరాలనే నిర్ణయానికి వచ్చాడు.

"అయితే మంచె కట్టడానికి అనువైన స్థలం నిర్ణయించండి. రాత్రికి నేనొక్కడినైనా వచ్చి మంచె మీద కాపలా కాస్తాను" అన్నాడు మురళి.

రాజుగారికి మురళి ధైర్యం ఇదివరకే అర్థమయింది. మంచెకి అనువైన స్థలం కోసం గాలించారు. అక్కడ ఆ కొలనుకి మూడువైపులా గెడ్డ ఒడ్డే. చెట్లు ఏపుగానే వున్నాయి. మంచెకి అనువైన ఎత్తులో గుబురుగా ఏ చెట్టూలేదు. ఒక వేప చెట్టు కొమ్మ రెండు తాటిచెట్ల పక్క నుంచి కొలనుమీదకి సాగివుంది. కాని మంచె కట్టడానికి అనువైన కొమ్మలు లేవు. తాటి చెట్లతో కలిపితే మంచి మంచె తయారుకా వచ్చును అనుకున్నారు.

ఎలాగ కట్టాలో వివరించగానే అందరూ ఆ పని మొదలుపెట్టారు.

తాటి కమ్మలు నరికారు. తడపలు తీశారు. నాలుగు బలమైన కర్రలు నరికి తాటి చెట్లకి, వేపకొమ్మకి కలిపి చక్కని మంచంలాగా తయారుచేశారు. ఓ తలగడా, నాలుగు దుప్పట్లూ తెచ్చుకుంటే హాయిగా నిద్రపోవడానికి వీలుగా వున్నట్లు తయారుచేశారు.

మురళి సంతృప్తిగా "బాగుందండీ! పులి కోసం ఎన్నిరోజులు కాపలా కాయాలో. ఈ మంచె చక్కగా వుంది" అన్నాడు.

ఆ మంచె మీది నుంచి ఏ దిక్కుగా చూసినా పది పదిహేను గజాల దూరంలోపునే నీరు వుంది. అందుచేత ఏ దిశ నుంచి ఏ జంతువు వచ్చినా తల కాయ చితికేలాగ కాల్చెయ్యవచ్చును.

ఆ దే రోజు సాయంత్రం మురళి కాపలా కాయడానికి నిర్ణయం జరిగి పోయింది. ప్రసాద్ కూడా మురళికి తోడుగా వుంటానన్నాడు.




అనుకున్నట్లుగానే సాయంత్రం నాలుగుగంటలకి ఉదయం బయలుదేరిన వాళ్ళందరూ మళ్ళీ అడవిలోకి బయలు దేరారు. మురళికి ఫ్లాస్కునిండా టీ తయారుచేసింది సురేఖ. పెద్ద టార్చిలైటు, జగన్నాథరాజుగారి డబుల్

బేరల్ గన్ పట్టుకున్నాడు.

కొండ చెరువు చేరుకున్నారు.

ప్రసాద్ ముందు మంచె ఎక్కాడు. తరువాత మురళి ఎక్కాడు. అప్పటికే సాయంత్రం అయిదు గంటలు దాటి పోయింది. అడవిదాటడానికి వాళ్ళకి అర్ధ గంటకిపైగా పడుతుంది.

"ఇంక మీరు వెళ్ళిరండి" అన్నాడు ప్రసాద్.

"రేపు ఉదయం మళ్ళీ మేము వచ్చే దాకా మంచె దిగి రాకండి" అన్నారు అందరూ ఒకేమారు.

"మీరేమీ రాకండి తెల్లవారిన తరువాత. తుపాకీ వున్న మాకేం భయం. మేమే వచ్చేస్తాం" అని మురళి వాళ్ళని రావద్ద న్నాడు.

వాళ్ళు ఎన్నో జాగ్రత్తలు చెప్పి బయలుదేరారు. చూస్తూవుండగానే దూరం కాసాగారు. కొండవాగు కొంత దూరం కనిపించి మలుపు తిరిగి అడవి లోకి మాయమయింది. వాళ్ళు కూడా అడవిలో కలసిపోయారు.

ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించింది నిర్మానుష్యమైన ప్రకృతిలో.

మురళి ప్రసాద్‌తో "నువ్వు తెల్ల వారేదాకా మాట్లాడకూడదు. పులి గనక వస్తే నేను దానివేపు వేలు చూపించిన తరవాత నేను తుపాకి గురిచూద్దం చూసి టార్చి వెయ్యి చాలు. దాని తలలోకి రెండు గుళ్ళు దూరిపోతాయి. ఎంత పెద్ద పులైనా నువ్వు భయపడకు. మనం మంచెమీదవున్నాం. మనల్నే జంతువూ ఏమీ చెయ్యలేదని గుర్తుంచుకో" అని అన్ని సూచనలూ చేశాడు.

అన్నిటికీ తల వూపాడు ప్రసాద్! మాట్లాడకూడదు అనే మొదటి సూచనని అప్పుడే పాటించాడు.

అంత పెద్ద అడవిలో వాళ్ళకి మిగి లింది నిశ్శబ్దం.

రాత్రి ఎలాగ గడపగలనా అనే భయంలేదు మురళికి. భయం అసలేలేదు. కాపలా కాస్తున్నది తనకోసంకాదు. ఆ మేన్ ఈటర్‌ని చంపి ఊరివారిని కాపాడటానికి అనే ఊహే ఎంతో తృప్తిని కలిగించింది. ఇంతకాలం తనకోసం తను జీవించాడు. డబ్బు సంపాదించాడు. ఏమి సంతృప్తినిచ్చింది? కాని పదిమందికోసం బతకడం వేరు-అని ఇప్పుడే తెలుస్తోంది. ఈ సంతృప్తిలో అది ఎన్నోవంతు అనుకున్నాడు.

మెల్లగా సూర్యాస్తమయం అయింది. చీకట్లు ముసురుకున్నాయి. కీచురాళ్ళ రొద, అప్పటిదాకా అడవి అదిరిపోయే లాగ అరిచిన పక్షుల కిలకిలా రావాలు కూడా మెల్లగా సన్నగిల్లి నిశ్శబ్దం మరింత రాజ్యం ఏలసాగింది.

మరో అర్ధగంటో గంటో పోతేగాని చంద్రుడు ఉదయించడు. అడవి అంత స్వచ్ఛంగా కనిపించదు. చీకటిలో కూడా మంచెమీదినుంచి కొండకోలను నీరు తెల్లగా ధగధగా మెరుస్తూ కనిపిస్తూంది. దూరంగా పారుతున్న నీటి గలగల మాత్రం వినిపిస్తోంది.

ప్రసాద్ ఏమి ఆలోచిస్తున్నాడో అను కున్నాడు. అతడి ముఖంలోకి చూశాడు. ప్రసాద్‌కూడా మురళిని చూసి నవ్వాడు. మసక వెలుతురులో కూడా కాంతులీనే కల్మషంలేని నవ్వు.

ఆకాశంవేపు చూశాడు. ఒరియన్ వేటగాడు, అతని వెనక కుక్క, నక్షత్ర రాశులు మినుకు మినుకుమంటూ మెరు స్తున్నాయి. వాటినే తెలుగువాళ్లు గొల్లవాడి

కావుళ్ళు అంటారు. ఎన్నోమార్లు హైదరాబాదులో వాళ్ళ డాబామీదినుంచి ఆ చుక్కలను చూశాడు. కాని కరెంటు దీపాలవల్ల అంత ప్రకాశవంతంగా వుండేవికావు. ఇక్కడ కరెంటు దీపాలు లేక రెండు మూడు రెట్లు చుక్కలు ఎక్కువ కాంతిగా కనిపిస్తున్నాయి.

టార్చి లైటుని ఇంటిదగ్గరే ఓ ఇరవై గజాల దూరంనుంచి గోడమీదకి వేసి ఫోకస్ చేశాడు.

రాత్రివేళ వేటాడి జీవించే జంతువుల కళ్ళు రాత్రివేళ దీపాలలాగ మెరుస్తాయి. నిజానికి వాటి కంటిలో ఏ వెలుగూ వుండదు. కాని ఆ కళ్ళమీద ఏ చిన్న కాంతిపడినా వాటి కళ్ళలోని రిఫ్లెక్టర్లు అలా కాంతిని ఫోకస్ చేస్తాయి. టార్చి లైటు వేస్తే ఒక్కసారి ఆ కాంతివేపు చూస్తాయి. వాటి ఉనికిని ఊరికే పట్టెయ్యవచ్చును. ధగధగా మెరిసిపోతూ రెండేసి జతల కాళ్లు కనిపిస్తాయి. అందుకనే వేటాదేవారికి పవర్‌ఫుల్ టార్చిలైటు ఎంతో అవసరం.

తుపాకిని అనువైన పద్ధతిలో మరోసారి పెట్టుకున్నాడు.

'టీ తాగుదామా' అని సంజ్ఞచేశాడు ప్రసాద్‌కి. ప్రసాద్ తల వూపాడు.

ఫ్లాస్కులోని టీని పైకప్పులో ప్రసాద్‌కి పోసి లోమూత కప్పులో తను పోసుకుని తాగాడు. మళ్లీ ఫ్లాస్కు మూసేశారు. రాత్రంతా కదలకుండా నిశ్శబ్దంగా కాపుకాయడానికి అనువైన భంగిమలో కూర్చున్నాడు.

ఓ గంట గడిచింది. మురళికి నిద్ర ముంచుకు రాసాగింది. టైమ్ చూసుకున్నాడు. రాత్రి పదిగంటలైంది.

నిద్రరావడం చూసి చికాకు కలిగింది. అడవిలో చాలామైళ్ళు తిరగడంచేత అలసట చేతనే నిద్రవస్తున్నదని అనుకున్నాడు. ప్రసాద్ కూడా కునికిపాట్లు పడుతున్నాడు. నిద్ర జబ్బు ఒకళ్ళనుంచి ఒకళ్ళకి వస్తుందట. ప్రసాద్ గాలి తనకి తగలలేదుగదా అనికూడా అనుకున్నాడు.

నీరు తాగడానికి మేన్ ఈటర్ ఏ సమయంలోనైనా రావచ్చును. అయినా నిద్రరావడం ఆశ్చర్యమే. దానికి భయం లేకపోవడం. ప్రసాద్‌కూడా ధైర్యవంతుడేనన్నమాట. నిశ్చింతగా నిద్రలోకి మంచెమీదనే జారిపోయాడు. ప్రసాద్‌ని అవసరమైనప్పుడు లేపుతా నిద్రపొమ్మని చెప్పాడు. ప్రసాద్ బారుగా పడుకుని నిద్రపోయాడు.

చంద్రుడు ఉదయించాడు. దొరవలో నీరు మరింత తళతళలాడసాగింది.

మరో కప్పు టీ తాగాడు.

పదకొండున్నరకావచ్చింది. దూరంగా కోతులు 'దొంగముండవస్తుంది' అన్నట్లుగా కిచకిచలాడాయి. పులినిగాని, చిరుతనుగాని చూసినప్పుడు అవి అరిచే తీరే అది. ఆ శబ్దాలకు మిగిలిన జంతువులు, మిగతా కోతులు కూడా వాటి జాగ్రత్తలో అవి వుంటాయి. రేచుకుక్కలగుంపుని చూసినా అలాగే అరుస్తాయి.

మంచెమీదినుంచి కొలను అన్ని వేపులకూ దృష్టిని సారించాడు. కోతులు అరిచి దాదాపు పది నిముషాలు గడిచిపోయింది. దూరంగా చెట్లలో ఓ నల్లని కదలిక కనిపించింది. నిశ్శబ్దంగా ఎండుటాకుల శబ్దాన్నికూడా రానివ్వకుండా ఓ పెద్ద చిరుతపులి ప్రవేశించింది. వెన్నెలలో స్పష్టంగా కనిపించింది.

ప్రసాద్‌ని మెల్లగా లేపాడు.

కళ్ళు నులుముకుని చూశాడు. వేలితో




చిరుతపులిని చూపించాడు. ప్రసాద్ నిద్ర ఎగిరిపోయింది. కళ్ళు మరి మూతలు పడ లేదు. మెల్లగా నడుస్తూ వాళ్ళుకూర్చున్న మంచెవేపే వచ్చి వేపచెట్టు కిందకి వచ్చేసి కనుమరుగైంది. బహుశా మంచె కింద తాటిచెట్లమధ్యనే నుంచుని వుండాలని ఇద్దరూ అనుకున్నారు.

మురళికి ఒక అనుమానం వచ్చింది. కొంపతీసి ఆ మనుషుల్ని తింటున్నది చిరుతపులి కాదుగదా. చిరుతపులి గనక అయితే చెట్లుకూడా ఎక్కగలదు. జాగ్రత్తగా వుండాలి. తుపాకిని తడిమాడు.

ఆ మేన్ ఈటర్ చిరుతపులి అయ్యే అవకాశం లేదు. రాజుగారు కాలి గుర్తులు చూసి పెద్దపులి అన్నారు. ఆరిపాకలో ముసలమ్మని ఎత్తుకుపోయినప్పుడు కొంత మంది కంటబడిందని, దానిని పులిగా గుర్తించినట్లుకూడా పేపర్లో చదివాడు.

ఒక అర్ధగంటకి పైగా మంచెకిందనే ఆ చిరుతపులి కూర్చుంది. ప్రసాద్ ముఖంలోకి చూశాడు మురళి. ప్రసాద్ ముఖంలో ప్రసన్నత స్థానంలో భయం చోటు చేసుకుంది.మురళి భయంలేదన్నట్లు నవ్వాడు. తుపాకిని చూపించాడు.

చిరుతపులి అప్పుడు కదిలింది. పది గజాలదూరం కొలనువేపు వెళ్ళి వెన్నెలలో ఠీవిగా నుంచుంది. దాని ముందు కాళ్ళు ఓ అడుగు ఎత్తున్న నాపరాయి మీద పెట్టి నుంచుంది. అప్పుడు దాని తలవేపు ఎత్తుగావుంది. నడుముని బాణంలాగ కిందికి వంచి ఓ బుస్కొ తీసింది. వర్ణించ డానికి వీలులేని ఓ రకం శబ్దం కూడా ఆ బుస్కొ తీసేటప్పుడు చేసింది. అలాంటి శబ్దం ఒక్కసారి విన్నా జీవితాంతం గుర్తుండిపోతుంది. కాళీపెట్టెని గచ్చుమీద ఈడ్చినట్లు మురళికి వినిపించింది.

మరో ఐదునిముషాలు అలాగే నుంచుని అందకత్తెల పోటీలో సుందరిమణులు ఓ విన్యాసం చేసి పోజులు ఇచ్చినట్లు పోజు ఇచ్చి ప్రసాద్, మురళిలకి కనువిందుచేసింది. ప్రసాద్ తుపాకితో షూట్ చెయ్యమని సంజ్ఞచేశాడు. మురళి వద్దని తల అడ్డంగా వూపాడు.

కావాలనుకుంటే ఒక్క దెబ్బకు ఆ చిరుతపులిని చంపేయగలడు. కాని అడవిలో తన ఆహారాన్ని తాను సంపాదించుకుని మనుషులకు ఏ హానీ చెయ్యని ఆ చిరుతపులిని ఎందుకు చంపాలి. పశువులమీదకి, చివరికి మనుషుల మీదకి కూడా ఎగబడుతున్నది గనక ఆ వెధవ పులిని చంపక తప్పదు గనక చంపాలని నిశ్చయించుకున్నాడు.

తరవాత కొలను అవతలగట్టుకి ఏ శబ్దం చెయ్యకుండా వెళ్ళిపోయింది. అటు వేపు ఈతచెట్లు, ఒత్తుగా పెరిగిన ఈడిగ చెట్లు వున్నాయి. వాటిలోనుంచి వున్న తోవగుండా నిష్క్రమించి ఎటో వెళ్ళిపోయింది.

మరో గంట గడిచింది. ఎలాంటి అలికిడిలేదు. మురళికి విసుగు కలిగింది. పులిని చంపేస్తే రోజూజాగారం చేసేబాధ తప్పేది. ఏది యేమైనా పగలు నిద్రపోయి రాత్రిళ్ళు జాగారంచేసి ఎన్నాళ్ళుపట్టినా పులిని చంపడానికే నిశ్చయించుకున్నాడు.

ఆకాశం వేపు మళ్ళీ దృష్టి సారించాడు. ఒరియన్ బాగా పడమరకి ఒరిగాడు. గొల్లవాడి భుజాలు రెండూ మృగశిరా, ఆర్ద్ర నక్షత్రాలు. ఎర్రరంగుది ఆర్ద్ర నక్షత్రం. గొల్లవాడి తలమీద వృషభరాశి. మొదట్లో దానితలకాయని గుర్తుపట్టడానికి మురళికి కష్టమయింది. ఎమ్. ఎస్. సి. ఎస్ట్రానమీ చేస్తున్న ఓ స్నేహితుడు ఒక

రాత్రి బాగా వివరించాడు. ఆ రోజునుంచీ వీలున్నప్పుడల్లా డాబామీద కూర్చుని చుక్కలనీ, గ్రహాలనీ గమనించడం అలవాటు చేసుకున్నాడు. ఎస్ట్రానమీ మీద పుస్తకాలు కూడాచదివాడు.

వృషభం తలకాయలోని దాని కొమ్ము మీది కాంతిగల నక్షత్రమే రోహిణి నక్షత్రం. హైదరాబాదులో ఇంత క్లియర్‌గా కనిపించేదికాదు. మొత్తం ఎద్దు ఎంత స్పష్టంగా కనిపిస్తుంది అనుకు



న్నాడు. కాస్త ఉత్తరంగా తూర్పుదిశన మిధునరాశిలోని పునర్వసు నక్షత్రాలు కూడా చాలా బాగా కనిపిస్తున్నాయి.

వేకువజామున మూడుగంటలయింది. పులి జాడ కనిపించలేదు.

ప్రసాద్‌కూడా చాలా ఎలర్టుగా అన్ని వేపులా గమనిస్తున్నాడు.

మురళి ఏమీ తోచక మళ్ళీ చుక్కలనే చూడసాగాడు. మాట్లాడే అవకాశం లేకుండాపోయిందిగాని లేకపోతే తనకి తెలిసిన ఖగోళశాస్త్రవిజ్ఞానాన్ని ప్రసాద్‌కి వివరించేవాడు.

సింహరాశి కూడా అస్తమించింది.

తూర్పుకొండమీద వృశ్చికరాశి కాస్త దక్షిణంగా తలఎత్తింది. దాని నడుంమీద



జ్యేష్ఠా నక్షత్రం నారింజరంగుగా కనిపి స్తూంది. ఓపిగ్గా కూర్చుని రాత్రంతా చుక్కల్ని గమనిస్తే చాలా నక్షత్ర రాశుల్ని గమనించవచ్చును. కాని ఫలాన టైముకి ఫలానా నక్షత్రరాశిని ఫలానా చోట ఆకాశంలో చూడాలి అంటే మాత్రం ఏడాది ఆగవలసి వుంటుంది. చాలా నక్షత్రరాశుల్ని ఒకేరాత్రి గమ నించే అవకాశం కలిగింది మురళికి. చంద్రుడు కూడా బాగా పడమటకి వాలి పోయాడు.

ఇంతలో అడవిలోనుంచి నాలుగు పందులు శబ్దంచేస్తూ రాళ్ళనూ రప్పలనూ కదిలిస్తూవచ్చి మురళిని హెచ్చరించాయి. ప్రసాద్‌ని హుషారు చెయ్యడానికి వేలితో మెల్లగా పొడిచాడు. అందులో ఒకటి చాలా పెద్దది. దాని కోరలు పక్కలకి పొడుచుకుని వున్నాయి. కింది పళ్ళు పైనున్న కోరలకు రాసుకుని కరకరా శబ్దం వినిపిస్తూంది. ఆ పందులు కుడికి గాని ఎడమకిగాని చూడకుండా నీటి ఒడ్డునే నడచుకుంటూ నీటిని తాగాయి.

అప్పుడే తుపాకితో కాల్చిచంపమని ప్రసాద్ సంజ్ఞచేశాడు. మురళికి అనవస రంగా ఏ జీవినీ చంపడం ఇష్టంలేదు. వద్దనేశాడు. అవి నీళ్ళు తాగి అడవిలోకి అదృశ్యమయ్యాయి. మరో రెండు గంటల క్రితం చిరుతపులి వచ్చినప్పుడు ఈ అడవిపందులు వస్తే ఏమయ్యేదో అను కున్నాడు. బహుశా ఆ కోరల పందిమీదికి మాత్రం చిరుతపులి లంఘించివుండేది కాదు. అడవిపంది అంటే పులులకికూడా భయమే అని చెప్పడం విన్నాడు. నిజంగా దాని కోరలు ఏ పొట్టలోనో దిగితే పేగులు వెలికిరావడం ఖాయం అని అనుకున్నాడు.

తరవాత ఏ జంతువులూ రాలేదు. తెలతెలవారిపోయింది. పక్షుల కలకలా రావాలు మొదలయ్యాయి. ఫ్లాస్కులో నుంచి మళ్ళీ రెండు కప్పుల టీ పోసుకుని ఇద్దరూ తాగారు. టార్చిలైటూ అదీ సంచిలో సర్దుకున్నారు. అంతలో బాగానే తెల్లవారింది. కిందికి దిగారు. ముందు ప్రసాద్ సంచి పట్టుకుని నడుస్తున్నాడు. వెనక తుపాకితో మురళి అనుస రిస్తున్నాడు. ఇద్దరూ ఊరివేపు బయలు దేరారు.

గెడ్డలోనుంచి నడుస్తున్నారు. రెండు ఒడ్లూ ఆరడుగుల ఎత్తున్నాయి. మధ్యలో వాగు పారుతూవుంది. ఒకచోట గెడ్డనీరు ఒడ్డుని ఒరుసుకుని పారడంచేత రెండోవేపున కాస్త స్థలమే నడపటానికి వుంది.

ఎందుకనో ఒకపక్క వెళ్ళడానికి భయం, ప్రమాదం అనే సంకేతం ఒక వార్నింగులాగా మురళి మెదడులో మెది లింది. ఇలాంటి శంకలు వూరికే కలగవు. దీనినే సిక్స్‌సెన్స్ అంటారు కాబోలు. ఎంత ధైర్యసాహసాలున్నా ఇలాంటి మనోసంకేతాలను నిర్లక్ష్యం చెయ్యకూ డదు అనుకున్నాడు. గెడ్డ వెడల్పు ఇరవై అడుగులు ముప్పైఅడుగుల మధ్య వుంది.

ఒకోచోట పూర్తిగా నీరు విస్తరించి పారడంచేత మధ్యలోనుంచే వెళ్ళడం మంచిది అనిపించింది.

"ప్రసాద్! పంట్లాం పైకి లేపుకుని మధ్యనుంచే నడు. ఏ ఒడ్డువేపునకీ వెళ్ళకు" అని హెచ్చరించాడు.

ఇద్దరూ పంట్లాలు మడతపెట్టు కున్నారు. చెప్పులు తడిస్తే తడవనియ్యి అని అలాగేమధ్యనుంచి నడకసాగించారు. ఎదురుగా పెద్ద దిబ్బ. దానిని ఒరుసు





కుంటూ వాగు ఎడమవేపు మలుపు తిరుగుతుంది. భయంకూడా మొదలవడం చేత తుపాకిని ఎక్కుపెట్టి పొజిషన్‌లో పట్టుకుని ప్రసాద్‌ని కవర్ చేస్తున్నాడు మురళి.

సడెన్‌గా తాటికమ్మల్లోనుంచి రెప్ప పాటులో ప్రసాద్ మీదకి పులి లంఘించింది.

ఎలర్ట్ చెయ్యడానికి కూడా సమయం లేకపోయింది. అయినా ప్రసాద్ కుడివేపుకి పిల్లి మొగ్గలేశాడు.

ప్రసాద్ మీదపడేముందే దాని పొట్టలోకి తుపాకి పేల్చాడు మురళి.

కాని ప్రసాద్ ఎడమజబ్బ పులిపంజాకి దొరికింది. కండ వూడివచ్చింది. బొమిక బయటికి కనిపించింది.

పులి దూరంగా వెళ్ళి గెడ్డ ఒడ్డుమీద పడింది. దాని ప్రేవులు, కడుపు చిట్లి పోయింది. ఈమారు మురళి మీదకి జంప్ చేసింది. ప్రసాద్ భయంతో దొర్లాడు. మురళి లాఘవంగా తప్పుకున్నాడు. రెండో బేరల్‌ని ఎక్కుపెట్టే సమయంలేదు. పులి మళ్ళీ కిందపడింది. చాలా రక్తం అప్పటికే పోయింది. మళ్ళీ లేవబోయే సమయంలో గురిచూసి పేల్చాడు. దాని తలకాయలోకి ఒక పౌను సీసంముద్ద కూరుకుపోయింది. అక్కడే ప్రాణాలు విడిచింది.

ప్రసాద్ నేలమీద కూర్చుండిపోయాడు. భుజంమీద కండ వూడిపోయింది. బొమిక కనిపిస్తూంది. వెంటనే చొక్కాని చించి వానికి చుట్టబెట్టాడు. తుపాకీ, సంచీ అన్నీ అక్కడే వదిలేశాడు. ప్రసాద్ అప్పటికే స్పృహతప్పాడు. అమాంతం అతణ్ణి లేపి భుజాన వేసుకుని ఊరివేపు గబగబా అడుగులు వేసుకుంటూ బయలుదేరాడు.

దూరంనుంచి "మురళీ..ఏమైంది" అని కంగారుగా నరసింహం, అప్పారావు, విశ్వనాథరాజు గబగబా ఎదురొచ్చారు. అందరూ నాలుగు అంగల్లో డాక్టరుగారి దగ్గరకి తీసుకువెళ్ళారు. డాక్టరు మత్తు ఇంజక్షను ఇచ్చి ప్రసాద్ ఊడిపోయిన కండని కలిపికుట్టాడు.

వార్త ఊరంతా పొక్కింది. జగన్నాథ రాజుగారు, తదితర గ్రామ పెద్దలు వచ్చి హాస్పిటల్ దగ్గర మూగారు.

బలరామయ్య కొడుకేమయిందోనని కంగారుపడసాగాడు. డాక్టరు, "కంగారు పడకండి. చిన్న గాయం...మరేంభరవా లేదు" అని ఊరడించారు.

మురళి జరిగిన సంగతి చెప్పాడు. పులి పడివున్న స్థలం చెప్పాడు. నరసింహం మొత్తం గేంగుని అక్కడకి తీసుకు వెళ్ళాడు. పులిని మోసుకువచ్చారు.

అంత పెద్ద పులిని నేనెప్పుడూ చూడ లేదని జగన్నాథరాజుగారు చెప్పారు. రామకోవెల దగ్గర పులిని ప్రదర్శనకి పెట్టారు. మేన్ఈటర్ని చంపేసిన వార్త పొరుగువూళ్ళకి కూడా తెలిసిపోయింది. బస్సుల్లో వచ్చి మరీ చూశారు.

రెండుగంటల్లో ప్రసాద్‌కి మెలకువ వచ్చింది.

"ఎలావుంది ఒంట్లో?" అని మిత్రు లందరూ అడిగారు.

"ఓకే... ఫైన్" అన్నాడు ప్రసాద్. అందరూ సంతోషించారు.

తరవాత ప్రసాద్‌ని పులిమీద కూర్చో బెట్టి, మురళిని ఆ పులిమీద కాలేసి నుంచోబెట్టి ఫొటోలు తీశారు.

మరునాటి పేపర్లో ప్రసాద్, మురళి, పులి వున్న ఫొటోతోసహా మనుషుల్ని చంపే పులిని చంపిన ఉదంతం ప్రచు రించారు.

ఆ మేన్ ఈటింగ్ టైగర్‌ని చంపడం

చేత మురళి హీరో అయిపోయాడు. సురేఖ ఎంతో సంతోషించి వాళ్ళత్తయ్యకి ఉత్తరం రాసిపడేసింది.




సాములూ, గరిడీలు, కర్రలు తిప్పడం లాంటి వినోద కార్యక్రమాలు పండగలప్పుడు పల్లెటూళ్ళలో జరుగుతూ వుంటాయి. సాములు చెయ్యడం, కర్రలు తిప్పడంలో సరదావున్న కుర్రవాళ్ళే మురళి దగ్గర కరాటే, జూడో విద్యలు నేర్చుకున్నారు.

ఓ పండగరోజున వారి విద్యలు ప్రదర్శించారు. ఊరి పెద్దలందరూ ఎంతో ఆసక్తిగా చూశారు. నిలువెత్తున ఇద్దరు పట్టుకున్న కర్రని ఎగిరి తన్ని ఎగరగొట్టెయ్యడం. దొంతెగా పెట్టిన ఇటుకలను చేతితోను, నుదురుతోను విరగకొట్టడం, మొదలైన కరాటే విద్యలు మురళి శిష్యులు ప్రదర్శించారు.

మెరికల్లాంటి కుర్రవాళ్ళని తయారు చేశాడు అనుకున్నారందరూ.

ఊళ్ళో యువకులందరికీ మురళి మీద గురుభావం, పిల్లలందరికీ ఆరాధన మొదలైంది. పిల్లల ఆరాధనకి గల కారణం- శనివారం శనివారం ఉచితంగా రామకోవెలలో సినిమా చూపిస్తాడని.

కాని, ఎన్ని మంచిపనులు చేసినా కొంతమంది అసహ్యించుకునేవాళ్ళుంటారు. మురళి సాధిస్తున్న విజయాలు ఇద్దరికి మాత్రం కంటక ప్రాయంగా వున్నాయి.

రాఘవయ్య ముందే ఎంతోమంది మురళిని పొగడసాగారు. పైకి నవ్వినా ఏకాంతంలో పాములాగా బుసకొట్టసాగాడు. భాస్కర్ ఎందుకూ పనికిరాని దద్దమ్మగా నిరూపించబడుతున్నాడు. ఇదివరకటిలాగా ఎవ్వరూ అతడిని లెక్కచెయ్యడంలేదు.

ఎన్నోసార్లు తండ్రితో భాస్కర్, "ఖూనీ చేస్తాను. ఏదోరోజు ఖూనీ చేసేస్తాను. ఊళ్ళో మనకి పరపతి లేకుండా చేస్తున్నాడు. ఏమి చూసుకుని వాడికా పొగరు" అనడం జరిగింది.

"తొందర పడకూడదురా అబ్బాయ్! సమయం చూసుకుని వాళ్ళ నాన్న దగ్గరికే పంపేద్దాం. అక్కడితో కథ ముగుస్తుంది. అంతదాకా ఎంత నీలుగుతాడో నీలగనియ్యి. ఆరిపోయే ముందు దీపం ఇలాగే వెలుగుతాదిరో" అని ఊరడించేవాడు.

* * *

పంచాయితీ ఎన్నికలు వచ్చాయి. మురళిని వాళ్ళవాళ్ళు, మెంబరుగా నిలబడమని వీధివీధందరూ బలవంతం చేశారు.

మురళి, "నాకూ రాజకీయాలంకూపడదు. నన్ను వదిలెయ్యండి" అన్నాడు.

యువకులందరూ పట్టుబట్టారు.

"నిజానికి రాజకీయాలలోకి నీలాటి సోషల్ సర్వీసు చేసేవాడు కావాలి. బొజ్జలు నింపుకుని ప్రజల సొమ్ము తినేవాళ్ళు అనవసరం. నీకు పదవి వుంటే మరింత పని చేస్తావని మాకు నమ్మకం వుంది" అని బలవంతం చేశారు.

చివరికి పోటీకి నిలబడ్డాడు. ఆ వార్డులో




రాఘవయ్యే అతనికి ప్రత్యర్థి.

రాఘవయ్యకి తెలిసి మురళిని పిలిపించాడు. "నాకు పోటీగా నిలబడతావా! ఉపసంహరించుకో. లేదంటే నేనే మానుకుంటాను" అన్నాడు.

"నువ్వు మానుకోవడమే మంచిది. అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడానికి యువతరం ముందుకు రావాలి. పదేళ్లు చేశావుగదా ఇంక చాలులే" అని చెప్పాడు నిర్మొహమాటంగా.

"సరేగానీ, ఇది కొండతో గొర్రె పోట్లాట అని మరిచిపోకు. నాతో విరోధం తెచ్చుకున్నవాడు బతికి బట్టకట్టలేదు" అన్నాడు రాఘవయ్య బెదిరించే ధోరణిలో బుసలుకొడుతూ.

"ఎవరు గొర్రో ఎవరు కొండో ఫలితాలు తెలిశాక తెలుస్తుంది. అప్పటిదాకా ఆగు. నేను చావుకి భయపడే మనిషిని కాదు" అని రెండు ముక్కలు చెప్పి బయటికి వచ్చేశాడు.

ఆ సంగతి అందరు మిత్రులకి చెప్పాడు.

అందరికీ పట్టుదల పెరిగింది. యూత్ క్లబ్ సెక్రటరీ నరసింహం ఇతర మెంబర్లందరూ బాగా ప్రచారం చేశారు.

మురళి మంచి మెజారిటీతో గెలిచాడు.

అదివరకటి ట్రిక్స్ అన్నీ ప్రయోగించి డబ్బు ఎంత వెదజల్లినా మురళి వ్యక్తిత్వం ముందు నిలువలేకపోయాడు రాఘవయ్య.

మరో విచిత్రం! అనుకోకుండా మురళినే మెంబర్లందరూ పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగా ఎన్నుకోవడం. ఆరోజు యువకులది ఘనవిజయంగా అందరూ భావించారు.

అనకాపల్లి నుండి మిఠాయి తెప్పించి బడిపిల్లలందరికీ పంచిపెట్టారు. పిల్లలు "మురళికి జిందాబాద్...కొత్త ప్రెసిడెంటుకిజై" అని నినాదాలుచేస్తూ ఊరంతా తిరిగారు.

అనకాపల్లి నుంచి మిఠాయి తెప్పించి కుర్రవాళ్ళ చేత అరిపించింది ప్రసాద్ అని తెలిసింది.

సురేఖ సంతోషం వర్ణనాతీతం. జరిగిన విశేషాలతో అత్త అన్నపూర్ణమ్మకి ఉత్తరం రాసింది.

"అత్తయ్యా ... మనందరికీ నిజంగా సుదినం. నీ కలలు నిజంగా పండినరోజు. బావ పంచాయితీ ఎన్నికలలో రాఘవయ్యతో పోటీచేసి ఎంతో మెజార్టీతో గెలిచారు. పంచాయితీబోర్డు ప్రెసిడెంటు అయ్యారు. నువ్వు పెట్టిన షరతు పూర్తయింది. బావదే ఇప్పుడు పైచెయ్యి. బావ కావాలని అతనిమీద పోటీకి నిలబడలేదు. ఊరంతా ఏకమై నిలబెట్టి గెలిపించారు. ఇంతకన్నా నీకేం కావాలి. నువ్వు ఇంక గర్వంగా ఊళ్ళో అడుగుపెట్టవచ్చును. వెంటనే మా డాడీని తోడు తీసుకుని బయలుదేరిరా. బావకి చెప్పకుండా ఈ ఉత్తరం రాస్తున్నాను. నిన్ను చూసి బావ ఆశ్చర్యపోవాలి. నీకోసం ఎదురు చూస్తూ...

మీ సురేఖ."

అని రాసి పోస్టులో పడేయించింది ఉత్తరాల చిన్న చేత.

* * *

రాఘవయ్య ఎన్నికలలో ఓడిపోగానే మురళి హృదయంలో ప్రతీకార జ్వాల చల్లారిపోయింది. పదవి బాధ్యత నెత్తినపడగానే ఊరికి ఏదైనా సేవచెయ్యాలని తలపెట్టాడు.

వారం వారం మీటింగుపెట్టి మెంబర్లు అందరికీ పనులు అప్పగించసాగాడు. ఓ

మీటింగులో అందరి ఆమోదంతో చాలా కాలంగా ప్లాను శాంక్షనై మరుగునపడి వున్న పంపు నీళ్ళ స్కీముని పూర్తి చెయ్యాలని సంకల్పించాడు.

స్త్రీలు ఊరికి ఎంతో దూరానున్న బావుల్లోకి పోయి కడవలతో నీళ్ళుమోసుకు రావడం చాలా బాధ అనిపించింది. ఆ బావులకు వెళ్ళే పనిలేకుండా చెయ్యాలనుకున్నాడు.

20 శాతం ఖర్చుని ఊరి ప్రజలు భరిస్తే మిగిలింది ప్రభుత్వం భరిస్తానని ఒప్పుకున్నదే కాని శ్రద్ధ తీసుకునే పంచాయితీ నాయకులు లేక అలా ఎన్నో ఏళ్ళుగా మూలనపడివుంది.

మురళి తన స్వంత ఖర్చులతో పంచాయితీ పనిమీద హైదరాబాదు వెళ్ళి దానికి సంబంధించిన అధికారులను కలుసుకుని కావలసిన డబ్బుని ఉన్న వాళ్ళ దగ్గర వసూలు చేశాడు. అందరూ తలో చెయ్యీ వేశారు. బలరామయ్యగారు అయిదు వేలు, మురళి పదివేలు వేసుకున్నారు. కావలసిన మొత్తం సరి పెట్టారు.

ప్రసాద్ డబ్బు కోసం రాఘవయ్య దగ్గరకి వెళ్ళాడు. చిల్లుకాని ఇవ్వడానికి ఒప్పుకోలేదు.

"బయలుదేరాడుగా మొనగాడు పెట్టుకోమనండి. పీడిపాటి చేతకాకే ఊరుకున్నామా! మన ఊరికి పంపులు రావాలంటే తాతలు దిగిరావాలి" అని ఛాలెంజ్ చేశాడు.

"పదేళ్ళు ప్రెసిడెంటుగా వెలగబెట్టిన బాధ్యత గల మీరే ఇలాగంటే మరెవరిస్తారండి. అయినా ఇలాంటి పనులు ఏ ఒక్కరి కోసమూ ఆగవు. మన వూరి పంపుల కోసం తాతలైనా స్వర్గం నుంచి దిగి వచ్చి తీరుతారు. మీరే చూద్దురు గాని" అనేసి వచ్చేశాడు.

ఊరిలో పైపులు వచ్చేశాయి.

శారదానది ఒడ్డున పెద్ద బావి తవ్వి ఊరులో ఎత్తయిన స్థలంలో ఓ టాంకు కట్టారు. పంపు షెడ్ కట్టించాడు.

ఉదయం సాయంత్రం రెండు పూటలా నీళ్ళు వదలడానికి ఒక మనిషిని పంచాయితీ వేతనం మీద ఎపాయింట్ చేశారు.

* * *

దాంతో రాఘవయ్యకి తలతీసినట్టయింది. అవమానం సహించలేకపోయాడు.

మురళి వూళ్ళో వున్నంత కాలం తన పప్పులు ఇంకఉడకవని తెలుసుకున్నాడు. పాతికేళ్ళ క్రితం చేసిన కుట్ర మళ్ళీ మదిలో మెదిలింది. అప్పట్లో ఎంతో సహజంగా ఆ పని పూర్తిచేశాడు.

మళ్ళీ అదే గొయ్యిని పీడి కోసమూ తవ్వాలి- అనుకున్నాడు.

భాస్కర్‌ని పిలిచి శనివారం కోవెలకి వెళ్ళమన్నాడు.

ఆదివారం అమావాస్య అప్పటికింకా నాలుగురోజులు వుంది.

"ఆదివారం అమావాస్యరోజున పయ్యాల మర్రిచెట్టు దగ్గరకి వెళ్ళి వచ్చే మొనగాడెవడైనా వున్నాడా? ఉంటే ఎంత పందెమైనా వేస్తాను. చెట్ల మీద కూర్చుని, మంచె లెక్కి పులుల్ని చంపడం పెద్ద గొప్పేంకాదు-అని వాడిని రెచ్చగొట్టి పందేనికి ఒప్పుకున్నాడో, వాడు ఇక సఫా" అన్నాడు.

భాస్కర్‌కి మరీ మురళి మీద పగగా వుంది. జబ్బలో ఏమైందో తెలియదు. అదివరకటంత ఎత్తుగా చెయ్యి పూర్తిగా




పైకి లేపలేకపోతున్నాడు. లోన ఎక్కడో పైకి లేపేటప్పుడు కలుక్కుమంటుంది. చంపిపారెయ్యాలి నా కొడుకుని అనుకున్నాడు.

సరేనని తల వూపాడు.

* * *

శనివారంనాడు రామకోవెలలో వీడియో సినిమా వేస్తున్నారు.

వారం వారం సినిమా ప్రదర్శించే పనిని సత్యారావుకి ఒప్పజెప్పాడు మురళి. సత్యారావు మీటర్ని ఉపయోగించడం. కంటిన్యూయిటీ, వోల్టేజ్, కరెంటు కొలవడం అన్నీ నేర్చుకున్నాడు. ఇప్పుడు రేడియోలని, ట్రాన్సిస్టర్లని బాగానే రిపేరు చేస్తున్నాడు. మురళి నేర్పినందువల్ల, ఉచితంగా మీటరదీ ఇచ్చినందువల్ల నెలకి వందా యాభై ఆర్జించుకుంటున్నాడు.

ఒక్కమారు "మీకెందుకండి శ్రమ, నేనే వారంవారం వూరికే వీడియో ఆపరేటర్గా పనిచేస్తాను" అన్నాడు. అప్పుడప్పుడు మురళి ఖాతామీద వీడియో కేసెట్స్ కొత్తవి వీడియో లైబ్రరీనుంచి తెచ్చి వేస్తూ వుంటాడు. మురళి ఇంటినుంచి శనివారం శనివారంవి.సి.ర్.టి.వి. భద్రంగాతేవడం మళ్ళీ వెనక్కి పట్టుకువెళ్లడం అతనే చేస్తాడు.

సినిమా కొత్తది కావడంచేత మురళి, సురేఖ, అతని మిత్రులు ముందు వరసలో చాపమీద కూర్చున్నారు. వెనక చాలామంది కూర్చున్నారు. ఊళ్లోని పెద్దవాళ్ళందరూ సినిమా చూడటానికి రావడం మొదలుపెట్టారు. మంచి సినిమా అని తెలిస్తే బలరామయ్య, జగన్నాథరాజుగారు కూడా వస్తూవుంటారు. ఆరోజు అందరూ సినిమా చూస్తున్నారు.

కాని రాఘవయ్య పక్కనే వుంటూ ఎప్పుడూ రాలేదు. భాస్కర్ ముఖం కూడా ఎప్పుడూ శనివారం రామకోవెల దగ్గర కనిపించలేదు.

కాని ఆరోజు భాస్కర్ వచ్చాడని తెలిసింది. దూరంగా మండపంలోనుంచి ఒక స్తంభాన్ని ఆనుకుని చూస్తున్నాడు. బాగుండదని అప్పారావు ముందుకివచ్చి చాపమీద కూర్చోమన్నాడు.

జంకుతూ జంకుతూ వచ్చి రెండో వరసలో కూర్చున్నాడు.

సినిమా పూర్తయింది.

బలరామయ్య మురళి భుజంమీద చెయ్యివేసి లేస్తూ, "తండ్రిని మించిన కొడుకువయ్యా! పులిని చంపావు. ప్రెసిడెంటువయ్యావు. భగీరథ ప్రయత్నం చేసి ఊరికి పంపునీళ్ళు తెచ్చావు. ఊరికే సినిమాలు చూపిస్తున్నావు" అని మెచ్చుకున్నాడు.

మురళి, "మాదేముంది మామయ్యా! మీరు మొదలుపెట్టిన కార్యక్రమాలు పూర్తిచేస్తున్నాము. మీరు ఆశీర్వదిస్తున్నారు...అంతే!" అన్నాడు.

భాస్కర్ అందుకుని, "ఏమిటి బలరామయ్యా...నువ్వు భట్రాజులాగ మరీ పొగుడుతావు. చెట్టుమీద మంచెనెక్కి నేనూ కొడతాను పులుల్ని. తుపాకుంటే ఆడది చంపుతుంది సింహాల్ని. దమ్ములుంటే ఆదివారం అమావాస్యనాడు వయ్యాల మర్రిచెట్టు దగ్గరికి రాత్రి పన్నెండు గంటలకి వెళ్ళమనండి తెలుస్తుంది" అన్నాడు.

మురళికి ఒకపక్క ఉద్రేకంతో పిడికిళ్ళు బిగుసుకున్నాయి. మరో వంక సంతోషం వేసింది.

వచ్చిన పామునెందుకు చంపడం. ఎలక్షనులో ఓడిపోయాడు. పాముకి



విషపు కోరలు లాగేశానుగదా అని పూడసున్నాడు. కాని వాళ్ళ గొయ్యిని వాళ్ళే తవ్వుకుంటున్నారు.

మురళి బలరామయ్యతో, "మామయ్యా! నేను అర్ధరాత్రి అమావాస్యనాడు ఆదివారం రోజున దయ్యాల మర్రిచెట్టుదగ్గర తెల్లవార్లూ నిద్రపోతాను. ఎంతెంత పందెంకాస్తాడో అడుగు" అన్నాడు.

ప్రసాద్, నరసింహం, అప్పారావు, వదితర యువకులు అక్కడ మూగారు.

ప్రసాద్‌కి పారితేళ్ళక్రితం జరిగిన



కుట్రవిషయం మురళి చెప్పాడు. కాని దక్కినవాళ్ళకి తెలియదు.

బలరామయ్య మురళితో, "వద్దు బాబూ! మీ నాన్న ఇలాంటి పందెంలోనే ప్రాణాలు పోగొట్టుకున్నాడు. పందెం కాయకు. అప్పుడూ అచ్చం ఇలాగే జరిగింది" అన్నాడు.

"మీరు భయపడకండి మామయ్యా! అన్ని రోజులూ ఒక్కలాగే వుండవు. పందెం ఎంత కాస్తాడో అడగండి" అని తొందరచేశాడు.

జగన్నాథరాజుగారికి మురళి సాహసం తెలుసు కాని ఇది శ్మశానం దయ్యాలతో ముడిపడివున్న వ్యవహారం.

అందుకే ఏమీ మాట్లాడకుండా వూరు కున్నారు.

యువకులెవ్వరూ మురళిని వారించ లేదు. గురువుగారిమీద వాళ్ళకి కొండంత నమ్మకంవుంది. దయ్యాలనికూడా జుత్తు పట్టుకుని లాక్కొచ్చేరకం అని వూరుకు న్నారు.

ప్రసాద్, "అంతలాగ కబుర్లు చెబు తున్నావు...నువ్వు వెళ్ళి రాగలవా?" అన్నాడు.

"న్నా ఈ సెందుకు!నువ్వూ, మీ నాన్నా మురళి హీరో అని తెగ ఊదరగొడు తున్నారుగదా, ఆయన్నే వెళ్ళమనండి... దమ్ములుంటే" అని మళ్లీ ఛాలెంజ్ చేశాడు.

"సరే...వెళతాడు. ఎంత పందెం కాస్తావు" అన్నాడు ప్రసాద్.

"నిజంగానే ధైర్యవంతుడని ఒప్పు కుంటాను" అన్నాడు.

"నువ్వు ఒప్పుకోవద్దులే! ఇంటికి దయచెయ్యి. ఈ మొనగాడు ఒప్పుకోక పోతే మురళికి లోటొచ్చింది. ఏదైనా పందెం వేయి" అన్నాడు.

"వెయ్యిన్నూట పదహార్లు" అన్నాడు గొప్పగా.

"సిగ్గులేదూ! నీ వెయ్యిన్నూట పద హార్లకోసం అంత పెద్ద వ్యాపారవేత్త, పంచాయతీబోర్డు ప్రెసిడెంటు స్మశానానికి దయ్యాల మర్రిచెట్టు దగ్గిరకి వెళ్లాలా. నువ్వు మీ పాకలో ఒక్కడివీ ఒక రాత్రుండు. నేనిస్తాను వెయ్యిన్నూట పదహార్లు" అన్నాడు ప్రసాద్.

"అయితే ఎంత కాయమంటావు" అన్నాడు.

"ఐదువేలు!" ఐదువేలు పట్టుకొచ్చి ఇప్పుడే రాజుగారి దగ్గర పందెం కలుపు. రేపటి ఆదివారం అమావాస్యే. మురళిని నేను ఒప్పిస్తా. అతని హోదాకి పదివేలైనా తక్కువే" అన్నాడు.

"సరే! వుండండి...ఇప్పుడే తెస్తాను" అని ఇంటికి వెళ్ళాడు భాస్కర్.

అందరూ ఆశ్చర్యపోయారు.

వాళ్ళ అంతర్యం ఏమిటో, ఎందుకు స్మశానానికి పంపిస్తున్నారో కేవలం ఇద్దరికే తెలుసును. ఆ ఇద్దరూ మురళి, ప్రసాద్.

మిగతావాళ్ళందరూ దీన్ని డ్రమెటిక్‌గా తీసుకున్నారు. ఫర్వాలేదు. పందెం అంటే మంచి కాలక్షేపం. రామకోవెల ఆదివారం అమావాస్యనాడు కళకళలాడుతుందన్న మాట. ఐదువేలూ భాస్కర్ తెస్తే బాగుండి పోను–అనుకున్నారందరూ.

బలరామయ్యమాత్రం పాతికేళ్ళక్రితపు సంఘటన పునరావృతం కానియ్యవద్దని మనస్సులోనే రాములవారికి మొక్కు కున్నాడు. భాస్కర్ పావుగంటలో వచ్చే శాడు. ఐదువేలు, యాభైవంద రూపాయల నోట్ల కట్టలుతెచ్చి జగన్నాథరాజుగారికి ఇచ్చాడు.

పందెం ఖాయమైపోయింది.

అందరూ వెళ్ళిపోయారు.

మురళి, ప్రసాద్ మిగిలారు.

ప్రసాద్ "సురేఖగారు ఒప్పుకుంటా రంటావా?" అన్నాడు.

"ఆ సంగతి నాకొదిలేయ్ ప్రసాద్! ఆవిడగారు నన్ను అడవిలోకి మాత్రం మనస్ఫూర్తిగా వెళ్ళనిచ్చిందా? ఏ స్త్రీ మాత్రం భర్తని తెలిసి తెలిసి ప్రమాదం లోకి వెళ్ళనిస్తుంది చెప్పు" అనేశాడు.

ఇద్దరూ ఎవరి ఇళ్ళకు వాళ్లు వెళ్ళి పోయారు.

* * *

ఆదివారం, రామకోవెలనిండా జనం





వున్నారు. ఆరోజు మురళి స్మశానానికి వెళ్ళేరోజనీ, భాస్కర్, మురళి పందెం వేసుకున్నారనీ ఇంచుమించు ఊరందరికీ తెలుసును.

మురళి; అతని మిత్రులు చాలామంది వుండటం పెద్ద విచిత్రం కాదు. కాని బద్ధ వైరులుగా మారిపోయారనుకున్న రాఘవయ్య, మురళి కోవెలలో వుండటం అందరికీ చిత్రం అనిపించింది.

బలరామయ్య, జగన్నాథరాజు మధ్యవర్తులుగా వచ్చారు.

మురళి, ప్రసాద్, నరసింహం, అప్పారావు, జగన్నాథం వస్తారని ఎదురుచూడసాగాడు. వాళ్లు రావడం కనిపించలేదు.

బలరామయ్యతో, "మామయ్యా! ప్రసాద్ రాలేదా?" అని అడిగాడు.

"లేదయ్యా... అనకాపల్లి ఉదయం అనగా వెళ్ళాడు. కాని ఇంకా రాలేదు. సినిమాకిగాని వెళ్ళాడేమో. పదిగంటలకల్లా వచ్చేస్తాడు. నీ పందెం వుందిగదా. తప్పకుండా వస్తాడులే" అన్నాడు.

రాఘవయ్య అక్కడచేరిన చాలామందిని ఉద్దేశించి "మీరు కుర్రవాళ్లు. పందాల వ్యవహారం మీకు తెలియదు. ఇలాంటి పందాలు వేసుకోవడంలో చాలా ప్రమాదం వుంది. మాలాంటి పెద్దవాళ్ళం వుండికూడా మిమ్మల్ని ఆపలేదని తరవాత నిష్ఠూరం వేస్తారు"

అని మురళితో, "మురళీ! నువ్వు ఈ పందానికి ఒప్పుకోకు. నా మాట విను. నాకు నువ్వొకటీ, భాస్కరొకటీ కాదు. నువ్వు ధైర్యవంతుడివే కావచ్చు. కాని దయ్యాల సంగతి నీకు తెలియదు. నువ్వు గనక స్మశానంలో భయపడటం జరిగితే ఏదయినా అంబళిస్తుంది. లేక మరో రకమైన ప్రమాదం జరగవచ్చును.

నా మాటవిని మానెయ్యి.

ఇదివరకు జరిగిన ఇలాంటి కథే చెబుతాను...విను" అన్నాడు.

పాతికేళ్ళక్రితం జరిగిన వేణుగోపాలరావు ఉదంతం చెబుతాడేమో అనుకున్నాడు బలరామయ్య. అలాగే వాళ్ళ నాన్నగారి సంగతే చెబుతాడేమో అని మురళి అనుకున్నారు.

కాని రాఘవయ్య, "నీలాంటి ధైర్యవంతుడే స్మశానంలోని ఒక చెట్టుకి మేకు దిగగొట్టి వస్తానని పందెం కాశాడట. చాలా ధైర్యంగానే వెళ్ళాడు. మేకు చెట్టుకి దిగగొట్టాడు. వెనక్కి తిరిగాడు. భుజంమీది తువ్వాలుని ఎవరో లాగినట్లయింది. మొదటిసారి భయంవేసింది. గట్టిగా తువ్వాలుని లాగాడు. అయినా రాలేదు. అంతే! దయ్యమేదో పట్టుకుని వుంటుందని భ్రమపడి అతని గుండె ఆగిపోయి చనిపోయాడట. కంగారులో మేకుని తువ్వాలు మీదినుంచి దిగకొట్టేశాడు. మరునాడు అందరూ అసలు కారణం తెలుసుకుని చాలాబాధపడ్డారట. అందుకే నా మాటవిని ఈ పందెం మానుకోండి" అని హితబోధ చేశాడు.

రాఘవయ్య ఎత్తేమిటో మురళికి అర్థమైంది.ఏదైనా జరిగినా తాను హాయిగా తప్పుకోవచ్చును. విన్నవాళ్ళందరూ సాక్ష్యాలు పలుకుతారు అనుకుని నవ్వుకున్నాడు.

జనంలోని ఒక ముసలతను మురళితో— "నిజంగా బాబూ ... మీ తండ్రి కూడా ఇలాంటి పందెంలోనే చచ్చిపోయాడు. నువ్వు ఆయన మాట విను బాబూ" అన్నాడు.

రాఘవయ్యని ఆ ముసలాయన మాటలు ఇబ్బంది పెట్టాయి.

"నిజంగా మా నాన్నగారు ఇలాంటి ప్రమాదంలో చనిపోయారా?" అన్నాడు ఏమీ తెలియనివాడిలాగ మురళి.

రాఘవయ్య, "నిజమే మురళీ! నామాట వినకుండా ఎవ్వరితోనో పందెం వేసి శ్మశానం వెళ్ళి ఇలాగే చచ్చిపోయాడు. అందుకనే పనికట్టుకు విషయం తెలియ గానే అపార్థాలున్నా ఉన్నవాడివి ఒక్కడివిగదా అని పరిగెత్తుకొచ్చాను" అన్నాడు ఎంతో బాధ నటిస్తూ.

"మరి ఆ సంగతి తెలియజెప్పకుండా మేకు దిగగొట్టిన వేరే కథ చెప్పావెం దుకు?" అని ప్రశ్నించాడు.

కాసేసేపు తడబడి, "ఆ సంగతి నీకు మీ అమ్మ చెప్పే వుంటుందనుకున్నాను" అన్నాడు రాఘవయ్య.

తాటిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడ గడ్డికి అన్నట్లున్న అతని సమాధానానికి విస్తుపోయాడు మురళి.

"మీరెవ్వరూ భయపడకండి. ప్రతిసారీ అలాగే జరుగుతుందని ఎందుకు అనుకో వాలి. అలాగే నిజంగా ఏదైనా దయ్యాలో, భూతాలో వుంటే, రోజూ పొలాల నుంచి వచ్చేవాళ్ళలో చాలామంది ఆ దయ్యాల మర్రి పక్కనుంచే వస్తారు. మా నాన్నగారు చనిపోయిన తరవాత ఇంకా ఎంతో మంది చనిపోదురు. మరి ఎవరూ చావలేదేం? నేను ఈ పందెం గెలవగలనని నాకు నమ్మకం ఉంది. నాకు భయం లేదని, చావుకి కూడా భయపడ నని నిరూపిస్తాను. ఇంతవరకూ వచ్చిన తరవాత వెనక్కి తగ్గి పిరికివాణ్ణని పించుకోలేను. పందెం ఖాయం చెయ్యండి" అన్నాడు జగన్నాథరాజుగారి వేపుచూసి.

ఇందాకటి ముసలాయన, "మహ తొందర పడుతున్నావు. దయ్యం కనిపిస్తే ఏం చేస్తావు" అని కోప్పడ్డాడు.

"మా సురేఖ ఇంటిపనులన్నీ చేసుకో లేకపోతోంది. దాన్ని వశం చేసుకుని ఇంటికి తీసుకొస్తాను. అద్దమైన చాకిరీ చేస్తుంది" అన్నాడు నవ్వుతూ.

పందెం ఖాయమైంది.

రాత్రి పన్నెండుగంటలకి మురళి దయ్యాల మర్రిచెట్టు దగ్గరకి వెళ్ళి రావాలి.

భాస్కర్ అందుకున్నాడు, "ఒక పదిమందిమి ముందు వెళ్ళి ఆ దయ్యాల మర్రిచెట్టెక్కి నా చొక్కాని ఓ కొమ్మకి మేకు కొట్టి వేలాడదీస్తాం. నువ్వు ఒక్కడివే పన్నెండు గంటలకి ఇక్కడి నుంచి వెళ్ళి శ్మశానంలోని ఆ చెట్టెక్కి నా చొక్కా తెచ్చిస్తే ఐదువేలు నీవే" అన్నాడు.

మురళికి ఆ పందెం వెనకగల కుట్ర అర్థమైంది. ఒక రకంగా తాను ఈ రహస్యాన్ని ఛేదించడానికే వ్యాపారాన్ని వదిలి వచ్చాడు. ఈ ప్రయత్నంలో ప్రాణం పోయినా ఫర్వాలేదు. తన ప్రయత్నం లేకుండా వాళ్ళే గోతిలోకి దిగుతున్నారని ఆనందిస్తూ "సరే...నేను రెడీ" అన్నాడు.




ఆదివారం అమావాస్య రాత్రి... పన్నెండుగంటలు దాటిపోయింది.




మురళిని అతని మిత్రులు, శిష్యులు, ఊరి పెద్దలు శ్మశానానికి సాగనంపి మళ్ళీ కోవెలలోకి వచ్చి కూర్చున్నారు. భాస్కర్, రాఘవయ్య కూడా వాళ్ళలో వున్నారు.

చివరి నిమిషంలో కూడా ప్రసాద్ వచ్చాడేమో కనుక్కురమ్మని కబురు పంపించాడు మురళి. రాలేదని తెలిసింది. అదే ఒక వెలితిగా అనిపించింది మురళికి.

బలరామయ్య, జగన్నాథరాజుగారు, తదితర పెద్దలూ ఎప్పటివో దయ్యాల కథలలోకి దిగారు. పిచ్చాపాటీ మాట్లాడుకోవడంలో అందరూ మునిగిపోయారు.

ప్రసాద్ మురళికి కుడిభుజంలాంటి వాడని భాస్కర్‌కి తెలుసును. ప్రసాద్ వస్తే కాస్త ధైర్యవచనాలు చెప్పేవాడు. రాకపోవడం మంచిదయింది. అదొక ప్లస్ పాయింట్ లాగ భాస్కర్‌కి అనిపించింది.

మురళికి దయ్యాలమీద అసలు నమ్మకం లేదు. దయ్యాల భయం లేకపోయినా పాములకీ, జంతువులకీ భయపడక తప్పదు. అందుకని సాక్స్ తొడుక్కుని అంబాసడర్ షూ వేసుకున్నాడు. కాస్త బలమైన చేతికర్ర పట్టుకున్నాడు. మూడు సెల్స్ టార్చిలైటు కూడా పట్టుకున్నాడు.

భాస్కర్ టార్చిలైటు తీసుకు వెళ్ళడానికి వీలులేదని అభ్యంతరం పెట్టాడు. అమావాస్య చీకటిలో చెట్టెక్కి చొక్కా వెతికి తీసుకురావడానికి టార్చిలైటు లేకుండా ఎలా అని అందరూ కలసి భాస్కర్‌ని ఒప్పించారు.

టార్చిలైట్ అయితే తీసుకున్నాడే గాని వాళ్ళకి కనుమరుగయ్యేదాకా వెలిగించనేలేదు. రామ కోవెలకి దయ్యాల మర్రి చెట్టుకి ఒక కిలోమీటరుకి పైగానే దూరం వుంటుంది. సర్వసాధారణంగా శ్మశానాలు ఊరి పొలిమేరల్లోనే వుంటాయి. ఆ వూరికి పొలిమేరలూ దూరమే. పొలాలంత కన్నా దూరం. ఎంత నడచినా తరగడం లేదు.

చుట్టూ చిమ్మ చీకటి. టార్చిలైటు అసలు వెలిగించకుండా వుండటం మురళికి మంచిదయింది. ఆకాశంలో చుక్కలు మినుకుమినుకుమంటున్నాయి. ఆ చుక్కల వెలుగుకే కళ్ళు అలవాటుపడి పోయాయి. తోవ తాటి తోపుల మధ్య నుంచి బండి బాట మీదుగా పోతుంది. నలిగిన తోవ కావడం చేత తెల్లగా కనిపిస్తుంది. బూట్లు టకటక శబ్దం చెయ్యక పోయినా ఇసకలో సర్‌సర్‌మంటున్నాయి. ఆ అలికిడికి పాములు పారిపోతున్నాయి. ఇంక ఏదైనా క్రూరజంతువు మీదపడితేనే ప్రమాదం. మనుషుల్ని తినే పులిని తను చంపెయ్యడం మంచిదే అయింది. లేకపోతే ఆ పులి భయం తనని పీడించేది అనుకున్నాడు.

దూరంగా గెడ్డ ఒడ్డు! దాని మీద నీటి సదుపాయం ఏపుగా ఎదిగి వేప చెట్లు, తాటి చెట్లు మొదలైనవి జుత్తు విరబోసుకున్న రాక్షసుల తలకాయల్లాగ కనిపిస్తున్నాయి. మనో నేత్రం ఊహించుకోగల రూపాలు ఆ చెట్లలో మురళికి కనిపిస్తున్నాయి.

ఆ గెడ్డ దాటితే ఏటికాలువ. అది దాటితే ఏరు. ఆ ఏటి ఒడ్డునే శ్మశానం. శ్మశానంలోనే పెద్ద మర్రిచెట్టు. ఊడలు దిగి బాగా వ్యాపించి వుంది. ఆ చెట్టుకి అటూ ఇటూ ఎన్ని శవాలు కాలాయో చరిత్రకు అందని విషయం.

దూరంగా పొలాలలో లాంతర్లు చిన్న దీపాలలాగా కనిపిస్తున్నాయి.

రాత్రిపూట స్మశాన ప్రాంతాలలో పోయేటప్పుడు వెనక్కి తిరిగి చూడకూడదు అనంటారు. ఎందుకు చూడకూడదో అనుకున్నాడు. చిత్రంగా అంతవరకూ వినిపించని బూట్లు చేస్తున్న శబ్దాలు, బాటకి ఇరువైపులావున్న చెట్ల ఎండుటాకుల శబ్దాలు వినిపించడం మొదలుపెట్టాయి.

వెనక్కి చూశాడు. దూరంగా వూరు, వీధి దీపాల వెలుగు కనిపిస్తూంది.

ఏమిటీ ప్రపంచం. మనిషి తన చుట్టూగల ప్రపంచాన్ని ఇంద్రియాలతోనే గ్రహిస్తాడు. పంచేంద్రియాలు లేకపోతే ప్రపంచానికి గుర్తింపులేనట్లే అలాంటిది ఎదురుగా కనిపించి భయపెడుతున్న రాఘవయ్య లాంటివాళ్ళకి భయపడక కనిపించని దయ్యాలకి భయపడటమేమిటి అనుకున్నాడు.

ఇలాంటి అనుమానాలను అధిగమించడానికే ఎన్నోమార్లు ఏ పందెం లేకుండానే దయ్యాల మర్రిచెట్టు కింద అర్ధరాత్రి దాటిన తరువాత కూడా గడిపాడు. అయినా ఈ రోజు కాస్త బెరుకుగానే వుంది. దయ్యాల గురించి కాదు-ఎవరో తప్పకుండా మీద పడతారని తెలుసును. అందుకే ఆ జంకు.

ఇంక ఆలోచనలు అనవసరం. గబగబా మర్రిచెట్టుని చేరుకుని చొక్కాని తేవడమే ధ్యేయంగా పెట్టుకోవాలి - అని నిశ్చయించుకుని వేగం పెంచి చకచకా ముందుకి సాగిపోయాడు.

వెలుగుతూ ఆరుతూ మిణుగురు పురుగులు కాళ్ళకి, ఆగకుండా రొద చేస్తున్న కీచురాళ్ళు చెవులకి వింత అనుభూతిని కలిగిస్తున్నాయి.

ఏటి ఒడ్డుకి వచ్చేశాడు. దయ్యాలమర్రి కనిపిస్తూంది. మధ్యాహ్నమో లేక సాయంత్రమో దహనం జరిగిన ఓ చితిలో నుంచి నిప్పులు రాజుకుంటున్నాయి గాలికి. రావిచెట్లు, వేపచెట్లు కిందని తంగేడు తుప్పలు చాలా వున్నాయి. మురళి అలికిడికి ఓ గుడ్లగూబ భయంకరంగా అరచి రెక్కలు కొట్టుకుని ఎగిరిపోయింది. ఎంత దృఢ చిత్తంతో నడుస్తున్నా తలవని తలంపుగా వచ్చిన ఆ శబ్దానికి మురళి గుండె ఒక్కసారి ఝల్లుమంది. గుండె దడ పెరిగింది. గబగబా కొట్టుకోసాగింది.

ఆ షాకు నుంచి తేరుకోడానికి క్షణంసేపు ఆగాడు. చుట్టూ ఒకసారి పరిసరాలు కలయజూశాడు. స్తబ్దత, జడత్వం కాళ్ళు చాచి నిద్రపోతున్నట్లుంది. మృత్యువు దీర్ఘమైన చేతులు చాచి ఆహ్వానిస్తున్నట్లు మరో ఇరవై గజాల దూరం నుంచి మర్రిచెట్టు చూస్తోంది.

దూరంగా గుంటనక్కల అరుపులు. వాతావరణం ఎంత భయానకంగా వున్నా మురళికి ఎలాంటి భయమూ కలగలేదు. కాని అతడు ఏదో ప్రమాదాన్ని శంకిస్తున్నాడు. ఎవ్వరో తన మీద దాడి చేస్తారు. సిద్ధంగా వుండాలి. గుడ్లగూబ అరవడం మంచిదయింది. గుండె దడ తగ్గి మళ్ళీ మామూలుస్థితికి వచ్చింది. ఇంక ఎలాంటి శబ్దాలూ తనని బెదిరించలేవు.

చీకటికి బాగా అలవాటుపడ్డ మురళి కళ్ళు దయ్యాలమర్రికి అన్ని వేపులా కదలికలకోసం గమనించాయి.

ముందూ వెనకా చూసుకుంటూ మర్రిచెట్టువేపు కదిలాడు. అంతవరకూ టార్చిని వాడలేదు. కింద ఎవ్వరూలేరు. కాని చెట్టుమీద కూర్చుని కిందకి వెళ్ళగానే మీదకి దూకితేనో అనే అనుమానం వచ్చింది.

టార్చి వెలిగించాడు. చెట్టంతా ఆకు ఆకూ గాలించాడు. ఎలాంటి జీవీలేదు. మరికాస్త ముందుకి వెళ్ళి కిందినుంచి కొమ్మల్లోకి వేసిచూశాడు. ఏ మనిషీలేడు. భయంలేదు. చెట్టుమీద మాత్రం ఎవ్వరూలేరు.

ఓ పది నిముషాలదాకా వేచి చూశాడు. వెనక్కీ ముందుకి చూస్తూనే వున్నాడు. ఒకవేళ నాన్నగారిని చంపినట్లు తనని చంపాలనుకుంటే ఆలస్యం ఎందుకు?తాను అనవసరంగా కాలంవృధాచేస్తున్నాడా??

మరోమారు టార్చి వేసి పైకొమ్మ మీద చొక్కాకోసం గాలించాడు. పై కొమ్మకి లాల్చీ వేలాడుతోంది. పైకి ఎక్కాలి. మరిచెట్టు మొదలు చాలా పెద్దది. బూట్లు జారుతాయి. ఆ కొమ్మ నుంచి కూడా ఓ సన్నని మర్రివూడ వేలాడుతుంది. గట్టిగా తెంపాలని గుంజాడు. చాలా గట్టిగా వుంది. రోప్ పట్టుకుని రెండు చేతుల్తో కాళ్ళ అవసరం లేకుండా ముఫైఅడుగులఎత్తుకి నిముషంలో ఎక్కేసేవాడు. అలానే పైకి చేరుకోవా లనుకున్నాడు.

టార్చిని భుజాన వేలాడుతున్న సంచిలో పడేశాడు. గబగబా ఎగబాకాడు. రెండు నిముషాల్లో కొమ్మమీద కూర్చున్నాడు. చొక్కాని కొమ్మనున్న మేకునుంచి ఊడ దీశాడు. సంచిలో కుక్కేశాడు. బేతాళ కథలు జ్ఞాపకం వచ్చాయి. ఒకవిధంగా నయమే. శవాన్ని చెట్టుకి వేలాడదీస్తాను. దించుకుని ఊళ్ళోకి మోసుకురమ్మని చెప్పలేదు భాస్కర్ అనుకున్నాడు.

ఇంక దిగిపోదాం అనుకుంటూ వుండగా...

మర్రిచెట్టుకి నాలుగుదిక్కులనుంచీ నాలుగు పెద్దమంటలు ఆకాశంవేపు లేచి మళ్ళీ ఆరిపోయాయి. పెద్దమంటలు ఒక్క సారే లేవడం, పరిసరాలు కాంతివంతం కావడం మళ్ళీ ఆరిపోవడంచేత కళ్ళు చీకట్లు కమ్మాయి.

మురళి కొమ్మని గట్టిగా పట్టుకొన్నాడు. టార్చిలైటువేసి చూద్దాం అనే ఆలోచనని వెంటనే అదుపు చేసుకున్నాడు. మళ్ళీ మంటలు లేస్తాయేమో అని ఎదురుచూడ సాగాడు. కుడిపక్కని అగ్గిపుల్ల గీసిన శబ్దం. తల మెరుపులాగ అటుతిప్పి చూశాడు. అగ్గిపుల్ల వెలిగింది. ఆ వెలుగులో నిలువెత్తు అస్థిపంజరం. ఆ అస్థిపంజరం అగ్గిపుల్లమీద నోటితో వూదింది. మళ్ళీ ఎర్రని పెద్ద మంట.

అలాగ నాలుగువేపులా నాలుగుఅస్థిపంజ రాలూ నాలుగేసి మంటలూ లేస్తున్నాయి. అగ్గిపుల్ల వెలిగించడం దానిమీద ఊదడం, మంటలు లేవడం జరిగింది.

మరొకరైతే గుండెఆగి చనిపోయే వారు అది చూశాక!

కాని మురళి ఆలోచించాడు. దయ్యాలకీ అస్థిపంజరాలకీ కూడా అగ్గిపుల్లలెందుకో, నోటిలోనుంచే మంటలు పుట్టించలేవా?- అనుకున్నాడు. ఇదేదో మోసమే!

సర్కసుల్లోనూ, మహంకాళి జాతర ల్లోనూ దివిటీలమీద పుక్కిటనున్న కిరోసిన్‌ని ఊది మంటలు లేపడం తనూ చూశాడు. ఇంక తేలవలసింది ఇవి నిజంగా కంకాళాలేనా అనేది. నిజంగా దయ్యాలు మీదపడ్డా కలియబడటానికిముందే నిర్ణ యించుకున్నాడు గనుక చూద్దాం అను కున్నాడు.

నాలుగువేపులనుంచీ నోటిలోనుంచి మంటలు చిమ్ముకుంటూ నాలుగు అస్థి పంజరాలు చెట్టుమొదటికొచ్చాయి.ఎలాంటి శబ్దాలూ చెయ్యకుండా గిరగిరా తిరగ సాగాయి. నెత్తిమీద నిప్పులకుండ. దానికి

 

చుట్టూ కన్నాలున్నాయి.

మెల్లమెల్లగా ఒకో కొమ్మ దిగి ఎనిమిది అడుగుల ఎత్తున్న కొమ్మ మీదినుంచి గమనించసాగాడు. నిప్పు రాజుకుని ఓకుండలో నుంచి మంటలేచింది. అస్థిపంజరాలు బాగానే కనిపిస్తున్నాయి. గోచీకట్టుకున్న నగ్నశరీరంమీద సున్నంతో అస్థిపంజరం లాగ ఒంటిమీద దిద్దారు. ఎవరో కిరాయి బాపతుమనుషులే అని అర్థంచేసుకున్నాడు. దిగేదాకావుంది ఎలాగూ తనని చంపిగాని వెళ్ళరు. అలాటప్పుడు ఇంక ఆలస్యం చెయ్యడం అనవసరం. 'లడాయి హల్లేడి ఫ్రాయ్ తల్లేడీ' అనే పంజాబీ సామెత గుర్తుకి వచ్చింది. దెబ్బలాటలో జాప్యం, టీ తాగడంలో తొందర పనికిరాదని దానర్థం. గబగబా మెరుపుదాడిచేసి నాలుగు దెబ్బలు ముందుగా కొట్టినవాడే గెలిచే అవకాశాలుంటాయి. దీని మెల్లిగా సేవిస్తేరానురాను రుచికరంగా వుంటుంది.

అనుకోవడమే తడవుగా ఒకడిమీదికి ఎనిమిది అడుగుల ఎత్తునుంచి దూకుతూ అతడి ఛాతీమీద తన్నాడు. తలవని తలంపుగా జరిగిన ఆ సంఘటనకి మిగతా అస్థిపంజరంరాయుళ్ళు కూడా బిత్తర పోయారు.

ఆ పడటంలో మురళి కూడా బేలన్సు తప్పి కిందపడ్డాడు. కాని పడిన వెంటనే స్ప్రింగ్‌లాగా లేచే అలవాటు ప్రకారం లేస్తూ వుండగా ఓ అస్థిపంజరం మీదకి దూకింది. మీద పడీపడకముందే ఓ తన్ను తన్నాడు. అది అతని పక్కటెముకల్లో తగిలింది. అసలే అంబాసడర్ షూ ఏమో- 'అమ్మా' అని అరుస్తూకిందపడ్డాడు వాడు. అంతే! మరి లేవలేదు. మొదట కిందపడిన వాడి తలకాయ మరి ఏ రాతికి తగిలిందో వాడూ లేవలేదు. కిక్కురుమన లేదు. ఫెయింట్ అయివుంటారు అనుకున్నాడు.

ఇంక మిగిలింది ఇద్దరు. ఇద్దరు తనని నిద్రలేపికూడా తన్నలేరు అనుకుని సంతోషించాడు.

మిగిలిన ఇద్దరూ ప్రత్యర్థి శక్తిని బాగా అంచనావేసుకున్నారు. అనువైన సమయం కోసం వేచిచూస్తూ మురళి మీదపడకుండా వాళ్ళని వాళ్ళు కాపాడుకుంటున్నారు.

ఒకణ్ని ఫ్లైయింగ్‌కిక్ ఇచ్చి నేల కరిపిస్తే మిగతావారిని కట్టి టౌన్కి ఈడ్చుకపోగలడు. వాణ్ని లక్నైనా నిజం కక్కించాలి అనుకుంటూ వుండగా వెనకనుంచి మరో ఇద్దరు వచ్చి మురళిని దొరకబుచ్చుకున్నారు. చెరో రెక్కా ఫల్లూకాలలా పట్టుకున్నారు.

ఎలాగ జరిగిందిది అని ఆశ్చర్యంలో మునిగిపోయాడు. నేలని పడివున్న ఇద్దర్ని దృష్టినుంచి తప్పిపోనివ్వలేదు. నలుగురూ తన ఎదుటనే వున్నారు. అంటే వచ్చింది ఆరుగురన్నమాట. ఇద్దరు ఎక్కడో దాక్కొని సమయంకోసం చూసి వెనక నుంచి మీదపడ్డారు.

ఆగి ఆగి బలమంతా ప్రయోగించి విదిలించాడు. లాభంలేకపోయింది. రెక్కలు రెండూ వెనక్కి విరిచికట్టి కాళ్ళలో కాళ్ళు పెట్టి వెల్లకిలా మురళిని పడదోశారు. మురళి ఎంత బలం ప్రయోగించినా ఎంత గింజుకున్నా వాళ్ళపట్టు సడలడం లేదు. ఇంతలో మిగిలిన ఇద్దరూ పెద్ద పలుకురాయిని లేపారు. ఆ రాయితో పథకం ప్రకారం మురళి తలకాయని వేసి గోపాలరావు తలకాయని చితకగొట్టినట్లు కొట్టాలని వారి పథకం!

ఇద్దరూ కాళ్ళూ చేతులూ కదలకుండా పట్టుకుంటే మిగతావాళ్ళు రాతిని తల కాయమీదకి జారవదిలేస్తారు.

ఒకడు అతికష్టంమీద రెండు చేతులను వెనకనుంచి వాటిమీద కూర్చుని రెండో వాడిని విడుదల చేశాడు. వాడు తలమీది నుంచి మురళి పొట్టమీదుగా కాళ్ళమీద పడ్డాడు. ఒక కాలిమీద కూర్చుని రెండో కాలిని రెండు చేతులతో పట్టుకోబోయేడు. ఆ సమయం చాలా ప్రమాదమైంది. మురళి సర్వశక్తులూ కూడదీసుకుని ముడుకులో కాళ్ళమీది వాడిని ఒక్కతోపు తోశాడు. బేలన్సుపోవడంలో కాలువదిలాడు. ఆకాలితో మళ్ళీ లేవబోతున్న వాడి పొట్టలో తన్నాడు. వాడు తూలిపోయి రాతినిలేపి పట్టుకున్న కంకాళరాయుళ్ళమీద పడ్డాడు. రాయిదబ్బున కిందపడింది. రెండు మణుగుల బరువుకన్నా ఎక్కువే. అది తలకాయమీదపడితే నుగ్గునుగ్గు అవడం ఖాయం.

మురళి చేతుల్ని మాత్రం వెనకవాడు చాలా గట్టిగా పట్టుకున్నాడు.

ముగ్గురు వుండికూడా మురళి కాళ్ళని పట్టుకోబోయి ఎన్నోతాపులుతిన్నాడు. చివరికి ఎలాగో తంటాలుపడి ముగ్గురూ కాళ్ళు అదిమిపట్టారు. ఒకడు రెండు కాళ్ళమీదా కూర్చున్నాడు. మిగతా ఇద్దరూ మళ్ళీ ఆ రాతిని లేపారు.

పాతికేళ్ళనాడు నాన్నగారికి కూడా ఇలాగే జరిగివుంటుంది. ఆనాటి సంఘటన కళ్ళకి కట్టినట్లయింది. తనకన్నా నాన్న ఎంత ధైర్యవంతుడై వుండాలి. తెలిసివుండి కూడా తానీ ఉచ్చులో చిక్కుకున్నాడు. తెలియక నమ్మకద్రోహి అయిన చిన్నాన్న మోసంవల్ల ఆయన చనిపోయాడు. ఇంక తనని ఆ దేవుడు కూడా రక్షించలేడు. లోహంని లోహంతోనే కొయ్యాలి. మోసాన్ని మోసంతోచే గెలవాలి-అని తెలిసివుండి కూడా ఇలాగ దొరికిపోయాడేం? ఎంతమంది శిష్యగణం వున్నారు. ఎంతమందినైనా చితకబొడి చేస్తాను అనే నిబ్బరమే ఈ ప్రమాదాన్ని తెచ్చిపెట్టింది. నాన్నా! నీకు జరిగిన అన్యాయమే నాకూ జరిగింది. నీకు జరిగిన అన్యాయానికి పగ తీర్చుకోలేక పోతున్నాను అనుకున్నాడు.

రాతిని ఇద్దరూ చెయ్యెత్తు లేపారు. వీలు చూసుకుని మురళి తల మీదకి రాయిని కుదెయ్యాలనుకుంటున్నప్పుడు ఓ అద్భుతం జరిగింది. రాయి మురళి తల మీదకి రాకుండానే వెనక్కి పడిపోయింది.

ఎటునుండి వచ్చారో నలుగురు కరాటే యోధులు విజృంభించి ధనాధనామని తన్నడం మొదలుపెట్టారు. మురళిని పట్టుకున్న ఇద్దర్నీ వెనుకనుంచి తన్నారు. వాళ్ళు మురళిని వదిలిపెట్టారు. అదిమి పట్టివుంచిన స్ప్రింగులాగా ఛంగున వాళ్ళమీదకి దూకాడు మురళి.

నాలుగు దెబ్బల్లో అందరూ కింద పడ్డారు.

ఆ చీకటిలో తనను వచ్చి ఆదుకున్న దెవరో మురళికి అంతుపట్టలేదు. అందరూ వాళ్ళనందర్నీ పెడరెక్కలు విరిచి కొట్టారు. మురళి ఒళ్ళు విరుచుకుని టార్చిని వాళ్ళ ముఖాలమీదకి వేశాడు.

ముందుగా ప్రసాద్ కనిపించాడు.

"ప్రసాద్ ... నువ్వా! సమయానికి వచ్చావు లేకపోతే అన్యాయానికి బలై పోదును" అన్నాడు కృతజ్ఞతాపూర్వకంగా.

మిగతావాళ్లు కూడా మురళి శిష్యులే. వాళ్ళ గురువుగారిని నేర్చుకున్న విద్యతో ఆదుకున్నారు వాళ్ళ కరాటే, జూడో విద్య నిజంగా ప్రదర్శించే అవకాశం వాళ్ళకి దొరికిందినాడు.




ప్రసాద్ ఆ రౌడీలతో, "ఎవరు మీరు? చెప్పకపోతే ఇక్కడే ప్రాణాలతోటే ఈ ఏటి ఇసకలో గొయ్యితీసి కప్పేస్తాం" అని అడిగాడు.

వాళ్లు మౌనంగా వుండిపోయారు.

"నోరు విప్పుతారాలేదా? అడుగుతున్నది వినిపించిందా?" అని మిత్రులలో ఒకడు లాగి దవడమీద ఇచ్చాడు.

వాళ్ళు అలాంటి పిడుగు దెబ్బలు ఎప్పుడూ తినలేదు. మరి ఇవేం దెబ్బలో! ఈ దెబ్బల వేగమే వేరు.

గలగలమని నాలుగు పళ్ళు రాలి పోయాయి.

"చెప్పండి త్వరగా. లేకపోతే పళ్ళన్నీ ఊడగొట్టి దండలేసి పంపిస్తాం" అన్నాడు మళ్ళీ అతను.

ఒకడు ఆ పళ్ళు రాలడం చూసి గబగబా, "మాది పొరుగూరండి. మీ వూరి రాఘవయ్య ఈరోజు రాత్రి పన్నెండు గంటల తరవాత ఈ దయ్యాల మర్రి చెట్టు ఎక్కినవాణ్ణి చంపెయ్యమని ఐదువేలిచ్చాడండి. మా మీదకి ఏ కేసూ రాకుండా చూసుకుంటానన్నాడండి. పని పూర్తిచేసిన తరవాత మరో ఐదువేలిస్తానన్నాడండి. బుద్ధి గడ్డితిని ఈ పని చేశాం" అని నిజం కక్కాడు.

ప్రసాద్ అందుకని, "ఇదే నిజాన్ని మా వూళ్ళో పదిమందిలో చెప్పకపోతే మీ ఒళ్ళు ఒలిపించేస్తాను...నడవండి" అని ఒకణ్ణి ముందుకి తోశాడు.

వెనక చేతులు కట్టెయ్యడమేగాక వాళ్ళనందర్నీ ఓ మోకుతో కలిపి కట్టారు.

* * *

రామాలయం దగ్గర ఊరందరూ మురళి కోసం ఎదురుచూస్తున్నారు.

రాఘవయ్య, అతని సుపుత్రుడు భాస్కర్ శుభవార్తకోసం కాచుకుని వున్నారు. ఆలస్యం అవుతున్నకొద్దీ వాళ్ళ ముఖాలు సంతోషంతో వెలుగుతూ వున్నాయి.

అంతలో దూరంనుంచి కొందరి మాటలు వినిపించసాగాయి. అందులో మురళి గొంతుక, ప్రసాద్ గొంతుక వినిపించగానే వాళ్ళ గొంతులో పచ్చి వెలగకాయ పడింది. ఏమైవుంటుంది అనుకున్నారు.

'ఆ రౌడీనాకొడుకులేమైనారు. ఈ ముదనష్టపు ప్రసాద్ అక్కడికెలా తగలడ్డాడు' అని రాఘవయ్య ఆలోచించసాగాడు.

'రానియ్యి. ప్రసాద్‌ని తోడుతీసుకుని వెళ్లాడని బుకాయించి అయిదువేలూ లాక్కుంటాను' అని భాస్కర్ ఆలోచించాడు.

తరవాత చాలా గొంతుకలు వినిపించాయి.

పెడరెక్కలు విరిచికట్టిన రౌడీలను ముందుకి తోసుకుంటూ ప్రసాద్, అతని మిత్రులూ, వారి వెనక మురళి ట్యూబ్ లైట్ వెలుగులోకి వచ్చారు.

రాఘవయ్య గుండెల్లో రాయిపడింది. ఏం అబద్ధాలాడాలి. ఎలా ఈ గండం నుంచి తప్పించుకోవాలి అని ఆలోచించసాగాడు.

దేవాలయం దగ్గర పందెం ఫలితం తెలుసుకుందామని ఎదురుచూస్తున్న జనం ఆ కొత్తగా కట్టేసివున్న ఆగంతకులెవరా అని చూస్తున్నారు.

ప్రసాద్, మిగతా మిత్రులు రౌడీలని పరసగా వెలుతురులో నిలబెట్టారు.

మురళి భాస్కర్‌ని రమ్మని పిలిచాడు.

 

భాస్కర్‌కి ప్రైప్రాణాలు పైనే పోయాయి. ఎముకలు పులుసులోకి లేకుండా ఏరేస్తాడని భయపడ్డాడు.ఆనాడు బైరిదగ్గర అందరిలోనూ పట్టిన పట్టును మరిచిపోలేదు. మళ్ళీ ఇందరిలో ఓ పట్టు పడితే ఇంక ఉరిపోసుకుని చావడం నయం అనుకున్నాడు.

భయం భయంగా ముందుకి వచ్చాడు. సంచిలోంచి అతడి చొక్కా తీసి భాస్కర్‌కి అందిస్తూ, "ఇదిగో...ఇదేనా నీ చొక్కా?" అని అడిగాడు మురళి.

"ఇదే ప...పందెంలో నువ్వే నెగ్గావు. పొ ... పొరపాటయిపోయింది. క్షమించు అన్నయ్యా" అంటూవుంటే నోరు తడబడి పోయింది.

"క్షమించాలా మిమ్మల్ని. చెయ్యరాని నేరాలుచేసేసి క్షమించమనడం ప్రతివాడికి అలవాటైపోయింది. వీళ్ళు.." అని రౌడీల వేపుచూపి, "ఈ రౌడీలు నన్ను చంపేసి వుంటే ఎవరు దానికి బాధ్యులు? ఆనాడు మానాన్న చనిపోతే ఈ ఊళ్ళో ఎవరికైనా పట్టిందా?"

అందరివేపూ చూసి,"మీరంతా పెద్దలు.. న్యాయం చెప్పండి. పందెంకాసి, నన్ను పందానికి పురికొల్పి ఈ గూండాలని నన్ను దయ్యాలమర్రి దగ్గరే చంపెయ్యమని పంపించారు. ఇది ధర్మమేనా? సమయానికి ప్రసాద్ నా మిత్రులతో రాబట్టి సరిపోయింది. లేకపోతే ఈపాటికి ఆ మర్రిచెట్టుకింద మురళి ఆనాడు వేణుగోపాలరావులాగ తల చితికి చచ్చిపోయి వుండేవాడు" అన్నాడు కోపంగా.

రాఘవయ్య అయోమయంగా ఏమీ ఎరగనట్లు ముఖంపెట్టి, "ఏమిటి... గూండాలేమిటి? నిన్ను చంపమని నేను పంపడం ఏమిటి??" అని బుకాయించబోయాడు.

ప్రసాద్ కిరాయి రౌడీలవేపు చూసి, "జరిగింది వీళ్ళందరికీ చెప్పండి" అని పురమాయించాడు.

వారిలో ఒకడు, "నిజమే బాబులూ... మమ్మల్ని క్షమించండి. లేకపోతే చంపెయ్యండి. ఈ రాఘవయ్య మా వూరు వచ్చి మా అయ్యకి అయిదువేలు అడ్వాన్సుగాయిచ్చి ఆదివారం అమావాస్య రోజున మా వూరి స్మశానంలోని దయ్యాల మర్రిచెట్టు అర్ధరాత్రి దాటిన తరవాత ఎవడు ఎక్కుతాడో వాడిని తలకాయ చితకగొట్టి చంపెయ్యమన్నాడు. పని పూర్తయిన తరవాత మరో అయిదువేలు ఇస్తానని చెప్పాడు" అన్నాడు-రోటిలో తలపెట్టి రోకటిపోటుకి జంకనివాడిలాగ.

జనంలో ఉద్రేకాలు పెరిగాయి. రాఘవయ్యని నమిలి మింగేద్దామన్నంత కోపం అందరికీ వచ్చింది. రౌడీలని కూడా పచ్చడిచేసేద్దాం అని కూడా కొంతమందికి అనిపించింది.

జనంలోనుంచి ఒకడు,"అయిదువేలిస్తే మనిషిని చంపేస్తార్రా మీరు. మనిషి ప్రాణం అంటే అంత చవకగా వుందా మీకు?" అని వాళ్ళమీదకి వెళ్ళబోయాడు.

"బుద్ధిగడ్డితిని ఈ పని చేశాం. ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యం. మీ ఊరి జోలికి రాము. మీ కాళ్ళు పట్టుకుంటాం. మమ్మల్ని వదిలెయ్యండి" అని బతిమాలారు.

కాసేపు విశ్రాంతి తీసుకుని వద్దాం- అని జగన్నాథరాజుగారు ఇంటికి వెళ్ళారు. రౌడీలు మురళిని చంపబోవడం మొదలైనవి తెలిసి బలరామయ్య, ఇంకా చాలామంది పెద్దలు వచ్చేశారు.

సురేఖ అంతకుముందే వచ్చి మురళిని

చూసింది. ఆమె ప్రాణం కుదుటపడింది.

"ఇదేం పనయ్యా రాఘవయ్యా! ఎలక్షనులో ఓడిపోతేమాత్రం, పాలివాడి మీద నీకెంత పగవుంటే మాత్రం ఇంత ఖూనీకోరు పనిచేస్తావా?" అన్నారు జగన్నాథరాజుగారు కోపంగా.

"నాకేం తెలీదండి! మీళ్ళెవరో లేనిపోనివి కల్పించి చెబుతున్నారు. దొంగతనాలకి వచ్చి దోచుకోవడానికి వాడిమీదపడి వుంటారు" అన్నాడు రాఘవయ్య.

ఇందాక చెప్పినవాడే, "ఏ బాబయ్యా.. పోనియ్యిగదా అని మెల్లిగా మాట్లాడు తుంటే మామీదకి తోస్తున్నావు. నువ్వు పాతికేళ్ళక్రితం కూడా ఒక మనిషిని చంపించావని మా అయ్య చెప్పాడు.'మీరు, చంపెయ్యండి. ఏ గొడవాలేకుండా అతడు చూసుకుంటాడు' అని డబ్బు అడ్వాన్సు తీసుకుని మమ్మల్ని పంపించాడు" అని తెగేసి అందరిముందూ చెప్పాడు.

రాఘవయ్యకి భయంవేసింది. కాళ్ళ బేరంతప్ప వేరే గత్యంతరంలేదు అను కున్నాడు.

జగన్నాథరాజుగారు మురళినుద్దేశించి, "పోలీసు రిపోర్టివ్వవోయ్. ఇలాంటికేసుని వదిలెయ్యకూడదు. తొత్తుముండాకొడుకు. ఎంత పగలుంటేమాత్రం ఇవాళ నీ మీద గూండాలనుపయోగించాడు. రేపు మరొక రితో విరోధం పెట్టుకుని ఇలాగే చేస్తాడు" అన్నారు.

అందరూ పోలీసు కేసు పెట్టాలని ఒకటే గొడవ చెయ్యసాగారు.

సింహాద్రి అనే ఆయన, "మురళీ...వీడిని వదిలిపెట్టొద్దు. నాకు ఆరోజు ఏమి జరిగిందో తెలుసును. పాతికేళ్ళక్రితం మీ నాన్న కూడా ఇలాగే చచ్చిపోయాడు. వీడి మాయ తెలుసుకోలేకపోయాడు ఆ ధర్మాత్ముడు. తండ్రిలాంటి అన్నయ్యని ఆస్తి, హోదా కోసం చంపిన మహా పాపిష్టోడు. నేను సాక్ష్యముంటాను. నువ్వు కేసుపెట్టు" అన్నాడు.

బలరామయ్యకి వేణుగోపాలరావు కుట్ర వల్ల చనిపోయాడని తెలుసుకోగానే కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఓరి దౌర్భాగ్యుడా! అలాంటి దేవుణ్ణిచంపించడానికి నీకు మనసెలాగ ఒప్పిందిరా. నీ ముఖం చూస్తే పంచమహా పాతకాలు. మురళీ... వీడిని వదలవద్దు.. కేసు పెట్టు. నాపలుకుబడి అంతా వాడి వీడిని తోయిస్తాను జైలు లోకి" అన్నాడు కోపంతో. అతడి కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.

రాఘవయ్య తల వంచుకున్నాడు.

జగన్నాథరాజుగారికి ఒళ్ళుమంట ఎక్కువయింది. "ఏవయ్యా రాఘవయ్యా! బెల్లంకొట్టిన రాయిలాగా ఊరుకుంటే సరిపోదనుకుంటున్నావా ? ఎందుకిలాగ చేశావో చెప్పు" అన్నాడు. కోపంవస్తే అతను మనిషికాడు.

"నేను చేసింది తప్పే. నన్ను వెళ్ళ నియ్యండి. రేపు మీకందరికీ సంజాయిషీ చెప్పుకుంటాను" అని అక్కడినుంచి కదలబోయాడు.

ప్రసాద్ అడ్డం వచ్చి, "ఎక్కడికి? ప్రాణాలతో ఇంటికి వెళదామనేముందు చేసిన నేరాలకి జనం అందరికీ సంజాయిషీ చెప్పు" అని హూంకరించాడు.

తప్పు చేసేదాకానే ఏ మంచీ మన్యాదైనా. తప్పు చేసేంతరవాత ఎవ్వడైనా మలకనే.మేకపోతు గాంభీర్యం ప్రదర్శించ బోయాడు. కాని లాభం లేకపోయింది. పబ్లిక్ గా దొరికిపోయాడు. జనం రెచ్చి పోయారంటే తలో దెబ్బ వేస్తారు. తన

పరువు ప్రతిష్టలెలాగూ మంటకలిశాయి. కాని పౌరుష హీనం అవుతుంది- అనుకుని భయపడ్డాడు.

"చంపుతారా?" అన్నాడు.

"అది నీకున్న వెధవబుద్ధి. ఆ వెధవ బుద్ధితో ఆనాడు అన్నని చంపి నువ్వు నాయుడి వయ్యావు. ఈనాడు కొడుకు లాంటి మురళిని చంపి నీ కొడుకుని మరో నాయుణ్ని చెయ్యాలనుకున్నావు. కాని మేము నిన్ను చంపము. చేసిన తప్పు ఒప్పుకోకపోతే ఎముకల్ని ఏరేస్తాము. ఆర్నెల్లు మంచాన పడతావు...జాగ్రత్త" అని బెదిరించాడు ప్రసాద్ మళ్లీ.

"మీరేంచేస్తారో చేసుకోండి" అని చివరి ప్రయత్నంగా కదలబోయాడు.

ప్రసాద్ "పెద్దవాడివిగదా అని మర్యాదిస్తే నిలుపుకోలేదు" అని రాఘవయ్య గుండెలమీద చెయ్యేసి మండపం మధ్యకి తోశాడు.

భాస్కర్‌పరిగెత్తబోయాడు.నరసింహం, జగన్నాథం పట్టుకుని లాక్కొచ్చారు.

రాఘవయ్యకి ముందు నుయ్యీ వెనక గొయ్యీ అయింది. బుద్ధిగా చేసినతప్పుకి సంజాయిషీ చెప్పుకున్న తర్వాత కూడా రేచుకుక్కల్లాగ చీరేసేలా వున్నారు. మురళీ శిష్యగణంచాలు, తలోకండా పంచుకుంటారు. ఇంకా తనని కాపాడగలిగిన వాడు మురళే. వాడుక్షమిస్తేమిగిలినవాళ్లు కుక్కిన పేనుల్లాగా పూరుకుంటారు.

కాగలకార్యం గంధర్వులే తీరుస్తున్నారని, తన తండ్రికి జరిగిన అన్యాయం నిరూపింపబడి హంతకుడు ఎదురుగా వున్నా, గొంతు నులిమి చంపాలనే ఉద్దేశం వున్నా తనకున్న బాధ్యతలవల్ల కోపాన్ని దిగమింగి పూరుకున్నాడు. బాధ్యతగల పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగా తను ఊరుకున్నా ప్రసాద్ వదిలిపెట్టడని అర్ధంచేసుకున్నాడు.

రాఘవయ్య అందరూ ఊహించని విధంగా ఒక్క ఉదుటున పరిగెత్తి పక్కనేవున్న మురళి పాదాలమీద పడ్డాడు.

"మురళీ...నన్ను క్షమించరా! మీ అమ్మకి, నీకు నేను చాలా అన్యాయాలు చేశాను. నువ్వే నన్నూ నా కుటుంబాన్ని ఆదుకోవాలి" అనివలవల ఏడ్వసాగాడు.

మురళి కాళ్ళు వెనక్కి లాగేసుకుని దూరంగా జరిగాడు.

ఎటూ తప్పించుకునే దారిలేక కాళ్ళ మీద పడ్డాడనీ, అది దొంగ ఏడుపనీ అందరికీ అర్థమైంది.

"మురళీ...నువ్వు పీడి దొంగ ఏడుపులకి కరిగిపోవద్దు. రేపు వెళ్ళి పోలీసు కంప్లెయింట్ సాక్ష్యాధారాలతో సహా ఇద్దాం" అన్నాడు ప్రసాద్.

రాఘవయ్య ప్రసాద్‌తో, "బాబూ... చచ్చి నీ కడుపున పుడతాను. వాడిని పురెక్కించకు. మురళీ...నువ్వు క్షమించే దాకా వదలనురా" అని మళ్ళీ కాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు.

మురళి "ముందు నా కాళ్ళు వదులు" అన్నాడు చిరాకుగా.

కాళ్లు వదిలేసి మురళి చేతులు పట్టుకుని బతిమాలసాగాడు.

మురళి జగన్నాథరాజుగారు, ఇతర పెద్దలనుద్దేశించి, "రాజుగారూ...మీరందరూ అనుమతిస్తే రెండు షరతుల మీద ఈయనని వదిలేస్తానండీ" అన్నాడు.

అక్కడ వున్న మురళి మిత్రులు, "వదలడానికి వీల్లేదు. ఊరిని ఇంతకాలం పీడించి అందర్నీ నానా తిప్పలు పెట్టిన వీణ్ని జైల్లో తోయించాలి" అన్నారు

 

ఏకకంఠంతో.

ప్రసాద్, "హత్యకి ఏడేళ్ళు, హత్యా ప్రయత్నానికి మూడేళ్ల జైల్లో గడిపితేగాని వీడు మళ్ళీ ఊళ్ళో బతకడానికి వీల్లేదు" అన్నాడు.

మురళి, "పోనీలే ప్రసాద్! కాళ్ళమీద పడ్డాడు. క్షమాభిక్ష పెడదాం ... అదైనా నేను పెడుతున్న షరతులకి ఒప్పుకుంటేనే" అన్నాడు.

రాఘవయ్య, "ఏ షరతులైనాసరే...నా సర్వస్వం నీకర్పిస్తాను. నా పరువు కాపాడు" అని బతిమిలాడసాగాడు.

మురళి "మొదటి షరతు—నువ్వు మా అమ్మకు ఎంత ద్రోహం చేశావో నీకు తెలుసును. అందుకని నేను ఏర్పరచే పంచాయితీలో పదిమందిలో మా అమ్మ కాళ్ళమీద పడాలి. నేను ఆమెని రప్పిస్తాను. నువ్వు చేసిన పనికే ఆమె ఈ వూళ్ళో అడుగుపెట్టడం లేదు. నువ్వు కాళ్ళమీద పడి క్షమాపణ కోరుకుంటానంటేనే వస్తుంది" అన్నాడు.

"ఒక్కసారికాదు...వందసార్లు పడతాను. దేవతలాంటి వదిన కాళ్ళమీద పడడానికి సిగ్గెందుకు. రెండో షరతు చెప్పు" అన్నాడు తొందరచేస్తూ.

"భూమి పంపకాలలో నువ్వు మాకు అన్యాయం చేశావు. అదీ కాకుండా మా వాటా భూమిని అన్యాయంగా మరొకరిని పోటీకి రానివ్వకుండా బెదిరించి కారుచవకగా కొనేశావు. అదే ధరకి మళ్ళీ మా పదెకరాల భూమిని ఇరవైవేలకే క్రయ చీటీ రాయాలి. మా అమ్మ పేరనే రిజిస్ట్రేషను చెయ్యి" అన్నాడు.

"ఇరవై వేలకా! ఎకరం ఇరవై వేలు చేస్తుందా భూమి" అన్నాడు భయం భయంగా.

"ఏం..ఆ రోజుల్లోనే ఎకరం ఐదువేలు చేసే భూమిని మొత్తం పదెకరాలనీ 20 వేలకి నువ్వు కాజెయ్యలేదా? ఎవ్వరైనా భూమిని కొనడానికి పోటీకి వస్తే వాళ్ళ అంతుచూస్తానని బెదిరించలేదా? ధరలు పెరిగాయి...నిజమే. ఇంత కాలం నీ డబ్బుకి వడ్డీగా భూమి దున్నుకున్నావు. ఇందులో అన్యాయం, నష్టం ఏముంది? నీ ఇష్టం...నష్టం కష్టం అనుకుంటే మానెయ్యి" అన్నాడు.

ప్రసాద్ "మురళీ...నువ్వొక పిచ్చివాడివి. వీడు మంచి పనులు చెయ్యడానికి పుట్టలేదు. రావణాసురుడు. రేపు జైల్లో పోలీసులు అసహ్యమైన పనులూ చేయిస్తూ లాఠీని ముఖం మీద ఆడిస్తుంటే బుద్ధొస్తుంది. రేప్పొద్దున్నే కోడుకుపని చెబుతాను. నువ్వు పట్టించుకోకపోతే రేపు కేసు పెట్టడానికి కోర్టుకు నేను వెళతాను'' అన్నాడు.

"ఇంతదాకా వచ్చిన తరవాత ఇంకేముంది. ఈ షరతుకి నేను ఒప్పుకుంటాను. మీ అమ్మ పేర ఆ పదెకరాలూ ఇరవై వేలకే రిజిస్ట్రేషను చేయిస్తాను.మీ అమ్మని రప్పించు మురళి" అనేశాడు రాఘవయ్య.

మురళి అందరికీ నమస్కరించి, "ఇక్కడ జరిగినదానికి మీరందరూ సాక్ష్యం. రేపు మాట తిరిగిపోతే మీరే సాక్ష్యం రాజుగారూ'' అన్నాడు రాజుగారి నుద్దేశించి.

"మాట తిరగమను. నాలుక పీకేస్తాం. మేము లేమా" అన్నాడు ప్రసాద్.

జగన్నాథరాజు కిరాయి రౌడీలతో, "మిమ్మల్నికూడా జైల్లోకి తోయించేవాళ్ళమే. పళ్ళుదగ్గర పెట్టుకుని మసలండి. మళ్ళీ ఎప్పుడూ ఇలాంటి పాడుపనులు చెయ్యకండి" అని మందలిం

చారు.

ఏకకంఠంతో, "జన్మలో మళ్ళీ ఇలాంటి పనిచెయ్యం. మమ్మల్ని వదిలెయ్యండి" అన్నారు.

ప్రసాద్ వాళ్ళతో "ఏడు మాటతప్పితే నేను మీ వూరు వస్తాను. మీరు సాక్ష్యం చెప్పడానికి రావాలి" అని చెప్పి వాళ్ళ పేర్లు, వివరాలు రాసుకుని ఓ వాంగ్మూలం రాసి వాళ్ళందరిచేతా సంతకాలు, వేలి ముద్రలూ తీసుకున్నాడు.

అప్పటికి తొలికోడి కూసింది.

రౌడీలు, "మమ్మల్ని వదిలేస్తే ఈ చీకట్లోనే వెళ్ళిపోతాం" అని బతిమలాడు కున్నారు.

అందరూ కూడబలుక్కుని వారికి హెచ్చరికలు చేశారు. కట్లు విప్పి వది లేశారు.

వాళ్ళు వినయంగా, "క్షమించుకోండి. మళ్ళీ మీ వూరు వేపు కన్నెత్తి చూడం" అని బతుకుజీవుడా అంటూ చీకట్లో కలసి పోయారు.

అందరూ రామాలయం వదిలి ఎవరి ఇళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు.




సురేఖ, మురళి ఇంటికి చేరారు. వాళ్ళ ముఖాలు సంతోషంతో వికసించాయి. హృదయాలు శాంతించాయి. మనస్సులు తేలికపడ్డాయి. అనుకున్నవి సాధించిన తృప్తిని మురళి ముఖంలో చూసిన సురేఖ పొంగిపోయింది.

ఇంటికి చేరి ఆసనాలూ, వ్యాయామం మొదలుపెట్టాడు.

సురేఖ, "ఈరోజైనా కాస్త నిద్ర పొండి బాబూ! ఈరోజూ మీకు వ్యాయామాలే.పండుగ రోజూ మీకు పాతపచ్చడే" అంది.

మురళి నవ్వుతూ, "నాకు ఈ వ్యాయామాలు రోజూ, చచ్చేదాకా తప్పవు పండగ రోజైనా నాకు పాత పెళ్ళాం నీకు పాత మొగుడూ తప్పవు" అన్నాడు.

సురేఖ సిగ్గుపడింది.

నిత్యకృత్యాలు తీర్చుకున్నారు.

మురళి సురేఖతో 'టెలిగ్రామ్' ఇవ్వడానికి చోడవరం వెళతానని చెప్పాడు.

''మీరంత శ్రమపడనక్కరలేదు. ఇదుగో టెలిగ్రామ్. పదిగంటలకల్లా అత్తయ్యా, మానాన్నా వస్తున్నారు" అని చూపించింది.

''ఎప్పుడొచ్చిందిది" అన్నాడు సంతోషంగా.

''నిన్న సాయంత్రం మీరు మీ రాచకార్యం హడావుడిలో ప్రసాద్ కోసం వెళ్ళారు. సర్‌ప్రైజ్ చేద్దామని చూపించ లేదు" అని తను రమ్మని ఉత్తరం రాసిన సంగతీ, టెలిగ్రామ్ ఇచ్చిన సంగతీకూడా వివరించింది.

"సహధర్మచారిణి అనిపించుకున్నావు" అన్నాడు మురళి.

నిజమే. సురేఖ తను శ్మశానానికి వెళ్ళడానికి వీలులేదని అడ్డంపడితే ఏం చేసేవాడు. ప్రసాద్, అందరూ సురేఖకీ చెప్పకుండా వెళ్ళడం భావ్యం కాదన్నారు. అంత పెద్ద రిస్కు తీసుకుంటున్నప్పుడు చెప్పక తప్పదు అన్నారు. పులిని చంప

డానికి వెళ్ళినప్పటిలాగ అభ్యంతరం లేవ దీస్తుం దనుకున్నాడు. కాని, ఎంతో ప్రోత్సహిస్తూ ప్రికాషన్లుయిచ్చింది.

"మీరు తప్పకుండా వెళ్ళండి. ధర్మం మనవేపు వుంది. మనం వచ్చింది ఈ రహస్యాన్ని ఛేదించడానికే. జయంమనదే. యు కమ్ బేక్ సక్సెస్‌ఫుల్లీ'' అని ధైర్యం చెప్పి మరీ పంపించింది.

''సురేఖా! నేనొక సంగతి చెబుతాను.. ఏమీ అనుకోకు. మేనరికం మన ఇద్దరికీ ఇష్టం లేదు. మామయ్య ఋణం తీర్చు కోవడానికి అమ్మ మాట మీద నేను, మీ నాన్నని బాధపెట్టలేక, మరోమార్గం లేక నువ్వూ మన పెళ్ళికి ఒప్పుకున్నాం. కాని ఇప్పుడు నాకన్పిస్తుంది. నిన్ను మించిన భార్య నాకు ముల్లోకాలలో వెతికినా దొరికేది కాదు'' అని అంటూ వుంటే అతని కళ్ళలో నీళ్ళునిండుకున్నాయి.

"నేనూ అదృష్టవంతురాలినే బావా! నువ్వంటే నాకెప్పుడూ అయిష్టంలేదు. నాకపోతే సైన్సు స్టూడెంటుని గనక ఇలాంటి వివాహాలవల్ల సరియైన సంతానం కలగదని భయపడ్డాను" అంది.

మురళి ఎంతో దిగులుగా ముఖంపెట్టి, "ఆ లోపం కనిపిస్తూనే వుంది గదా సురేఖా" అన్నాడు ఎంతో బాధగా. "మన పెళ్ళయి మూడేళ్ళు కావస్తూంది" అని నిట్టూర్చాడు.

సురేఖ నవ్వుతూ, "నీకా అనుమానం వద్దు బావా! నాకు త్వరగా పిల్లలు ఇష్టం లేదని మా నాన్నతో చెప్పాను. హాస్పిటల్‌కి వెళ్ళాము. లూప్ వేయించుకున్నాను. ఇంక మన చిక్కులు తీరిపోయాయిగనుక నువ్వు కావాలనుకుంటే వచ్చేయేడాదినాటికి పిల్లాడో, పిల్లో మీ అమ్మ కాలక్షేపానికి పుట్టక మానరు" అని చెప్పింది.

"నిజంగానా! నువ్వెంత గడుసుదానివి" అని సురేఖని గుండెలకు హత్తుకుని గాఢంగా కౌగలించుకున్నాడు.

పదిగంటల బస్సులో ఆనందరావు, అన్నపూర్ణమ్మ వచ్చారు. ఊరంతా అట్టుడికిపోయింది.

ఆ రోజంతా మురళి ఇంట్లో కబుర్లతో గడిచిపోయింది. వచ్చేపోయే వాళ్ళతో ఇల్లంతా ఎంతో సందడితో నిండిపోయింది.

జరిగిన సంగతులన్నీ సురేఖ వివరంగా అన్నపూర్ణమ్మకీ, ఆనందరావుకీ వివరించింది. సంగతులన్నీ విని అన్నపూర్ణమ్మ కన్నా ఆనందరావు సంతోషించాడు.

అన్నపూర్ణమ్మ హృదయం పుత్రోత్సాహంతో నిండిపోయింది. తన పగ చల్లార్చిన కొడుకు, పదిమందెందుకు-కుంజరంలాంటి ఒక్కడు చాలు. తన జీవితం ధన్యమైంది అనుకుంది.

ఆ సాయంత్రం రామాలయం అంతా కిక్కిరిసింది. అన్నపూర్ణమ్మ వచ్చిన సంగతి, రాఘవయ్య మురళి కుటుంబానికి చేసిన ద్రోహం బయటికి పొక్కగానే అందరూ కథలు కథలుగా చెప్పుకున్నారు. పంచాయతీ చూడవలసిందే అనుకుని కొంతమంది స్త్రీలుకూడా పని మానుకుని వచ్చారు.

జగన్నాథరాజుగారు ఆరోగ్యం సరిగా లేకపోయినా వచ్చారు. బలరామయ్య, ప్రసాద్ మొదలయిన మురళి మిత్ర బృందం వచ్చి, అనువైన స్థలాలలో కూర్చుని లోకాభిరామాయణంలో దిగారు.

గ్రామ పెద్దలూ, పంచాయతీబోర్డు మెంబర్లూ అందరూ వచ్చారు.

మండపం వెలుగుతో నిండిపోయింది. మధ్యలో రెండు చాపలువేసి వున్నాయి.

వాళ్ళమ్మ రాగానే ఆలస్యం ఎందుకని




...చాయతీ కార్యక్రమం ప్రారంభం చేశాడు. రాఘవయ్యకి కబురు అందింది. అనుకున్న సమయానికి రాఘవయ్య కొడుకుని తీసుకుని మరీ వచ్చాడు.

అన్నపూర్ణమ్మ కోడలు సురేఖతో వేరే చాపమీద కూర్చుంది. ఎందరో ఆమెని చూసి అదృష్టవంతురాలు అనుకున్నారు.

రాఘవయ్య అన్నపూర్ణమ్మ కాళ్ళమీద సాష్టాంగపడ్డాడు.

ఆమె కాళ్ళు వెనక్కి లాక్కుని, "నీ పాపిష్టిచేతులతో నా కాళ్ళు ముట్టుకోకు దుర్మార్గుడా! చెప్పేదేదో అలాగే చెప్పు" అంది.

"వదినా! కళ్ళు నెత్తికెక్కి నేను నీకూ మురళికీ చాలా ద్రోహం చేశాను. అన్నయ్యని చంపించాను. మురళిని కూడా చంపాలనీ ప్రయత్నించాను. క్షమించరాని ద్రోహాలుచేసి క్షమించమని అడుగుతున్నాను. నన్ను క్షమించు. నీ కొడుకు దేవుడులాంటివాడు. మరొకడయితే నన్ను ఉరికంబానికి ఎక్కించేవాడు. నువ్వు క్షమించాలి. ఆ ఇరవై వేలకే మీ భూమి నీకు రేపే రిజిష్టరు నా ఖర్చులతోటి చేయిస్తాను" అన్నాడు సంభాషణ కంఠస్థం చేసినవాడిలాగ.

కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి. కన్నీటి చుక్కలు జలజల రాలాయి. నిజమైన పశ్చాత్తాపం అతని ముఖంలో కనిపించింది.

రాఘవయ్య, "జరిగిందంతా మరిచి పోదాం. నువ్వూ నా కొడుకులాంటివాడివే. నేను చేసిన తప్పులు మన్నించి భాస్కర్‌ని నీ తమ్ముడిలాగ ఆదరించు'' అని మురళిని ఉద్దేశించి అన్నాడు.

అన్నపూర్ణమ్మ, "మావలాంటి భేద భావాలెప్పుడూ లేవు. స్వార్థానికిపోయి ఒక్కటిగా వుండవలసిన కుటుంబాన్ని రెండుగా నువ్వే చీల్చావు. రేపే అబ్బాయి వచ్చిస్తాడు. ఆ రిజిస్ట్రేషను గొడవలేవో పూర్తిచెయ్యండి. ఇంక లే " అని చెప్పింది.

రాఘవయ్య, "అలాగే. రేపే చోడవరం వెళ్ళి రిజిస్ట్రేషను చేయిద్దాం" అని లేచాడు.

అందరూ సంతోషించారు.

బలరామయ్య తేలిగ్గా ఊపిరిపీల్చుకున్నారు.

అన్నపూర్ణమ్మ బలరామయ్యగారిని చూసి–''అన్నయ్యా! మీ ఋణం మేము ఏనాటికీ తీర్చుకోలేము. ఆనాడు పంపకాలలోనూ వాటిలోనూ సాయం చెయ్యకపోతే నేను ఏమయ్యేదాన్నో" అంది.

''దాందేముందమ్మా! నా ధర్మం నేను చేశాను. నేను కాకపోతే మరొకరు చేస్తారు. న్యాయానికీ, సత్యానికీ గెలుపు ఎప్పుడికీ తప్పదు" అన్నాడు.

"ఆనాడు ఆయనతో స్నేహం వలన మీరెంత నాకు సాయం చేశారో, ఈనాడు మీ అబ్బాయి ప్రసాద్ మా మురళికి అంత సాయం చేశాడు. నాకొక కూతురు లేనిలోటు ఇప్పుడు కనిపిస్తోంది. మీ ఋణం తీర్చుకుందును" అంది అన్నపూర్ణమ్మ.

''అంతమాటన్నావు చాలు. ఇప్పుడైతే మాత్రమేం. మా కోడలు సుశీల నీ కూతురనుకో'' అన్నాడాయన.

ఎవరి దారిన వారు అందరూ వెళ్ళిపోయారు.

ఆ మరునాడు అన్నపూర్ణమ్మ పొలాలన్నీ ఒకమారు తిరిగిరావాలని ముచ్చటపడింది. మురళి, సురేఖ, ఆనందరావు, అన్నపూర్ణమ్మ పొలంలోకి బయలు

దేరుతున్నారు.

అంతలో ఎయిర్ బాగ్ చంకన వేసుకుని శ్రీధర్ వచ్చాడు.

అందరూ ఆశ్చర్యపోయారు.

మురళి, "మెరుపులేని ఉరుములాగ ఇదేమిట్రా...నువ్విలాగ ఉత్తరం పత్తరం లేకుండా వూడిపడ్డావు" అన్నాడు.

"మీరెవ్వరూ లేకపోయేసరికి నాకు బోరుకొట్టింది. అదీగాక ఇక్కడ ఏం పుట్టిమునుగుతుందో అర్థంకాక అమ్మ పంపించింది'' అన్నాడు.

"వ్యాపారం ఎలాగుంది?"

"దివ్యంగా. నిన్ననే రెండు కలర్, ఒక బ్లాక్ అండ్ వైట్ అమ్మాం. నువ్వు లేకపోతే కుదరదునాయనా! నీ వ్యాపారం చెయ్యడం నావల్లకాదు. ఓ సినిమాలేదు, సరదా లేదు, సంబరంలేదు" అని దండకం చదవసాగాడు.

సురేఖ మురళితో, "ఉండండి...వీధిలో నిలబెట్టి వ్యాపారం వూసులు.రారా శ్రీధర్! కాస్త కాఫీ తాగుదువుగాని" అంది.

"నాకేంవద్దే అక్కా! అనకాపల్లిలో రైలు దిగగానే టిఫిను కొట్టేశాను.పదండి.. నేనూ వస్తాను. ఎక్కడికో బయలుదేరి నట్లున్నారు. నేనూ వస్తాను" అని బేగ్ ఇంట్లో పడేసి వాళ్ళతో బయలుదేరాడు.

పొలాలన్నీ తిరిగి వచ్చారు.

భోజనాల దగ్గిర మురళి ద్వారా ఊళ్ళో వుండాలా లేక పట్టణం వాపస్ వెళ్ళిపోవాలా అనే మీమాంసవచ్చింది.

మురళి, అన్నపూర్ణమ్మ ఊళ్ళోనే ఉండి పోవాలనుకున్నారు.

సురేఖ కూడా పట్టణం వచ్చే ప్రసక్తే లేదంది.

ఆనందరావు తికమకపడి, "ఏమమ్మా.. నీకూ ఈ ఊరి గాలి తగిలిందా?" అని ప్రశ్నించాడు.

"ఇక్కడ నాకున్న గుర్తింపు ఆ పట్టణంలో చచ్చినా రాదు నాన్నా! నేను ఈ ఊళ్ళోనే వుండి రానున్న తరాలలో పల్లెల్లోకూడా నిరక్షరాస్యులు లేకుండా చేస్తాను. చదువుకున్నవాళ్ళంతా పట్టణాలు పట్టుకుని పాకులాడుతుంటే ఇంక పల్లెటూళ్ళెలాగ బాగుపడతాయి నాన్నా" అంది.

"ఉపన్యాసాలు కట్టిపెట్టమ్మా! ఇందులో నీకు ఛాయిస్‌లేదు. వాడెక్కడుంటే నువ్వక్కడుండవలసిందేకదా. రాజీపడి ఇలా మాట్లాడుతున్నావు" అన్నాడు.

"పొరపాటు పడుతున్నావు నాన్నా! మొదట నువ్వనుకున్నట్లే ఈ పల్లెటూళ్లో ఎలా బతుకుతున్నారా అనుకున్నాను. ఎలాగ బతకగలనా అని భయపడ్డాను. కాని ఈ రెండేళ్ళలో ఇక్కడున్న ప్రశాంత వాతావరణం, లభిస్తున్న గౌరవం చూసి నాకు ఇంక ఇక్కడే చచ్చేదాకా వుండాలనిపించింది. అయినా ఇక్కడ లేనిదేముంది. రేపోమాపో విశాఖ పట్నంలో కూడా హైపవర్ ట్రాన్స్‌మీటర్ మొదలుపెడితే మీలాగే మేమూ రంగుల్లో దూరదర్శన్ కార్యక్రమాలు తిలకిస్తాం. ఏ ఉద్యమాలూ, విప్లవాలూ, గొడవలూ జరిగినా పట్టణాల్లోనే జరుగుతాయి. ఇక్కడున్నంత రక్షణ అక్కడేదీ? కరువులూ కాటకాలూ వస్తే తనకుమాలిన ధర్మం రైతూ చెయ్యడుగనక మాడి చచ్చేది పట్టణవాసులే అని గుర్తుంచుకోండి. పల్లె జీవితమే హాయి నాన్నా" అని ఉపన్యాసం ఇచ్చింది సురేఖ.

"నీతో మాటలాడి నెగ్గగలమా అమ్మా" అన్నాడు ఆనందరావు. ★




# ముద్దు మందారాలు...



సీమచింతపువ్వు సుమా సిసింద్రీ నవ్వు
గిలిగింతలివ్వు కాని గిల్లిపోకు నువ్వు



ఆత్మీయరూపం—ఆరు రుతువులూ పూసే పుష్పం
షోకిల్లా ఫాషన్లొద్దు—తనుగా రేకులు
విచ్చుకుంటేనే ముద్దు



కాశ్మీరం కొలువుదీరిన మోము-కాంతి రేఖలు
నోచుకునే నోము
పేరంటమాడే ఆలోచనమ్మ-కోరుకుంది నెరవేరే
దీవెనలిమ్మ



గుమ్మాన దిగులు కాసిన అమ్మడు – గమ్మున
మొగ్గలు రాల్చిన రెమ్మడు
'ఏమ్మా' అని లాలించి అడుగు – 'మరమ్మా' అని
చివురులు తొడుగు



తప్పు చేసెనుపో బుడుగు–ముప్పు తెచ్చెనుగా నీ
దుడుకు
కప్పు ఆశనిచ్చి అడుగు–చెప్పు తానేసిన
తప్పుటడుగు



గిల్లికజ్జాలు కుళ్ళిన నిమ్మకాయ–వారవర్జ్యాలు
పెళ్ళికోయి 'తమ్మ' కాయ
స్నేహానికి స్నేహమే బదులయ–చేయి చాచినపుడె
చెలిమి చేయవయ



చెరిసగమని బాసచేసి చెల్లి-చిరుగాలి నడుగు
ఆకాశమల్లి
కాజేయకన్నీ కల్లబొల్లి కథలల్లి-ఆశచెల్లి, కలత
చెందు కలలవల్లి



అ, ఆలనాడు చిట్టిపాపాయి-పాఠమంటే
పారిపోవు బడుద్దాయి
భయాలుకాదు కొట్టి చెప్పేయి-చదువెంత చలవో
చెప్పి చక్కదిద్దోయి



చిన్న మనసుకన్ని ఆలోచనలె—కొన్ని
చదివినంతనె చేయుసాలోచనలె
చేరి నేర్పకండి చెడుబుద్ధులె—కోరి చేయకండి
కడు ముద్దులె



చిన్నారిచిలక పాడుపాట—చిటారు కొమ్మన
చిట్టి తాయిలం
పొన్నారి గిలకపాపడి బాట—నట్టింటిక
నడిచొచ్చే భవితవ్యం

# చతుర కథలు

## 'కథ' వెనుక కథ

అప్పారావ్ హడావుడిగా గదిలోకి వచ్చాడు. అతడి చేతిలో ఓ దస్తాడు తెల్ల కాగితాలూ, పెన్నూ వున్నాయి. అతని తలంతా చెరిగిపోయివుంది. కళ్ళు ఎర్రగా వున్నాయి. ఇంకా పరీక్షలకి మూణ్నెల్లు పైముంది. వీడిప్పట్నించే చదువు ప్రయత్నాలు మొదలుపెట్టటంచూస్తే నాకాశ్చర్యమనిపించింది. సంతోషం కూడా వేసింది.

చేతిలోని కాగితాలు టేబుల్ మీద పడేసి, కుర్చీ లాగి కూర్చొంటూ, "ఓ మంచి కథ చెప్పరా" అన్నాడు వాడు.

నేను నిర్ఘాంతపోయాను.

"ఏరా...తాగి వస్తున్నావా?" అన్నాను అనుమానంగా.

"నోర్ముయ్యిరా! నీవో కథ చెప్పు-చకచకా రాసేస్తాను" అంటూ కలాన్ని ఓగించి పట్టుకొన్నాడు.

వాడికి పిచ్చెక్కిందేమోనన్న అనుమానంతో "ఏమిటి?" అని రెట్టించాను.

"కథ రాయాలనుకుంటున్నాను" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.

"నీకీ పాడుబుద్ధి ఎప్పుడు పుట్టిందిరా?" అన్నాను ఆశ్చర్యంగా.

"నీకు నళిని తెలుసుగా" అన్నాడు పొగ విలాసంగా వదులుతూ. నళినిది మా క్లాసే. క్లాసుల్లోనే నవలలు, కథలు చదవడం ఆమెకు అలవాటు.

"నళినికి కథలన్నా, నవలలన్నా చాలా ఇష్టం. రచయితలంటే పడి ఛస్తుందిట" అన్నాడు అప్పారావ్.

"అయితే నీవు నళినిని ప్రేమిస్తున్నావా?" అని అడిగాను వాణ్ణి వింతగా చూస్తూ.

వాడు ఆనందంగా ముఖంపెట్టి, "నేనూహించిందానికన్నా తెలివిగలవాడివే" అంటూ ఓ సర్టిఫికెట్ ఇచ్చేసి, "అందుకే వచ్చాను నీ దగ్గరికి" అన్నాడు.

"మరి ఇంకొకళ్ళు చెప్పి, నీవు రాస్తే కథ నీది ఎట్లా అవుతుందిరా?" అన్నాను సాలోచనగా.

"ఎలాగైనా ఆ కథ నా చేతులతోనే రాస్తున్నాను గదా" అన్నాడు గర్వంగా చేతులు పైకెత్తి.

"నీమొహంలా వుంది. కథని నీవే సృష్టించి, రాయగలిగినపుడే నిన్ను 'రచయిత' అంటారు ఎవరైనా" అన్నాను లా పాయింట్ చెబుతూ.

"సరేలే...అయితే నేనే రాసుకుంటా ఓ కథని'' అన్నాడు వుక్రోషంగా.

తరువాత పేపర్లన్నీ సర్దుకుని ఒకవైపు పెట్టాడు. నేను పెన్నులో ఇంకు పోసి ఇచ్చాను.

"ఇంతకీ ఏ కథ రాయబోతున్నావు?" అని అడిగాను.

"ప్రేమ కథ"

"రైట్...ప్రొసీడ్"

అప్పారావ్ పోజుపెట్టి ఆలోచిస్తున్నాడు...రాస్తున్నాడు. వాడి ముఖంలో తదనుగుణంగా రంగులు మారుతున్నాయి. ఎట్లయితేనేం చివరికి నావైపు చూశాడు.

"అయిపోయిందా" అన్నాను ఆత్రుతగా



వాడు రాసిన పేజీ ఇచ్చాడు హుందాగా. వాడి చేతి రాత చూస్తే వాంతి అయ్యేట్లుగా వుంది. బలవంతాన చదవడం మొదలు పెట్టాను.

"ఒక వూళ్ళో ఒక కాలేజీ అనునది గలదు. అందులో ఒక మొగ స్టూడెంట్, ఒక ఆడ స్టూడెంటు చదువుచున్నారు..." అంటూ మొదలెట్టాడు.

ఇక చదవలేకపోయా. ఆ కాగితాన్ని కిందపెట్టి, బాధగా "ఇంకేదన్నా రాయ




కూడదా?'' అన్నాను.

"నోమ్మయ్! రచయితలను ప్రోత్సహించాలి కానీ ఇలా నిరుత్సాహ పరుస్తావా అసూయపడుడా...." వాడి ధాటికి ఆగలేకపోయేను.

"స రి స రి ... నీవిట్లా రాయొద్దు. పూర్తిగా తెలుగులో కానీ, పూర్తిగా ఇంగ్లీషులో గానీ రాయి" అని ఆ కాగితం తిరిగి వాడికి ఇచ్చేశాను.

"సరే...తెలుగులోనే రాస్తాను"అంటూ మళ్ళీ మొదలుపెట్టాడు. కాస్సేపటికి తిరిగి నావంక చూశాడు. నేను భయం భయంగా తీసుకొని చదవడం మొదలెట్టాను.

"ఒక వూరిలో ఒక మహావిద్యాలయ ముండెను. అందులో ఒక విద్యార్థి, ఒక విద్యార్థిని చదువుచున్నారు..."

నేనాశ్చర్యపోయి, "అరే...ఏమిటిది? ఏ కాలేజీలోనైనా ఒకే విద్యార్థి, ఒకే విద్యార్థిని వుంటారా?" అన్నాను.

"ఓరి వెధవా ! మిగిలిన పిల్లలూ, పిల్లగాళ్ళూ,లెక్చరర్లూలిస్టు రాస్తూ టైమ్‌వేస్టు ఎవడుచేస్తాడూ ! వీళ్ళిద్దరే మనకి ముఖ్యం" అంటూ ఓ పోజుపెట్టి మరో సిగరెట్ వెలిగించాడు.

"అయినా నాకు నచ్చలేదు ఈ కథ" అన్నాను ధైర్యంగా.

"అయితే చదవకు! నీకు నచ్చకపోతే మరొకటి రాస్తానులే" అంటూ నా చేతి లోంచి పేపర్లు లాక్కున్నాడు.

వాడికేం సమాధానం చెప్పకుండా చేతిలో పుస్తకం పట్టుకుని చదువుతూ మధ్య మధ్యలో వాడివంక చూస్తూ

కూర్చొన్నా. తల పైకెత్తి నోరు తెరచి పెన్ను పళ్ళమధ్య పట్టుకుని ఆలోచిస్తూ కనపడ్డాడు. ఓ గంట తర్వాత కూడా అట్లానే కదలిక లేకుండా కనపడేసరికి 'ఏమిట్రా..పీడి దీర్ఘాలోచన' అనుకుంటూ దగ్గరికెళ్ళి చూశా.

అప్పారావ్ గాఢనిద్రలో వున్నాడు.

—కస్తూరి రాజశేఖర్

## గొడుగు

ఆఫీసునుంచొస్తూనే హడావుడిపడిపోతూ, ఇల్లంతా వెదకసాగేడు రామారావు.

బీరువాలు, చిలక్కొయ్యలు, మంచం పైన, మంచం కింద, బీరువాల వెనుక, వారేసిన తలుపుల వెనుక...ఒకటేమిటి అన్నీ వెతికేడు. అతనికి కావల్సిన వస్తువు కన్పించలేదు. విసుక్కలిగింది. చిరాకు పెరిగిపోయింది.

వంటింట్లోని భార్యను పిలిచి అడిగేడు. తనకేమీ తెలీదంది. ఇంకేం వెదుకుతాడు గనుక...? అప్పుడికే ఇల్లంతా అంగుళం మేర జాగా కూడా విడిచిపెట్టకుండా వెతికాడు. కానీ...ఫలితం కన్పించలేదు.

సరిగ్గా... ఇదే సమయంలో స్కూలు నుంచి వచ్చిన రామారావు ఏకైక పుత్రుడు 'చంటి' రామారావు చేతిలో ఓ చీటీ వుంచి లోపలికి తుర్రుమన్నాడు. ఆ చీటి విప్పేడు రామారావు చిరాగ్గా...అందులో—

"ఫలానా రామారావుగార్కి,... మీ అబ్బాయి 'చంటి' స్కూల్లో చేస్తున్న అల్లరి మాకు నచ్చలేదు. అందువల్ల మీరు అర్జంట్‌గా రేపు స్కూలుకు రావలసింది. మీరు రాకపోయిన పక్షంలో మీవాడి మీద 'చర్య' తీసుకొనబడుతుందని తెలియ చేయడానికి సంతోషిస్తున్నాం" అని వుంది.

రామారావు అవాక్కయిపోయేడు.

"ఏం జరిగిందిరా వెధవా??" కళ్ళెర్ర చేస్తూ కొడుకు చంటిని ప్రశ్నించాడు.

వాడు బిక్క ముఖం పెట్టేసి పేంటు తడిపేసుకున్నాడు పాపం.

*  *  *

మర్నాడుదయాన్నే చంటి వెధవను తీసుకుని స్కూలుకి పరిగెత్తేడు. ప్రిన్సిపాల్ రూంలోకి అడుగు పెడుతూనే అక్కడ టేబులు మీదనున్న వస్తువును చూసి తక్కున ఆగిపోయేడు రామారావు.

ఆ వస్తువు రామారావు నిన్నటి నుంచి వెదుకుతున్న స్ప్రింగ్ లైపు గొడుగు. అదిప్పుడు ప్రిన్సిపాల్ రూంలో వుంది. నిజానికి ఆ గొడుగు అతనిది కాదు. ఆఫీసులో కొలీగ్ అప్పారావుది. అతన్ని అడిగి తెచ్చేడు.

"ఈ గొడుగు ...?" ఆత్రంగా ప్రశ్నించాడు రామారావు ప్రిన్సిపాల్‌ను.

"అదే అసలు తగువు. ఈ గొడుగు మాదీ అని మీవాడూ, కాదు మాదీ అని మీవాడి క్లాసులో చదివే 'బుజ్జి'గాడూ ఒకర్నొకళ్ళు తన్నుకున్నారు. లాక్కున్నారు. పీక్కున్నారు. వీళ్ళ దెబ్బలాటలో ఆ గొడుగు కాస్తా విరిగి పోయిందిప్పుడు.

గొడుగెవరిదైనా సరే, గొడవలాడుకుని మా స్కూలు డిసిప్లిన్‌కు భంగం కలిగించేరుగనుక మీవాడి మీదా, ఆ కుర్రాడి మీదా చర్య తీసుకోబోతున్నాం అని తెలియచేయడానికి సంతోషిస్తున్నాం"

అని నోర్మూసుకుంది ప్రిన్సిపాల్.

రామారావు నోటి వెంబడి మాటలు రాలేదు. చంటి వెధవ చేసిన పనికి అక్కడే వాడిని నాలుగు వాయిద్దామన్పించింది.

"ఈ గొడుగు మాదేనండి!! మా అబ్బాయే తెచ్చాడు. నిన్నట్నించి దీని కోసం ఇంట్లో వెదుకుతున్నాం. పోన్లెండి ఈసారికి క్షమించండి!" అన్నాడు ప్రిన్సిపాల్ వేపు జాలిగా చూస్తూ.

"అదెలా కుదురుతుంది? డిసిప్లినంటే డిసిప్లినే! మేం ఊరుకోం. మీ గొడుగును మాదని విరిచేసిన ఆ బుజ్జిగాడిదగ్గర్నుంచి గొడుగు ఖరీదు వసూలుచేసి మీకిస్తాం. గొడుగును వాడికే ఇస్తాం. రేపో, ఎల్లుండో ఆ గొడుగు ధర మీకు పంపిస్తాం" అంది ప్రిన్సిపాల్.

పాపం రామారావు ఆవిడ మాటలకు మెత్తబడ్డాడు. గొడుగు పాడయిపోయినందుకు ఖరీదును రేపో ఎల్లుండో తిన్నగా తీసుకెళ్ళి ఆఫీసులో అప్పారావుకి ఇచ్చేసి సారీ చెప్పేయ్యవచ్చునని అనుకున్నాడు మనసులో.

"అలాగే చెయ్యండి ... మీ ఇష్టం" అనేసి ఇంటికొచ్చేసేడు.

*  *  *

మరునాడుదయం ఆఫీసుకు వస్తూనే కొలీగ్ అప్పారావు దగ్గరకు వెళ్ళి జరిగిందంతా చెప్పి సారీలు గీరీలు చెప్పేసి ఆనక అతని గొడుగు ఖరీదు ఇచ్చేద్దామని నోరు విప్పబోయేడు రామారావు.

అప్పటికే అప్పారావు యమసీరియస్‌గా ఉన్నాడు. కోపంతో బుసలుకొడుతున్నాడు. పళ్ళు నూరుతున్నాడు. కారాలూ, మిరియాలూ నూరుతున్నాడు.

ఏదో అనబోతున్న రామారావును ఒక్క కేకతో ఆపేసేడు అప్పారావు.

"చాల్చాల్లెండి రామారావుగారూ! వర్షం వస్తున్నదని చెప్పి బంగారంలాంటి నా స్ప్రింగ్ గొడుగు తీసుకెళ్ళి మీ అబ్బాయికిచ్చింది చాలక అది స్కూల్లో మా అబ్బాయి బుజ్జిగాడే విరిచేసేడని మా దగ్గర్నుంచే గొడుగు ఖరీదు వసూలు చేద్దామనుకుంటున్నారా...??ఛీఛీ...!!!" అన్నాడు ఆగ్రహంతో.

-యం. ఉమామహేశ్వరరావు




నిర్మాత: రామోజీరావు స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: టి. కృష్ణ

నిర్వహణ: అట్లూరి రామారావు

సంగీతం: చక్రవర్తి కెమెరా: ఎస్. నవకాంత్ కళ: భాస్కరరాజు కూర్పు: గౌతంరాజు నృత్యాలు: శేష